# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 14 సంచిక : 11 హైదరాబాద్ 184 నవంబర్ 2016 పేజీలు : 68 రు. 20

* ఆంధ్ర-ఒడిశా సరిహద్దు మారణకాండ
* శాస్త్రీయతలేని జిల్లాల పునర్విభజన
* బుద్ధవాదులూ యుద్ధవాదులూ
* కావేరి జలాల వివాదం
* మహారాష్ట్ర మరాఠాల మోర్చాలు
* అగ్రరాజ్యాలతో భారత్ ఆయుధ బంధం
* డబ్ల్యుటిఒను బ్రిక్స్ సవాలు చేస్తుందా?

# రాయలసీమ ప్రాంత వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం

## అక్టోబర్ 23, 2016 ఆదివారం - ప్రొద్దుటూరు

























184 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

నవంబర్ 2016
సంపుటి : 14
సంచిక : 11







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

## వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 అక్టోబర్ నెలలో వచ్చిన విరాళాలు - శ్రేయోభిలాషులు, హైదరాబాద్ - రు. 34,500; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం సెప్టెంబర్ సంచికలో నయీమొద్దీన్ ఎన్‌కౌంటర్‌పై ఎడ్ల కొమురయ్య రాసిన వ్యాసం విప్లవోద్యమాన్ని అణచడానికి ప్రభుత్వాలు అవలంబిస్తున్న చట్ట వ్యతిరేక విధానాల గురించి వివరంగానే చర్చించిండు. అయితె ఒకటి రెండు చోట్ల చిన్నపాటి పొరపాట్లు దొర్లాయి. నయీం తమ్ముడు అలీముద్దీన్ హత్య బెల్లి లలిత హత్య తరువాత కొన్నాళ్లకు జరగడమే కాక, లలిత సొంత అన్న బెల్లి క్రిష్ణతో పాటు ఒకరిద్దరు ముద్దాయిలుగా ఆరోపించబడి అరెస్ట్ కూడా అయినట్లు జ్ఞాపకం...? అలాగే, పౌరహక్కుల పురుషోత్తం హత్యలో నయీంతో పాటు బయ్యపు సమ్మిరెడ్డి కూడా పాల్గొన్నాడు. వ్యాసం మొత్తంపైగా సమగ్రంగానే ఉన్నప్పటికీ, నిజామాబాద్‌కి చెందిన హరిభూషణ్ కార్యకలాపాలపై రాసి ఉంటే ఇంకా బాగుండేది.

**- ఆర్. కస్తూరి**
ఇమెయిల్ ఉత్తరం

నేను గత పది సంవత్సరాలుగా వీక్షణం పాఠకుణ్ని. వీక్షణం పత్రిక చదవడం వల్ల సమాజంలో జరుగుతున్న పరిణామాల గురించి తెలుసుకునే వీలు కలుగుతోంది. అట్లాగే వీక్షణంలో రంగనాయకమ్మ రచనలు వచ్చిన ప్రతిసారి వాటిని సమర్థిస్తూ, వ్యతిరేకిస్తూ చర్చ పేరుతో రాస్తున్నారు. అందులో చర్చ కన్నా భక్తి ఎక్కువగా కనబడుతోంది. ఎందుకంటే రాసేవాళ్లు మనవాళ్లైతే అంతా కరెక్టే అన్న ధోరణిలో కొనసాగుతోంది. ఇది చర్చ కన్నా వ్యక్తుల మధ్య ద్వేషాన్ని పెంచేదిగా ఉంది తప్పించి రాసిన రచనలో ఎంతవరకు సమర్థనీయమైనది, ఎంతవరకు సమర్థియనీయం కానిది అనేదే మనకు ఆ చర్చ పేరుతో సాగుతున్న రచనల్లో ఎక్కడా కనబడదు. ఇలాంటి రచనల వల్ల ఏది సరైనదో, ఏది కాదో అనేది నాలాంటి పాఠకులకు గందరగోళంగా ఉంది. అట్లాగే వీక్షణంలో సమకాలీన అంశాల మీద వ్యాసాలు క్రమంగా ఉంటున్నాయి. ఇవి ఎప్పటికప్పుడు సమాజంలో చోటు చేసుకుంటున్న రాజకీయ, ఆర్థిక, సామాజిక మార్పులను, పాలకుల స్వభావాలను అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతున్నాయి. నేడు సామాజిక దృక్పథంతో వస్తున్న పత్రికలు చాలా అరుదు. కాబట్టి వీక్షణం పత్రిక కృషి ఇప్పుడున్న సందర్భంలో సమాజానికి చాలా అవసరం. పత్రికను నిలబెట్టుకోవడానికి పాఠకులుగా మనం బాధ్యత పడాల్సిన అవసరం ఎంతైనా ఉందని నేను భావిస్తున్నాను.

**- టి. రాములు**
సిద్దిపేట

వీక్షణం అక్టోబర్ సంచికలో 'తలవంచని కశ్మీర్' వ్యాసం చిన్నదైనా చాల ఆలోచింపజేసేదిగా ఉంది. కశ్మీర్ లోయలో ప్రజల అసంతృప్తి పెరిగిపోతోంది. ఈ నేపథ్యంలోనే ఉడి దాడి చోటు చేసుకోవడం మరొక అంశం. కశ్మీర్‌లో గత మూడు నెలలుగా కర్ఫ్యూ వల్ల ప్రజలు తీవ్ర అవస్థలు పడుతున్నారు. నిరసనకారులపై విచక్షణారహితంగా భద్రతా బలగాలు పెల్లెట్ల ఉపయోగం, శాంతి భద్రతల పేరుతో పెద్ద ఎత్తున నిర్బంధం ఎందరో సామాన్యులు ప్రాణాలను బలిగొన్నది. దీన్ని రచయిత చాలా వివరణాత్మకంగా వివరించారు.

**- తుంపాల శ్రీరామమూర్తి**
గాజువాక, విశాఖపట్నం

జిల్లాల విభజనపై వచ్చిన వ్యాసం వివరంగా రాశారు. తెలంగాణలో జిల్లాల విభజన వల్ల ఎవరికి లాభం చేకూరుతుందో స్పష్టంగా తెలిపారు. 'దళితులకు ప్రాణాంతకమైన గోరక్షణ' వ్యాసం చాలా విశ్లేషణతో వచ్చింది. దళితుల పట్ల జరుగుతున్న అమానుష దాడులను ప్రతిఘటించడానికి పురికొల్పే విధంగా ఉంది. రచయితలకు అభినందనలు. వీక్షణం ఇలాంటి సామాజిక అంశాలతో, విశ్లేషణాత్మక వ్యాసాలు మరిన్ని ప్రచురించి, పాఠకులకు మరింత అవగాహన పెంచేదిగా ఉండాలని కోరుకుంటున్నాను.

**- జగన్నాథరావు**
నిజామాబాద్

ఏపికి ప్రత్యేక హోదాపై వచ్చిన వ్యాసాలు బాగున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రజలకు హోదా వల్ల, ప్రత్యేక ప్యాకేజీ వల్ల ఎటువంటి లాభాలు చేకూరవు. వీటివల్ల రాజకీయ నాయకుల, పెట్టుబడిదారులకే ప్రయోజనం ఎక్కువ. ఇటు తెలంగాణలో కూడా జిల్లాల విభజన వల్ల కూడా వీరికే ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. ఎక్కడైనా సరే రాజకీయ నాయకులు ప్రజలను మోసం చేసేందుకు అమలు కాని వాగ్దానాలతో మోసపుచ్చడం తప్ప వేరే ఏమీ లేదని తొందరలోనే ప్రజలు తెలుసుకుంటారు. ఇది మరో ప్రజా ఉద్యమానికి దారితీస్తుంది. వీక్షణం రెండు తెలుగు రాష్ట్రాలకు సంబంధించిన వ్యాసాలు మరింత వివరణాత్మకంగా ప్రచురించాలని ఆశిస్తున్నాను.

**- బి. నాగరాజు**
సూర్యాపేట

అక్టోబర్ సంచికలో మార్కండేయ కట్జు సుప్రీంకోర్టు జడ్జిలకు రాసిన లేఖ ఆలోచనాత్మకంగా ఉంది. న్యాయవ్యవస్థలో పని చేసిన వ్యక్తి నుంచి వచ్చిన లేఖ కాబట్టి దీనికి చాలా ప్రాధాన్యత ఉంటుంది. న్యాయవ్యవస్థ తీరును కళ్లకు కట్టింది. ఇది న్యాయవ్యవస్థకే మేలుకొలుపు వంటిది.

**- వై. రమణ**

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

*గమనిక : అక్టోబర్ సంచికలో మంజరి లక్ష్మి చర్చ వ్యాసంలో కొన్ని చోట్ల '–' కు బదులు '?' అని తప్పుగా అచ్చయినవి. అచ్చు తప్పుకు చింతిస్తున్నాం. – సం*

# యుద్ధోన్మాదుల భారీ కొనుగోళ్లు

ఒకప్పుడు ప్రపంచవ్యాప్తంగానూ, భారతదేశంలోనూ బలంగా వీచిన శాంతి ఉద్యమం 'అణ్వస్త్రాలు వద్దు, అన్నవస్త్రాలు కావాలి' అని నినదించేది. ఇవాళ అన్నవస్త్రాలను మరిచిపోయే అభివృద్ధి మాయాజాలం వ్యాపిస్తున్నది. అణ్వస్త్రాలు పోగు చేసుకోవడమే అభివృద్ధి అని ప్రజలను నమ్మించి, భ్రమలు కల్పించి, దేశభక్తి అనే ఉన్మాదాన్ని రెచ్చగొట్టి ఆయుధ సేకరణనే దేశాభివృద్ధిగా చూపించడం జరుగుతున్నది. వలసానంతర భారతదేశంలో ఏడు దశాబ్దాలుగా సాగుతున్న నాటకం ఇదే గాని, దేశభక్తి తమ గుత్తసొమ్ము అని భావించే సంఘ్ పరివార్ శక్తులు కూడ దేశ రక్షణ రంగాన్ని బహుళ జాతి సంస్థల చేతుల్లో పెట్టడానికి, సామ్రాజ్యవాద ఆయుధ వ్యాపారుల రథచక్రాలకు కట్టివేయడానికి ఎంతమాత్రం సంకోచించడం లేదు. రెండున్నర సంవత్సరాలుగా సాగుతున్న ఈ ద్వంద్వనీతి సెప్టెంబర్ చివరివారంలో ఫ్రాన్స్ లోని డాసో ఏవియేషన్ అనే బహుళ జాతి సంస్థతో రాఫేల్ ఫైటర్ జెట్ విమానాలు కొనడానికి కుదుర్చుకున్న ఒప్పందంతో మరింత బహిర్గతమయింది. ఈ ఒప్పందం ప్రకారం భారత రక్షణ శాఖ అరవై వేల కోట్ల రూపాయలు చెల్లించి 36 యుద్ధ విమానాలను కొనుగోలు చేస్తుంది.

దేశ రక్షణ వ్యవస్థకు ఈ యుద్ధ విమానాలు అవసరమేనా అనే ప్రశ్న మొదటిది. పాకిస్తాన్, చైనా సరిహద్దులలో భారత వైమానిక దళానికి 40-42 స్క్వాడ్రన్లు (స్క్వాడ్రన్ అంటే కొన్ని యుద్ధ విమానాలతో, సిబ్బందితో ఉండే ఒక వైమానిక దళ విభాగం. భారత వైమానిక దళంలో ఒక స్క్వాడ్రన్ లో 18 నుంచి 21 యుద్ధవిమానాలు ఉంటాయి) అవసరమనీ, కాని ప్రస్తుతం 30-32 స్క్వాడ్రన్లు మాత్రమే ఉన్నాయని, రాఫేల్ విమానాలు వస్తే మరొక రెండు స్క్వాడ్రన్లు తయారవుతాయనీ సైనిక నిపుణులు అంటున్నారు. ఆయుధ, యుద్ధ పరికరాల అవసరాలను అంచనావేస్తూ, ప్రభుత్వాలతో సంప్రదింపులు జరుపుతుండే "సైనిక నిపుణులు" సాధారణంగా బహుళ జాతి సంస్థల తరఫున వ్యాపారాలు కుదిర్చి పెట్టే దళారీలు. వారు ప్రభుత్వాధినేతలతో, రక్షణశాఖ మంత్రులతో, సైనికాధికారులతో నిత్య సంబంధంతో, ముడుపుల చెల్లింపులతో ఆయుధాల కొనుగోలు ఒప్పందాలు చేయిస్తుంటారు. కనుక దేశ రక్షణకు ఆ యుద్ధ విమానాలు అవసరమేనా అనే ప్రశ్న కన్న, ఎవరి ముడుపుల కోసం ఈ లావాదేవీలు జరుగుతున్నాయనే ప్రశ్న ప్రధానమైనది. యుద్ధ విమానాలే అవసరమైతే ఇంతకన్న మెరుగైనవీ, ఇంతకన్న చౌకగా దొరికేవీ అంతర్జాతీయ మార్కెట్ లో ఎన్నో ఉన్నాయని కూడ కొందరు సైనిక వ్యవహారాల నిపుణులు వ్యాఖ్యానిస్తున్నారు. వీరు నిజంగా భారత రక్షణ రంగాన్ని భారత ప్రజల అవసరాల వైపు నుంచి చూస్తున్నవారైనా కావచ్చు, లేదా పోటీ సంస్థల ఆయుధాలు, పరికరాలు అమ్మడానికి ప్రయత్నిస్తున్నవారైనా కావచ్చు.

ఇరవై సంవత్సరాల కింద సుఖోయి అనే ఇటువంటి యుద్ధ విమానాలనే భారత రక్షణ శాఖ రష్యానుంచి కొనుగోలు చేసింది. ఆ ఒప్పందంలో భాగంగానే సుఖోయి సహకారంతో హిందూస్తాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ యుద్ధ విమానాలను తయారు చేయడం ప్రారంభించింది. సుఖోయి, రాఫేల్ యుద్ధ విమానాలను పోల్చినప్పుడు రెండిటి సామర్థ్యం దాదాపు సమానమే అయినా, సుఖోయి ఖరీదు కన్న రాఫేల్ ఖరీదు రెండున్నర రెట్లు ఎక్కువ అని వార్తలు వస్తున్నాయి. అంటే ప్రధాని నరేంద్ర మోడీ, రక్షణ శాఖ మంత్రి మనోహర్ పర్రికర్ ల నాయకత్వంలో సంఘ పరివార్ దేశభక్త ప్రభుత్వం అరవై వేల కోట్ల రూపాయలు వెచ్చించి ఎక్కువ పనికి రాని యుద్ధ విమానాలను ఎక్కువ ధరకు కొంటున్నదన్నమాట. సామ్రాజ్యవాద ఒత్తిళ్లకు, ముడుపుల ఆకర్షణలకు లొంగడమే స్వదేశాభిమానం అన్నమాట!

ఇంతకూ వంద సంవత్సరాలకు పైబడిన శాస్త్ర, సాంకేతిక, పారిశ్రామిక చరిత్రలో, ఏడు దశాబ్దాల స్వతంత్ర ప్రభుత్వ రంగ రక్షణ పరికరాల పరిశ్రమకు ఇటువంటి యుద్ధ విమానాలను తయారుచేసే సామర్థ్యం లేదా అనేది మరొక ప్రశ్న. గత సంవత్సరం ఒక ఉపన్యాసంలో ప్రధాని మోడీ అంతర్జాతీయ ఆయుధాల దిగుమతుల జాబితాలో మొదటి స్థానంలో ఉన్న భారతదేశాన్ని ఆ స్థానం నుంచి తప్పిస్తానని, ఐదు సంవత్సరాల్లో మొత్తం రక్షణరంగ ఆయుధ అవసరాల్లో 70 శాతం స్వదేశంలో తయారు చేసేలా చూస్తానని అన్నాడు. ఆ తర్వాత కొద్ది నెలలకే భారత రక్షణ పరిశ్రమల రంగంలో నూటికి నూరు శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు ఆమోదముద్ర వేశాడు. రాఫేల్ యుద్ధవిమానాల కొనుగోలు విషయంలోనే చూస్తే, ఈ కొనుగోళ్ల సంప్రదింపులు ఎప్పుడో యుపిఎ ప్రభుత్వ కాలంలోనే మొదలయ్యాయి. పాత ప్రభుత్వం 126 రాఫేల్ యుద్ధ విమానాలను కొనడానికి ప్రతిపాదించిందని, తాను అందుకు సిద్ధంగా లేనని ప్రస్తుత రక్షణ మంత్రి మనోహర్ అన్నాడు. ఆ మాట అని కొన్ని నెలలు గడవకుండానే అదే రాఫేల్ తో కొనుగోలు ఒప్పందం మీద సంతకం చేశాడు. అంటే సంఘ్ పరివార్ శక్తులకు దేశాభిమానమూ లేదు, స్వావలంబన ఆకాంక్షా లేదు, కనీసం చెప్పిన మాట మీద నిలబడే చిత్తశుద్ధి కూడ లేదు.

ఇది ఆయా పదవుల్లో ఉన్న వ్యక్తుల మంచి చెడుల, సామర్థ్యాల సమస్య కాదు. వారు కేవలం పాలకవర్గాల నమ్మినబంట్లలా ఆ రాజకీయాధికారాన్ని వెలగబెడుతున్నారు. అలా నమ్మిన బంట్లలా ఉన్నంతకాలమే వారు ఆ పదవుల్లో ఉండగలరు. భారత పాలకవర్గాలంటే బడా భూస్వామ్య, బడా పెట్టుబడిదారీ, దళారీ పెట్టుబడిదారీ వర్గాలు. వారికి ఈ దేశంలో మనుధర్మపు అంతరాలు యథాతథంగా కొనసాగాలి. సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తుతూ దళారీలుగా సాగించే పెట్టుబడిదారీ దోపిడీ విస్తరించాలి. ఈ విధానాల వల్ల ప్రజల్లో అసంతృప్తి ప్రబలిపోతున్నా దాన్ని అణచివేస్తూ, తప్పుడు భావజాలాల కింద, దేశభక్తి, అభివృద్ధి, పొరుగుదేశం, ఘనమైన సంస్కృతి పేర్లమీద ప్రజలను పక్కదారి పట్టిస్తూ పాలన సజావుగా సాగించుకోవాలి. అసంతృప్తి పెరిగితే మతవిద్వేషాలను, యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టి ప్రజల దృష్టిని మళ్లించాలి. ఈ షడ్యంత్రాన్ని ప్రజలకు విప్పిచెప్పి దీన్ని బద్దలు చేసే సంఘటిత, నిర్మాణయుత, సమరశీల చైతన్యాన్ని ప్రోది చేయడమే ఇవాళ బుద్ధిజీవుల కర్తవ్యం.

వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ప్రజా అసంతృప్తిని పక్కదారి పట్టించే జిల్లాల విభజన

తెలంగాణ ఏర్పడిన తర్వాత పాలనా అవసరాల కోసం, వికేంద్రీకరణ కోసం జిల్లాలను విభజిస్తామని, కొత్త జిల్లాలు ఏర్పాటు చేస్తామని తెలంగాణ రాష్ట్ర సమితి ఉద్యమ సమయంలోనూ, 2014 ఎన్నికల ప్రణాళికలోనూ ప్రకటించింది. ఆ సమయంలో చేసిన చాల వాగ్దానాలను అమలు చేయకపోయినా, దీన్ని మాత్రం తన రాజకీయ ప్రయోజనాల కోసం అమలు చేయడానికి సిద్ధపడింది. జనాభా, విస్తీర్ణం, జిల్లా కేంద్రానికీ మారుమూల గ్రామాలకూ మధ్య దూరం, ప్రజలకు ప్రభుత్వ సేవలు అందుబాటులో ఉండడం వంటి ప్రమాణాలతో జిల్లాల శాస్త్రీయ పునర్విభజన జరగవలసిన అవసరం తెలంగాణలో నిజంగానే ఉండింది. ఆ ప్రమాణాల ప్రకారం నాలుగైదు కొత్త జిల్లాలు రూపొందించడానికి అవకాశం ఉండింది. కాని, తెరాస ప్రభుత్వం మొదట పద్నాలుగు కొత్త జిల్లాలు చేసే ప్రతిపాదనతో ప్రారంభించి ప్రస్తుతం ఇరవై ఒక్క కొత్త జిల్లాలు తయారుచేసింది. ఏ శాస్త్రీయ ప్రమాణానికీ లొంగని పునర్వ్యవస్థీకరణ ఇది. జనాభా, విస్తీర్ణం వ్యత్యాసాలు, జిల్లా కేంద్రానికీ మారుమూల ప్రాంతాలకూ దూరం వంటి ప్రమాణాలు గతంలో ఎట్లా ఉన్నాయో ఇప్పుడూ అట్లాగే ఉన్నాయి. ప్రభుత్వ సేవలు ప్రజలకు అందుబాటులోకి రావడానికి కావలసింది, కార్యాలయం దగ్గరగా ఉండడం కాదు, ప్రభుత్వోద్యోగులు తమను తాము ప్రజాసేవకులుగా భావించుకోవడం. అధికార వర్గాలలో ఆ మార్పు ఇంకా రాలేదని, అవినీతి, ఆశ్రితపక్షపాతం, సాధారణ ప్రజలకు అవసరమైన పనులు చేయడంలో అలసత్వం పాత ఆంధ్రప్రదేశ్‌లో లాగనే సాగుతున్నాయని వార్తలు వస్తున్నాయి. కనుక జిల్లాల పునర్వ్యవస్థీకరణకు ప్రకటిత లక్ష్యాలన్నీ దెబ్బతినిపోయాయి. మరి ప్రకటిత లక్ష్యాలు దెబ్బతిన్నాయంటే, అప్రకటిత లక్ష్యాలేవో ఉన్నాయనుకోవాలి. నిజంగానే, ఇప్పటికి ఒక ఆర్థిక లక్ష్యమూ ఒక రాజకీయ లక్ష్యమూ బైటపడుతున్నాయి. తెలంగాణలో రియల్ ఎస్టేట్ వ్యాపారుల వర్గానికి ప్రయోజనాలు చేకూర్చడం, అధికారపార్టీకి బంగారు గుడ్లు పెట్టే బాతు వంటి ఒక ఆర్థిక వనరును సమకూర్చుకోవడం ఆ ఆర్థిక లక్ష్యం. కొత్త జిల్లా కేంద్రాల చుట్టుపట్ల ఎకరాల లెక్కలో ఉండిన భూమి గజాల లెక్కలోకి మారింది. భూమి ధరలు ఎన్నోరెట్లు పెరిగి మధ్యతరగతికి కూడ అందుబాటులోకి రాకుండా పోయాయి. కేవలం రాజకీయ ప్రాపకం ఉన్న రియల్ ఎస్టేట్ వ్యాపారులు మాత్రమే లాభపడ్డారు. ఈ ఆర్థిక లక్ష్యానికి తోడు, అధికార పార్టీలోనే ఉన్న వేర్వేరు ముఠాలకు వేర్వేరు జిల్లాలను జాగీర్లుగా రాసి ఇచ్చే అవకాశానికి జిల్లాల పునర్వ్యవస్థీకరణ దారి తీసింది. అడ్డగోలుగా ఇతర పార్టీల నుంచి నాయకులను అధికారపార్టీలోకి ఆకర్షించడంతో ఒక్కొక్క జిల్లాలో పరస్పర వ్యతిరేకమైన నాయకులు కిక్కిరిసిన స్థితి నుంచి, ఎవరి జిల్లా వారికి అప్పనంగా ఇచ్చేసే స్థితి జిల్లాల పునర్వ్యవస్థీకరణతో ఏర్పడింది. ప్రజలు మాత్రం తాము ఉండవలసిన జిల్లాలో లేమనే, విభజన మరొక రకంగా ఉంటే బాగుండుననే అసంతృప్తులతో, మనస్తాపాలతో మిగిలిపోయారు. పాలన మీద, వాగ్దానాల ఉల్లంఘన మీద, ఆంధ్రప్రదేశ్ పాలన వంటి పాలనే కొనసాగుతుండడం మీద ఉండవలసిన ప్రజా అసంతృప్తి ఇప్పుడు జిల్లాల విభజన మీదికి మారింది. ఇలా ప్రజా అసంతృప్తిని పక్కదారి పట్టించేందుకే జిల్లాల విభజన. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# పాలక విధానమా? శాంతిభద్రతలా?

చంద్రబాబు నాయుడు గతంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు, విప్లవోద్యమాన్ని అణచివేసి రాష్ట్రాన్ని శాంతిమండలంగా మార్చమని ప్రపంచ బ్యాంకు ఆయనను ఆదేశించింది. 1969లో మొదలైన ఎన్‌కౌంటర్ హత్యలను 1998లో అతి ఎక్కువ సంఖ్యలో చేసి రికార్డు సృష్టించి ప్రపంచ బ్యాంకు ప్రశంసలు సంపాదించారు. మళ్లీ కొత్త ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కాగానే 21 మంది రక్తచందనం కూలీలను కాల్చి చంపి తన స్వభావాన్ని మరొకసారి బహిర్గతం చేసుకున్నారు. ఆ వరుస కొనసాగింపే ఇవాళ బెజింగి మారణకాండ. నిజానికి ఈ మారణకాండ జరిగిన ప్రాంతం సాంకేతికంగా పొరుగురాష్ట్రమైన ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లాకు చెందినదైనప్పటికీ, ఆ హత్యాకాండకు వ్యూహరచన చేసినవారు, సాగించినవారు ఆంధ్రప్రదేశ్ పాలకులూ, ఆంధ్రప్రదేశ్ కు చెందిన గ్రేహౌండ్స్ బలగాలే. ఇతర రాష్ట్రాలలోకి వెళ్లి ఇటువంటి హత్యాకాండలు, హత్య సాధ్యం కాకపోతే అరెస్టులూ సాగించిన చరిత్ర ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో స్పెషల్ ఇంటిలిజెన్స్ బ్యూరోది. అదే విధంగా ప్రస్తుతం సరిహద్దు దాటి వెళ్లి, విషాహార ప్రయోగం వల్లనో, నిరాయుధంగా ఉండే సమయంలోనో, ఏమరపాటుతోనో ఉన్న విప్లవకారుల మీద అనూహ్యంగా దాడి చేసిన గ్రేహౌండ్స్ బలగాలు మొదట ఇరవై నాలుగు మందిని చంపామని చెప్పుకున్నాయి. ఆ సంఖ్య క్రమక్రమంగా పెరుగుతూ వచ్చి ప్రస్తుతానికి 34గా ఉంది. ఇంత పెద్ద హత్యాకాండ జరిగితే, దాని బాధ్యత తీసుకుని ప్రకటించవలసిన ఆంధ్రప్రదేశ్ పాలకులు ఐదు రోజులు గడిచినా ఇదంతా పోలీసుల వ్యవహారం అన్నట్టు వ్యవహరిస్తున్నారు. ముఖ్యమంత్రి గాని, హోం మంత్రి గాని ప్రకటించవలసిన రాజకీయ అంశాలను కూడ రాష్ట్ర పోలీసు డైరెక్టర్ జనరలో, విశాఖపట్నం ఎస్పీనో ప్రకటిస్తున్నారు. ఇలా పాలనాధికారాలను సంపూర్ణంగా శాంతి భద్రతల యంత్రాంగం చేతికి అప్పగించడం ప్రజాస్వామిక పాలన అని పిలవడానికి ఏ రకంగా అర్హమవుతుందో ప్రభుత్వపాలనా శాస్త్రవేత్తలు చెప్పాలి. ఇంతకూ ఈ హత్యాకాండ అటు ప్రజాస్వామిక పాలనాధికారానిదీ కాదు, శాంతి భద్రతల యంత్రాంగానిదీ కాదు. ఇది పూర్తిగా విశాఖపట్నం ఏజెన్సీలోని బాక్సైట్ ఖనిజ నిలువలను బహుళజాతి సంస్థలకు అప్పగించే దళారీతనంలో భాగమైన ఒకానొక చర్య మాత్రమే. విశాఖపట్నం ఏజెన్సీలో వన్ ఆఫ్ సెవెంటీ చట్టాన్ని కూడ ఉల్లంఘించి, బాక్సైట్ నిలువలను బహుళ జాతి సంస్థలకు అప్పగించాలని ఎప్పటినుంచీ ప్రయత్నిస్తున్న చంద్రబాబు దళారీ ప్రభుత్వానికి అక్కడి ఆదివాసుల ప్రతిఘటన కంట్లో నలుసులా ఉంది. ఆ ఆదివాసుల ప్రతిఘటనోద్యమానికి పూర్తి అండదండలు అందిస్తున్న మావోయిస్టు గెరిల్లా దళాలు అభ్యంతరకరంగా ఉన్నాయి. ఆదివాసులను భయోత్పాతానికి గురి చెయ్యాలంటే, మావోయిస్టులను నిర్మూలించాలంటే ఇటువంటి దొంగదెబ్బ తీసి కొందరు మావోయిస్టులను, కొందరు ఆదివాసులను చంపివేయడమే మార్గమని అత్యున్నత స్థాయిలో జరిగిన రాజకీయ నిర్ణయం ఫలితమే ఈ మారణ కాండ. ఆంధ్రప్రదేశ్ ప్రజల వనరులను కొల్లగొట్టి, బహుళజాతిసంస్థలకు అప్పగించడానికి జరుగుతున్న ఈ కుటిల యత్నంలోని అన్ని కోణాలనూ బహిర్గతం చేసి ప్రతిఘటించ వలసిన బాధ్యత ఆంధ్రప్రదేశ్ ప్రజలందరిమీద, ప్రత్యేకించి బుద్ధిజీవుల మీద ఉంది. వీ

# అమెరికా అధ్యక్షపీఠం ఎక్కనున్నదెవరు?

నవంబర్ 8 మంగళవారం నాడు అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగి ఆ దేశపు అధ్యక్ష స్థానంలో నలభై ఐదవ వ్యక్తిగా ఎవరు కూచోబోతున్నారనేది నిర్ణయమవుతుంది. డెమొక్రటిక్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ అనే రెండు పార్టీల వ్యవస్థ మధ్య అటూ ఇటూ ఊగిసలాడడం తప్ప మరొక ప్రత్యామ్నాయం లేని అమెరికా ప్రజలు ఒకసారి ఒక పార్టీకీ, మరొకసారి మరొక పార్టీకీ మార్చి మార్చి అధికారం ఇస్తూ వస్తున్నప్పటికీ, మౌలిక సమస్యల పరిష్కారం మాత్రం దొరకడం లేదు. పళ్లూడగొట్టుకోవ డానికి ఏ రాయైతేనేం అనే పద్ధతిలో చిరునామాలు మార్చినప్పటికీ ఒకే రకమైన విధానాలు కొనసాగుతున్నాయి. అంతకు ముందు రెండు పర్యాయాలు ఎన్నికైన రిపబ్లికన్ పార్టీకి చెందిన జార్జి బుష్ తర్వాత, డెమొక్రటిక్ పార్టీ అభ్యర్థిగా బారక్ ఒబామా కూడ రెండు పర్యాయాలు ఎన్నికయ్యారు. దేశ ఆంతరంగిక విధానాలలో కొన్ని మార్పులు, తేడాలు ఉన్నప్పటికీ, విదేశాంగ విధానంలో, అంతర్జాతీయ సంబంధాలలో, సైనిక-పారిశ్రామిక వ్యవస్థను బలోపేతం చేయడంలో ఈ రెండు పార్టీల, అభ్యర్థుల మధ్య తేడా ఏమీ లేదు. ఇస్లామోఫోబియాను ప్రచారం చేసి, అమెరికాను ఏ మాత్రమైనా వ్యతిరేకించే ఇస్లామిక్ దేశాల మీద, దేశాధినేతల మీద దాడులు, హత్యలు, హత్యా ప్రయత్నాలు, యుద్ధాలు జరిపించడంలో గత ఆరు దశాబ్దాల రిపబ్లికన్, డెమొక్రటిక్ పాలనల్లో తేడా ఏమీ లేదు. అసలు అమెరికా ప్రభుత్వ విధానాలన్నీ ఆయుధ వ్యాపారుల, సైనిక-పారిశ్రామిక వ్యవస్థాధిపతుల కనుసన్నల్లోనే ఉంటాయనేది కఠోర వాస్తవం. ఈ పరిస్థితి ఇలా ఉండగానే, 2016 అధ్యక్ష ఎన్నికలు ఒక విశిష్టతను సంతరించుకుంటున్నాయి. ఈసారి రిపబ్లికన్ అభ్యర్థిగా పోటీ పడుతున్న డొనాల్డ్ ట్రంప్ పచ్చి అభివృద్ధి నిరోధకుడుగా, ముస్లిం ద్వేషిగా, అమెరికాకు వలస వచ్చినవారి వ్యతిరేకిగా ఎన్నో అభ్యంతరకరమైన, అమానుషమైన వైఖరులను బహిరంగంగానే ప్రకటిస్తూ వచ్చాడు. ఆయనకు పోటీగా డెమొక్రటిక్ పార్టీ అభ్యర్థిగా ఉన్న హిల్లరీ క్లింటన్ అమెరికా చరిత్రలో అధ్యక్ష స్థానానికి పోటీ పడుతూ, గెలుపు అవకాశాలున్న తొలి మహిళగా ఉంది. వాస్తవ ఆచరణ ఎలా ఉన్నప్పటికీ కనీసం మాటల్లో డెమొక్రటిక్ పార్టీ ఎప్పుడూ కొంత ప్రగతిశీలంగా కనబడుతుంది. అయితే యుద్ధ విరమణ గురించి, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ లనుంచి సైన్య ఉపసంహరణ గురించి, ఇస్లామోఫోబియాను తగ్గించడం గురించి ఎన్నో వాగ్దానాలు చేసిన ఒబామా వాటిని నెరవేర్చని నేపథ్యంలో హిల్లరీ క్లింటన్, డెమొక్రటిక్ పార్టీ వాగ్దానాలకు విలువేమీ లేదు. ఎవరు గెలిచినా అమెరికా అగ్రరాజ్య ఆధిపత్యాన్ని, పెత్తందారీతనాన్ని, విదేశాల్లో సైనిక జోక్యాన్ని, తనను ప్రశ్నించే గల్ఫ్ దేశాల పట్ల శత్రుత్వాన్ని, ఇజ్రాయెల్ దుర్మార్గాల పట్ల ఉదాసీనతను కొనసాగించ వలసిందే. అధికారం ట్రంప్ చేతికి అంది ఈ విధానాలన్నీ బహిరంగంగా, నిస్సిగ్గుగా జరుగుతాయా, హిల్లరీ చేతికి అంది నింపాదిగా, పరోక్షంగా, సంకోచంగా జరుగుతాయా అనేదే వేచి చూడవలసి ఉంది. వీ





❖ **శృతి** – శ్రామిక – నవల – శ్రామిక ప్రచురణలు – 180 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: శ్రామిక ప్రచురణలు, టీచర్స్ కాలనీ, ఫేజ్ – 2, వడ్డేపల్లి, హనుమకొండ, వరంగల్ జిల్లా, ఫోన్ : 9177156128;



❖ **వి–వేకువ** – కవిత్వం – శ్రామిక ప్రచురణలు – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50,



❖ **ఈ తరం మార్గదర్శి** – (వివేక్ రచనలు–స్మృతులు) – శ్రామిక ప్రచురణలు – 181 పేజీలు, 1/8 డెమీ, రు. 100,

పై రెండు ప్రతులకు: శ్రామిక ప్రచురణలు, భగత్‌సింగ్ నగర్, సూర్యపేట, నల్లగొండ, ఫోన్ : 9440714535;



❖ **గ్రామీణ తెలంగాణ** – సామాజిక, ఆర్థిక దృశ్యం – నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 176 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్, ఎమ్.హెచ్. భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణ మండపం దగ్గర, హైదరాబాద్ – 20, ఫోన్ : 040–27660013;



❖ **ది హార్వెస్ట్** – (సేద్యంపై ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి దీర్ఘకావ్యం 'పొలి' ఆంగ్లానువాదం) – డా. పి రమేష్ నారాయణ – 121 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: డా. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, ఇ.నెం. 5/134, 7వ క్రాస్, భైరవ నగర్, జె.ఎన్.టి.యు వెనుక వైపు, అనంతపురం, ఫోన్ : 9440222117;



❖ **జాషువా స్వప్నం – సందేశం** – డా. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి – ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణ – 71 పేజీలు, 1/8 డెమీ, రు. 45, ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఇ.నెం. 27–1–64, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ – 520002, ఫోన్ : 0866 – 2577533;



❖ **పరాగభూమి** – కథలు – కలువకొలను సదానంద – పలమనేరు మిత్రసాహితి ప్రచురణలు – 220 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: పలమనేరు మిత్రసాహితి, ఇ.నెం. 6–219, గుడియాత్తం రోడ్డు, పలమనేరు, చిత్తూరు – 517408, ఫోన్ : 9440995010;



❖ **ఆకు కదలని చోట** – కవిత్వం – బాలసుధాకర్ మౌళి – సిక్కోలు బుక్ ట్రస్ట్ ప్రచురణ – 135 పేజీలు, 1/8 డెమీ, రు. 116, ప్రతులకు: సిక్కోలు బుక్ ట్రస్ట్, ఎంఐజి – 100, జడ్‌పి. ఎపిఎచ్‌బి కాలనీ ఎదురుగా, శ్రీకాకుళం – 532001, ఫోన్ : 9989265444;



❖ **మట్టి ముద్ర** – శ్రీ దుర్ముఖి నామ ఉగాది కవిత్వం–2016 – మామిడి హరికృష్ణ – తెలంగాణ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ ప్రచురణ – 169 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు: డైరెక్టర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ లాంగ్వేజ్ అండ్ కల్చర్, కళాభవన్, రవీంద్రభారతి, హైదరాబాద్



❖ **తెలుగు వర్ణాలతో తార్కిక పద్ధతి** – – డా. యం.సి. కేశవమూర్తి – దిక్సూచి పబ్లికేషన్స్ ప్రచురణ – 46 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: దిక్సూచి పబ్లికేషన్స్, ఇ.నె. 12–4–247, ఓబుళదేవనగర్, అనంతపురం, ఫోన్ : 9848603765, విశాలాంధ్ర పుస్తకాలయాలు;



❖ **గోరంత దీపం** – (బాల లయలు) – భూపాల్ – వెన్నెల ప్రచురణలు – 92 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: నవయుగ, దిశ, ప్రజాశక్తి, విశాలాంధ్ర, సహచార, తెలుగు బుక్‌హౌస్;




❖ **కె. శివారెడ్డి కవిత** – పక్కకి ఒత్తిగిలితే... – ఝరీ పోయట్రీ సర్కిల్ ప్రచురణ – 195 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ఝరీ పోయట్రీ సర్కిల్, ఇ.నె. 16–2–740/75/40, వి.కె. ధగె నగర్, గడ్డి అన్నారం, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 500060, ఫోన్ : 040 – 24064195;



❖ **స్వేచ్ఛా విహంగాలు** – విశ్వకవి రవీంద్రుని 'స్ట్రేబర్డ్స్' – తెలుగు: బొల్లోజు బాబా – 67 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: బొల్లోజు బాబా, ఇ.నెం. 30–7–31, సూర్యనారాయణ పురం, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా, ఫోన్ : 9849320443;



❖ **కువ్వ** – వర్గీకరణోద్యమ సంఘీభావ కవిత్వం – దప్పోల్ల రమేష్ – బహుజనం సాంస్కృతిక వేదిక ప్రచురణ – 155 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: తెలంగాణ బహుజనం మంత్లీ మ్యాగజైన్, కెరాఫ్. కెంపుల రాజు, ఇ.నెం. 4–8–111/ఎ, మంజీర నగర్, సంగారెడ్డి, మెదక్ – 502001, ఫోన్: 9550923323;



❖ **నిర్భయాకాశం కింద** – కవిత్వం – అనిశెట్టి రజిత – రుద్రమ ప్రచురణలు – 159 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: అనిశెట్టి రజిత, ఇ.నెం. 3–12–60, కుమార్‌పల్లి, హన్మకొండ, వరంగల్ – 506001, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో;



❖ **ఉపాధ్యాయ వ్యాసాలు** – ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ ప్రచురణ – 131 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్, ఇ.నెం. 29–7–22, సింగరాజు భవన్, విష్ణువర్ధనరావు వీథి, సూర్యారావుపేట, విజయవాడ – 2;

# బూటకపు తప్పుకాల కోసం మారణకాండ

***ఐదు దశాబ్దాల విప్లవోద్యమ చరిత్రలో ఒకేచోట అతి ఎక్కువ మంది విప్లవకారులను చంపిన బెజింగి హత్యాకాండను చారిత్రక, రాజకీయార్థిక నేపథ్యంలో వివరిస్తున్నారు ఎడ్ల పోచయ్య***

అక్టోబర్ 24 సోమవారం ఉదయం ఆంధ్రప్రదేశ్ – ఒడిశా సరిహద్దుల్లోని బలిమెల రిజర్వాయర్ వెనుకతట్టు ప్రాంతంలో కనీవినీ ఎరగని మారణకాండ ప్రారంభమయింది. ఆంధ్రప్రదేశ్ కు చెందిన గ్రేహౌండ్స్ బలగాలు సరిహద్దు దాటి ఒడిశాలోని మల్కన్ గిరి జిల్లాలోని బెజింగి కొండ ప్రాంతంలోకి వెళ్లి ఈ హత్యాకాండ మొదలుపెట్టాయి. గతంలో ఒకచోట దాడిచేసి విప్లవకారులను, ప్రజలను చంపేసి రావడమో, మరెక్కడో చంపి అడవిలో మృతదేహాలు పడేసి రావడమో అలవాటయిన పోలీసు బలగాలు ఈసారి ఎంతోమందిని పట్టుకుని, వారిలో రోజుకు కొందరిని చొప్పున రోజుల తరబడి చంపే అమానుష మారణకాండ సాగిస్తున్నాయి. అక్కడ మావోయిస్టు పార్టీ ఆంధ్ర – ఒడిశా సరిహద్దు కమిటీ ప్లీనరీకి ఏర్పాట్లు జరుగుతున్నాయని తమకు సమాచారం అందిందని, కూంబింగ్ కు వెళ్లిన తమ బలగాల మీద మావోయిస్టు గెరిల్లాలు కాల్పులు ప్రారంభించారని, అందులో ఇద్దరు గ్రేహౌండ్స్ జవాన్లు గాయపడ్డారని, తాము జరిపిన ఎదురుకాల్పుల్లో అటువైపు ఇరవై నాలుగు మంది మరణించారని మొదటి రోజు, మరొక ముగ్గురు మరణించారని రెండోరోజు, మరొక నలుగురు మరణించారని మూడోరోజు, మరొక ఇద్దరు మరణించారని నాలుగోరోజు పోలీసులు ప్రకటించారు. కొన్ని మృతదేహాల మీద తుపాకి కాల్పుల చిహ్నాలు ఉన్నాయి గాని, చాల మృతదేహాల మీద కత్తిగాట్లు, పొడిచిన, కోసిన చిహ్నాలు ఉన్నాయి. తుపాకి కాల్పుల చిహ్నాల విషయంలో కూడ ఆ కాల్పులు సమీపం నుంచి జరిగాయా, పోలీసులు చెపుతున్నట్టు దూరంనుంచి జరిగాయా సమగ్రమైన, సక్రమమైన శవపరీక్ష జరిగితేగాని తెలియదు.

సోమవారం ఉదయం ప్రాంభమైన ఈ మారణకాండ ఇది రాస్తున్న శుక్రవారం దాకా సాగుతూనే ఉంది. ఈ నాలుగు రోజుల్లో పోలీసులు అధికారికంగానూ, అనధికారికంగానూ తప్పుడు సమాచారాన్ని, గందరగోళపరిచే సమాచారాన్ని వెల్లడిస్తూ వచ్చారు. పోలీసు అధికారులు చెప్పిన మాటలు యథాతథంగా నమ్మి కొంత, తమకు తెలిసిన సమాచారం కొంత, తెలియకపోయినా ఊహించి చెప్పిన, రాసిన విషయాలు కొన్ని కలగూరగంప చేసి ప్రచారమాధ్యమాలు గందరగోళాన్ని మరింత ఎక్కువ చేశాయి. ప్రజలను, మృతుల బంధుమిత్రులను, ప్రజాసంఘాల కార్యకర్తలను తప్పుదారి పట్టించడానికి, తప్పుడు సమాచారం ప్రచారమయ్యేలా చూడడానికి పోలీసులు ఉద్దేశపూర్వకంగానే ప్రయత్నించినట్టు స్పష్టంగా కనబడుతున్నది. ఈ గందరగోళం మధ్య వాస్తవంగా బెజింగి కొండల్లో ఏం జరిగిందో, నిజమైన ఎదురుకాల్పులు జరిగాయో లేదో, విషాహార ప్రయోగంతోనో, నిద్రలోనో, నిరాయుధం గానో ప్రతిఘటించలేని స్థితిలో ఉన్నవారిపై ఏకపక్షదాడి జరిగిందో, వేరువేరు చోట్లనుంచి పట్టుకు వచ్చినవారిని కాల్చిచంపి ఎదురుకాల్పుల నాటకం ఆడుతున్నారో స్వతంత్ర పరిశోధన ద్వారా తప్ప, ప్రత్యక్ష సాక్షులైన విప్లవకారులు, ప్రజలు ప్రకటిస్తే తప్ప బైటపడదు.

కొద్దిరోజుల్లోనే అటువంటి పరిశోధనతో కూడిన నిజానిజాలు బైటపడవచ్చు గాని, ఆ పరిశోధన కూడ అవసరం లేకుండానే, పోలీసు కథనాలలోని పరస్పర విరుద్ధ సమాచారం, మాట మార్పులు, మృతదేహాల మీద ఉన్న గాయాల గుర్తులు, నాలుగు రోజుల పాటు పోలీసులు విడతల్లో బైటపెట్టిన మృతదేహాలు, ఇటువంటి ఘటనల్లో పాటించవలసిన ఏ చట్టబద్ధ నియమాలనూ పోలీసులు పాటించకపోవడం, యాభై సంవత్సరాల చరిత్రలో ఎన్ కౌంటర్ అనేమాటకు పోలీసులు కల్పించిన అర్థాలు అన్నీ కలిపి చూస్తే, బెజింగి ఎన్ కౌంటర్ నిజమైన ఎన్ కౌంటర్ కాదని, ఉద్దేశపూర్వక దారుణ మారణ కాండ అనీ తేటతెల్లం అవుతుంది.

పోలీసులు ఉద్దేశపూర్వకంగా ప్రచారం చేసిన ఎన్నో అబద్ధాలలో, అర్ధసత్యాలలో మొదటిది మృతులలో అగ్రనాయకులు ఉన్నారనేది. మూడు రోజుల పాటు ఆ అగ్రనాయకుల ఫొటోలు విడుదల చేస్తూ, ఊహాగానాలు ప్రకటిస్తూ పోలీసులు చేసిన ప్రయత్నం ఒక మానసిక యుద్ధం. విప్లవోద్యమ సానుభూతిపరుల, బంధుమిత్రుల మానసిక స్థైర్యాన్ని దెబ్బతీయడానికే, నిరాశానిస్పృహలు వ్యాపింపజేయడానికే, ఇక అంతా అయిపోయింది అనే వాతావరణం కల్పించడానికే పోలీసులు ఈ ఎత్తుగడ పన్నారు. అగ్రనాయకులు అక్కిరాజు హరగోపాల్, గాజర్ల రవి, రామచంద్రారెడ్డి వంటివారు మృతుల్లో, క్షతగాత్రుల్లో ఉన్నారని చేసిన ప్రచారం నిజమో అబద్ధమో తేల్చి చెప్పలేని స్థితి ఇంకా కొనసాగుతున్నది. రేపు అది అబద్ధం అని బైటపడినా ఈలోగా ఆ అబద్ధం మీద ఆధారపడి నిరాశానిస్పృహలు చెలరేగేలా చేయడమే పోలీసుల ఉద్దేశం.

పోలీసులు ప్రచారం చేసిన మరొక అంశం అక్కడ ప్లీనరీకి ఏర్పాట్లు జరుగుతున్నాయనేది. ఆ మాట ద్వారా ఎక్కువమంది మృతులను తాము చూపబోతున్నామని పోలీసులు చెప్పదలిచారు. నిజానికి ప్లీనరీ వంటి ఏర్పాట్లు జరిగినప్పుడు విప్లవోద్యమం మామూలుకన్న ఎక్కువ జాగ్రత్తలు తీసుకుంటుంది. సెంట్రీలను, రక్షణ వ్యవస్థలను ఏర్పాటు చేసుకుంటుంది. పోలీసు బలగాలు సరిగ్గా ప్లీనరీ జరిగే చోటికి గాని, కొన్ని వందల గజాల దూరంలోకి గాని వెళ్లడం అసాధ్యం. అలా వెళ్లే అసాధారణ సందర్భం వచ్చినా, కచ్చితంగా గెరిల్లాల వైపు నుంచి ఆత్మరక్షణ ప్రయత్నాలు జరుగుతాయి. ఈ ఘటనల్లో సోమవారం నాడు కూడ గెరిల్లాల వైపు నుంచి ప్రతిఘటన, కాల్పులు జరిగినట్టు లేవు. మొదటిరోజు ఇద్దరు గ్రేహౌండ్స్ గాయపడ్డారని పోలీసు అధికారులు ప్రకటించారు గాని, వారిలో ఒకరు నీళ్లలో పడి గాయపడ్డారని, ఆ తర్వాత ఆ గాయాలతో చనిపోయారని వార్తలు వచ్చాయి. కచ్చితంగా అటువైపు నుంచి తుపాకి కాల్పులైతే జరగలేదు. ఎకె 47, ఎస్ఎల్ఆర్, ఇన్సాస్

రైఫిల్ వంటి అత్యాధునిక ఆయుధాలున్నాయని, దొరికాయని పోలీసులే చెపుతున్నారు గనుక, గెరిల్లా దళం కొండ మీద ఉండి, గ్రేహౌండ్స్ కింది నుంచి పైకి ఎక్కుతున్నారు గనుక ఆ పరిస్థితి గెరిల్లాలకే అనుకూలంగా ఉండి ఉంటుంది. నిజంగా ఎదురుకాల్పులు జరిగితే కచ్చితంగా గ్రేహౌండ్స్ వైపు కూడ ఎక్కువ ప్రాణనష్టమే ఉండి ఉండేది. కనుక పోలీసులు చెపుతున్నట్టుగా అవి ప్లీనరీ ఏర్పాట్లు అని నమ్మడం కష్టం. కేవలం ఎక్కువమందిని చంపి ఆ ప్రాంతంలో భయభీతావహ వాతావరణం సృష్టించడానికి, మొత్తంగా సమాజంలో విప్లవోద్యమ భవిష్యత్తు పట్ల నిరాశా నిస్పృహలు వ్యాపింపజేయడానికి పోలీసు వ్యూహకర్తలు పన్నిన వ్యూహం ఇది.

ఇప్పటికి పోలీసులు ప్రకటించిన 34 మంది మృతులలో ఎంతమంది గెరిల్లాలు, ఎంతమంది సాధారణ ఆదివాసులు ఉన్నారో స్పష్టంగా తెలియడం లేదు గాని, సగం కన్న ఎక్కువ సాధారణ ఆదివాసులు ఉన్నారని అర్థమవుతున్నది. సాధారణ ఆదివాసులను చంపి వారిని సాయుధ గెరిల్లాలుగా చిత్రించడానికి, ఘటనాస్థలంలో పెద్ద సమావేశం జరుగుతున్నదని చెప్పడానికి పోలీసులు ప్రయత్నిస్తున్నారు. ఇతర ప్రాంతాల నుంచి తెచ్చిన ఆయుధాలను, వస్తువులను ఘటనా స్థలాలలో చూపడం పోలీసులకు పాత అలవాటే గనుక అసలు ప్లీనరీ ప్రయత్నాలు జరుగుతున్నాయా అనేది అనుమానాస్పదమే.

రాష్ట్ర స్థాయి ప్లీనరీ కాకపోయినా, ఏదో ఒక స్థాయి సమావేశం జరుగుతున్నదని సమాచారంతో, ఆ సమావేశంలో పాల్గొంటున్నవారు ఏ సమయంలో ఏమరపాటుతో, నిరాయుధంగా ఉంటారో కచ్చితంగా తెలిసి, వారి మీద ఒక్కుమ్మడిగా దాడి చేసి కాల్పులు జరిపి, కొందరిని అక్కడికక్కడే చంపి, గాయాలతో చేజిక్కినవారిని ఆ తర్వాత వరుసగా రోజుకు కొందరిని చొప్పున చంపుతుండవచ్చు. అలా అందరికందరూ నిరాయుధంగా, ఏమరపాటుతో ఉండడం కూడ సాధారణంగా జరగదు గనుక, వారికి అంతకుముందే విషాహార ప్రయోగం జరిగి ఉండవచ్చు. వారు మత్తులో ఉన్నప్పుడు ఒక్కుమ్మడిగా దాడి జరిగి ఉండవచ్చు. లేదా వారిని వేరువేరు చోట్ల పట్టుకుని, ఆ స్థలానికి తీసుకువచ్చి కాల్చిచంపి, అక్కడ వస్తువులు చెల్లాచెదరుగా పడవేసి ఉండవచ్చు. ఇటువంటి పనులన్నీ గత యాభై ఏళ్లలో ఆంధ్రప్రదేశ్ పోలీసులు ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకసారి చేసినవే గనుక ఇందులో ఏది జరిగి ఉండినా ఆశ్చర్యం లేదు.

ఈ దారుణ మారణకాండలో రాజ్యబలగాల నుంచి అమలైన చట్ట ఉల్లంఘనలకు, వ్యక్తమైన అమానవీయ ప్రవృత్తికి, విడుదల చేసిన అబద్ధపు ప్రకటనలకు అడ్డూ ఆపూ లేదు. మొట్టమొదట, ఆంధ్రప్రదేశ్ గ్రేహౌండ్స్ సరిహద్దు దాటి, తమ పాలనా పరిధిలోకి రాని మరొక రాష్ట్రపు భూభాగంలోకి ప్రవేశించడం చట్టవ్యతిరేకం, అసంబద్ధం. అయితే చంద్రబాబు నాయుడు గత పాలనా కాలంలో కూడ ఇలా ఎన్నోసార్లు జరిగింది గనుక, సుప్రసిద్ధమైన కొప్పడంగ దాడి లో ఇలాగే జరిగింది. ఈ చట్టవ్యతిరేకతను అటు ఒడిశా ప్రభుత్వమూ ప్రశ్నించదు. ఇటు న్యాయస్థానాలతో సహా ఏ పాలనా విభాగమూ ప్రశ్నించదు. ఇక ఎన్ కౌంటర్ మృతి వంటి అసహజ మరణాల విషయంలో పాటించవలసిన పద్ధతుల గురించి జాతీయ మానవ హక్కుల సంఘం, సుప్రీం కోర్టు, వివిధ రాష్ట్రాల హైకోర్టులు జారీ చేసిన ఏ విధినిషేధాలనూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ సందర్భంలో పాటించలేదు. అన్ని వసతులూ ఉన్న ఆస్పత్రులలో శవపరీక్షలు జరపడం, శవపరీక్ష వీడియో రికార్డింగ్ జరిపించడం, మృతదేహం మీది గాయాలను, అసాధారణ చిహ్నాలను జాగ్రత్తగా నమోదు చేయడం, బంధుమిత్రుల సమక్షంలో శవపరీక్ష జరపడం, మృతదేహాలు కుళ్లిపోకుండా జాగ్రత్తలు తీసుకుని బంధుమిత్రులకు అప్పగించడం, మృతులకు సగౌరవంగా అంత్యక్రియలు జరగడానికి వీలు కల్పించడం చట్టబద్ధంగా, న్యాయంగా, మానవీయంగా ఉండదలచుకున్న పాలనకు అవసరం. కాని చంద్రబాబు నాయుడు పాలన అటువంటిది కాదని మరొకసారి చూపింది. చివరికి, ఈ మారణకాండ జరుగుతుండగానే మావోయిస్టుల అధికార ప్రతినిధి పేరుతో ఒక పత్రికా ప్రకటన వెలువడింది. అందులో తమను తాము నక్సల్స్ అని రాసుకోవడం, లెటర్ హెడ్ సక్రమంగా లేకపోవడం, వారి రాజకీయావగాహనకు వ్యతిరేకమైన ఆత్మాహుతి గురించి, వ్యక్తిగత ప్రతీకారాల గురించి ప్రస్తావించడం చూస్తే అది తప్పుదారి పట్టించడానికి పోలీసులే ఇచ్చిన ప్రకటన అనిపిస్తుంది. మరొకవైపు పోలీసుల ప్రోద్బలంతో మావోయిస్టులకు వ్యతిరేకంగా విశాఖపట్నంలో ఆదివాసుల ప్రదర్శన కూడ జరిగింది. ఒకవైపు పోలీసులే ఆదివాసులను చంపి, వారి వివరాలు కూడ తెలియ జేయకుండా ఉన్న సమయంలో ఈ ఆదివాసుల ప్రదర్శన ఒక క్రూరమైన పరిహాసం. ఇంత పెద్ద మారణకాండ జరిగినప్పుడు ముఖ్యమంత్రి, హోంమంత్రి, రాజకీయ నాయకులు పెదవి విప్పకుండా కేవలం పోలీసు అధికారులే రాజకీయ ప్రకటనలు చేయడం పాలన ఏ స్థాయికి దిగజారిందో చెప్పకనే చెపుతున్నది.

ఈ దారుణమారణకాండలోనూ, తదనంతర పరిణామాలలోనూ రెండు అంశాలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. ఒకటి, సాయుధులైన విప్లవకారుల వైపు నుంచి కనీసమైన ప్రతిఘటన కూడ లేకపోవడం, పోలీసు కాల్పులకు ఎదురుకాల్పులు జరగకపోవడం కాగా, రెండవది,

## ప్రజాకళామండలి గాయకుడు ప్రభాకర్



బెజింగి దారుణమారణకాండలో హత్యకు గురైన వారిలో ఆంధ్రప్రదేశ్, తెలంగాణల్లో వేలాది మందికి తెలిసిన, వ్యక్తిగతంగా సన్నిహితుడైన గాయకుడు, డప్పు, ఢోలక్, తబ్లా వాయిద్యకారుడు ప్రజాకళామండలి నాయకుడు ప్రభాకర్ కూడ ఉన్నారు. సికింద్రాబాద్ శివార్లలోని యాప్రాల్ గ్రామంలో నిరుపేద దళిత కుటుంబంలో పుట్టిన ప్రభాకర్ గత ఇరవై సంవత్సరాలుగా గాయకుడుగా, సంగీతకారుడిగా, నటుడిగా, వక్తగా వేలాది సభల్లో పాల్గొన్నారు. ప్రజాకళామండలి వ్యవస్థాపక సభ్యుడిగా 1997 నుంచి వేలాది ప్రదర్శనలు ఇచ్చారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలోనూ, అనేక ప్రజా ఉద్యమాలలోనూ తన గళాన్ని ఆయుధంగా వాడారు. ప్రజాకళా మండలి తయారుచేసిన ఎన్నో సిడిలలో ఆయన గళం సుప్రసిద్ధమైంది. ప్రజాకళామండలి తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంపై తయారుచేసిన నివురు గప్పిన నిప్పు అనే 80 నిమిషాల డాక్యుమెంటరీ డివిడి మొత్తం ఆయన వ్యాఖ్యానంతోనే ఉంది. రెండున్నర సంవత్సరాల కింద పూర్తికాలం విప్లవ జీవితాన్ని ఎంచుకుని కళారంగం నుంచి విప్లవోద్యమంలోకి వెళ్లిన ప్రభాకర్ బెజింగి కొండల్లో తన నెత్తురు చిందించి, సుబ్బారావు పాణిగ్రాహి, దివాకర్‌ల వారసత్వాన్ని కొనసాగించారు.

## మృతుల వివరాలు

పోలీసులు ఒక్కొక్క రోజు ఒక్కొక్క రకమైన జాబితా విడుదల చేయడం, ఒక జాబితాలో ఉన్న పేర్లు మరొక జాబితాలో లేకపోవడం, పత్రికల్లో కూడ ఒక్కొక్కరోజు ఒక్కొక్క రకమైన జాబితా రావడం, కొన్ని మృతదేహాలు గుర్తించడానికి ఆలస్యం జరగడం, కొన్ని మృతదేహాలు గుర్తించడానికి వీలు లేనంతగా చెడిపోవడం వంటి కారణాల వల్ల సరైన పూర్తి జాబితా ఎక్కడా లేదు) కనీసం ఏడెనిమిది మృతదేహాల వివరాలు బైటపడనే లేదు) దొరికిన వివరాలు ఇవి:

1) బాకూరి వెంకటరమణ అలియాస్ గణేశ్ (బాకూరు, విశాఖపట్నం), 2) చామల కిష్టయ్య అలియాస్ దయ (దాసిరెడ్డి గూడెం, నల్గొండ), 3) పీకేఎం ప్రభాకర్ అలియాస్ గంగాధర్ (యాప్రాల, సికింద్రాబాద్), 4) భారతి అలియాస్ లత (మెదక్ జిల్లా), 5) ఇనుపర్తి దాసు అలియాస్ మధు (పశ్చిమగోదావరి జిల్లా), 6) కేశవరావు అలియాస్ బిరుసు, 7) పృథ్వీ అలియాస్ మున్నా (ఆలకూరుపాడు, ప్రకాశం), 8) మమత అలియాస్ కుందన (నల్లబొడ్డూరు, శ్రీకాకుళం), 9) రాజేశ్ అలియాస్ భీమల్ (పశ్చిమ బస్తర్), 10) బుద్రి (గంగులూరు, బస్తర్), 11) కమల (జేగురుకొండ, దక్షిణ బస్తర్), 12) మంజుల (మలింగేర్, దర్భా), 13) రమేశ్ రాగాల (మర్రిగెడ్డ, మల్కన్ గిరి), 14) రామే (కొర్రు, మల్కన్ గిరి), 15) గౌతం మాడు (బస్తర్), 16) చిన్న అలియాస్ సోమే (నానాబరి, మల్కన్ గిరి), 17) జ్యోతి (గునిలోవ, మల్కన్ గిరి), 18) కిరణ్, పశ్చిమగోదావరి జిల్లా, 19) యామలపల్లి సింహాచలం అలియాస్ మురళి (విజయనగరం), 20) గౌతమ్?, 21) నరేష్, 22) దినేష్?, 23) శ్రీనుబాబు అలియాస్ రైనో, 24) శ్వేత, 25) రైనా, 26) జెనీలా అలియాస్ మాలతి (చత్తీస్ గడ్), 27) రుప్పి

ఇంత పెద్ద ఎత్తున మారణకాండ జరిగినప్పుడు సమాజంలో ఉండవలసినంత స్పందన లేకపోవడం. విప్లవకారులవైపునుంచి ప్రతిఘటన లేకపోవడానికి వారిని నిరాయుధంగా, ఏమరపాటుతో, లేదా విషాహార మత్తులో ఉండడం కారణం కావచ్చు. కాని, సమాజ ప్రతిస్పందన ఇంత తక్కువ స్థాయిలో ఉండడానికి కారణాలు వెతకవలసి ఉంది. మనిషి మరణం, అందులోనూ హత్య, అందులోనూ రోజుకు కొందరు చొప్పున రాజ్యం చేతిలో ముప్పై నాలుగు మంది హత్యకు గురికావడం కూడ కదల్చలేనంత మొద్దుబారి పోయిందా మన సమాజం అని ప్రశ్నించుకోవలసి ఉంది. హతుల విశ్వాసాలతో, ఆచరణతో విభేదం కూడ ఉండవచ్చు, కాని హత్య జరిగిన పద్ధతి ఎంత అనాగరికమైనదో, ఎంత దుర్మార్గమైనదో గుర్తించలేని, వ్యక్తీకరించలేని స్థితికి మన బుద్ధిజీవులు చేరుకున్నారా? హత్యల వార్తలన్నీ సంచలన వార్తలుగా మాత్రమే ప్రసారమవుతాయి. హత్యలను ఖండించే ప్రకటనలుండవు. వార్తాపత్రికలు సంపాదకీయాలు రాయవు. విప్లవ సానుభూతిపరులైన వ్యక్తులు, సంఘాలు తప్ప, మిగిలిన పౌరసమాజం, అణగారిన వర్గాల సంఘాలు ఏమీ మాట్లాడవు. న్యాయస్థానాలు మాట్లాడవు. సమాజం ఎందుకు ఎట్లా ఈ నిర్లిప్త, నిశ్శబ్ద, దుర్మార్గ స్థితికి చేరుకున్నదో ప్రతి ఒక్కరూ ఆలోచించవలసి ఉంది.

ఒకవైపు రాజ్యం ఇంత దుర్మార్గంగా, పాశవికంగా, ఇంత పెద్దఎత్తున మనుషులను చంపుతుంటే, తమను తాము మేధావులుగా గుర్తించుకునే కొందరు మాత్రం విప్లవకారుల తప్పుడు రాజకీయల గురించి, సాయుధపోరాటపు అనావశ్యకత గురించి, బలమైన రాజ్యాన్ని ఎదుర్కొనే విప్లవకారుల మూర్ఖ సాహసం గురించి ప్రవచనాలు వెల్లడిస్తున్నారు. ఆ తప్పులు చేసినందుకు మరణమే శిక్ష అన్నట్టు మాట్లాడుతున్నారు. సమాజాన్ని తమ పద్ధతిలో అవగాహన చేసుకోవడం, ఆ సమాజ దుస్థితిని మార్చడానికి, వ్యవస్థను మార్చడానికి తమకు తోచిన పద్ధతిలో ప్రయత్నించడం మరణశిక్షకు అర్హమైన నేరాలుగా ఎప్పటినుంచి మారిపోయాయో తెలియదు. కళ్ల ఎదుట శవాలు కనబడుతుంటే, ఆ హత్యాకాండ సాగించిన దుర్మార్గుల గురించి ఒక్క మాట మాట్లాడకుండా, ఆ మృతదేహాల రాజకీయ తప్పిదాల గురించి మాట్లాడడం ఏ రాజ్యానుకూల మేధావిత్వమో, ఏ వ్యవస్థ యథాస్థితికి మద్దతు పలకడమో చెప్పనక్కరలేదు. విప్లవకారులు ఎంచుకున్న సైద్ధాంతిక, ఆచరణాత్మక అవగాహనల మీద భిన్నాభిప్రాయం ఉన్నవారైనా, ఆ భిన్నాభిప్రాయాన్ని చెప్పడానికి ఇదే సమయమని అనుకునేవారైనా కనీసం కళ్ల ముందు కనబడుతున్న హత్యాకాండ గురించి మాట్లాడడం కనీస బాధ్యత.

ఇంతకూ ఈ దారుణమారణకాండ ఎందుకు జరిగిందో అర్థం చేసుకోవాలంటే అది జరిగిన ప్రాంతాన్నీ, అక్కడి ఆదివాసుల జీవనాన్నీ, ఆ ప్రాంతం మీద పట్టుకోసం పాలకవర్గాలు చేస్తున్న ప్రయత్నాన్నీ అర్థం చేసుకోవలసి ఉంటుంది. సరిగ్గా ఈ ప్రాంతం సీలేరు నదికి, బలిమెల రిజర్వాయర్ కు రెండువైపులా విశాఖపట్నం, మల్కన్ గిరి జిల్లాల తూర్పుకనుమల ప్రాంతం బాక్సైట్, మాంగనీస్ ఖనిజాల కాణాచి. అల్యూమినియం తయారు చేయడానికి అత్యవసరమైన బాక్సైట్ ప్రపంచంలోనే అతి తక్కువ ప్రాంతాలలో దొరుకుతుండగా, అందులో విశాఖపట్నం జిల్లా అటవీ ప్రాంతాలు కూడ ఉన్నాయి. చంద్రబాబు నాయుడు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండగానే ఈ బాక్సైట్ ఖనిజ నిలువల ప్రాంతాన్ని బహుళజాతి సంస్థలకు అప్పగించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఆ ప్రయత్నాన్ని కొనసాగించిన రాజశేఖరరెడ్డి ప్రభుత్వం బాక్సైట్ ఎగుమతులకు అవసరమైన గంగవరం ఓడరేవు నిర్మిస్తూ ప్రతిఘటించిన మత్స్యకారుల మీద కాల్పులు కూడ జరిపింది. రాష్ట్ర విభజన జరిగి, చంద్రబాబు నాయుడు మళ్లీ అధికారానికి వచ్చినప్పటి నుంచీ, బాక్సైట్ ఖనిజం తవ్వకాల గురించి మాట్లాడుతున్నారు. రాజ్యాంగంలోని ఐదో షెడ్యూల్ గాని, 1 ఆఫ్ 1970 చట్టం గాని ఈ ఏజెన్సీ ప్రాంతాలలో ప్రభుత్వమైనా సరే ఇటువంటి తవ్వకాలు చేపట్టడాన్ని ఆమోదించవు. కాని చట్టాన్ని తుంగలో తొక్కడం చంద్రబాబు నాయుడుకు అలవాటే. ఇక బాక్సైట్ తవ్వకాలకు ప్రధాన అడ్డంకిగా ఉన్నది అక్కడి ఆదివాసి ఉద్యమాలు, వాటికి అండగా నిలుస్తున్న విప్లవకారులు మాత్రమే. ఆ ఆదివాసి ఉద్యమాలను భయోత్పాతానికి గురిచేస్తే, మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేస్తే బాక్సైట్ తవ్వకాలకు మార్గం సుగమమవుతుందని పాలకుల ఎత్తుగడ. చంద్రబాబు నాయుడు, నరేంద్రమోడీల అభివృద్ధి వ్యూహం అదే. ఆ అభివృద్ధి వ్యూహంలో భాగంగానే, ఆదివాసులను బెదిరించడానికి కొందరు ఆదివాసులను చంపడానికి, విప్లవోద్యమాన్ని అక్కడినుంచి నిర్మూలించడానికి ఆ ప్రాంత నాయకత్వాన్ని చంపడానికి బహుళ జాతి సంస్థల సహకారంతో, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పన్నిన కుట్రలో భాగమే ఈ బెజింగి దారుణ మారణకాండ.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# శాస్త్రీయతలేని జిల్లాల పునర్విభజన

***జిల్లాల విభజనలో ప్రభుత్వం ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా విధానాలను రూపొందించకుండా, తన విధానాలకు అనుకూలంగా ప్రజల అభిప్రాయాలను మారుస్తోందని అంటున్నారు* బైరెడ్డి సతీష్**

తెలంగాణ రాష్ట్ర జిల్లాల ముఖ చిత్రం సంపూర్ణంగా మారిపోయింది. రాష్ట్ర ఆవిర్భావం నాటికి ఉన్న పది జిల్లాల్లోని తొమ్మిది జిల్లాలను విడగొట్టి 30 జిల్లాలుగా ఏర్పర్చడంతో ఆ సంఖ్య 31కి చేరుకున్నది. ఎన్నికల సందర్భంగా చేసిన వాగ్ధానానికి అనుగుణంగా జిల్లాల పునర్విభజన ప్రక్రియను భారీ కసరత్తుతో ముగించి దసరా నుండి పాలనను ప్రారంభించింది రాష్ట్ర ప్రభుత్వం. పరిపాలనా సౌలభ్యం కోసమని, పాలన ప్రజల చెంతకు చేర్చడం కోసం ఈ సమూల మార్పులు చేస్తున్నట్లు ప్రభుత్వం చెబుతూ వచ్చింది. మొత్తం మూడు రోజుల వ్యవధిలో రెండు వేల జీవోలతో ఒక్క అక్టోబర్ 11న ఉదయం 12.00 నుండి మధ్యాహ్నం 2.20 నిమిషాల మధ్యలోనే 30 జీవోలు విడుదల చేస్తూ కొత్త జిల్లాల ప్రారంభాన్ని చాలా ఆడంబరంగా, అట్టహాసంగా నిర్వహించింది ప్రభుత్వం. జిల్లాల పునర్విభజన శాస్త్రీయంగా చేశామంటూనే దసరా రోజు 11.12 నుండి 11.22 నిమిషాల మధ్య వరకు 'సుముహూర్తానా' ప్రారంభోత్సవం చేసింది 'సెక్యులర్' ప్రభుత్వం. 27 జిల్లాలతో మొదటి ముసాయిదా సిద్దమైనప్పటికి రాత్రికి రాత్రే మరో నాలుగు జిల్లాలను చేర్చడంతో ఆ సంఖ్య 31కి చేరుకుంది.

కొత్తగా ఏర్పాటైన 23 రెవెన్యూ డివిజన్‌లతో మొత్తం వాటి సంఖ్య 68 కి చేరగా, 125 నూతన మండలాలతో వాటి సంఖ్య 584 కు చేరుకుంది. కొత్త కలెక్టర్లు, ఎస్‌పిలు, జిల్లా స్థాయి అధికార గణం అదేరోజు కొలువుతీరింద్రు. దేశంలో ఇంత పెద్ద మొత్తంలో ఒకేసారి జిల్లాల ఏర్పాటు చేయడం ఇదే ప్రథమం. పునర్వ్యవస్థీకరణ తరువాత 39.43 లక్షల జనాభాతో అగ్రస్థానంలో ఉన్న హైద్రాబాద్ 217 చదరపు కిలోమీటర్లతో విస్తీర్ణపరంగా అతిచిన్న జిల్లాగా కొనసాగుతుండడం విశేషం.

చాలా శాస్త్రీయంగా పునర్వ్యవస్థీకరణ ప్రక్రియ మొత్తం జరిగిందని చెప్పినా కూడా ఆ వాదనకు బలం చేకూర్చే అంశాలు కనిపించడం లేదు. ఈ తతంగాన్ని ఏకపక్షంగా ప్రభుత్వమే నడిపించినట్టు కనబడుతున్నది. ఓ చట్టబద్ధ కమిటీనో, నిపుణులతో కూడిన కమిటీనో వేసి ఎక్కడ జిల్లాల పునర్విభజన జరగాల్సిన అవసరం ఉంది, ప్రజల నుండి ఏ ప్రాంతంలో డిమాండ్‌లు వస్తున్నాయనే అంశాలను కూలంకషంగా అధ్యయనం చేసేలా ఈ ప్రక్రియకు ముందుగానే క్షేత్ర పర్యటన చేసి ప్రజల, పార్టీల, ప్రజా సంఘాల అభిప్రాయాన్ని సమగ్రంగా సేకరించి తద్వారా ఈ పని చేపట్టినట్లయితే ప్రజాస్వామికంగా అనిపించి ఉండేది.

ముఖ్యమంత్రి ఇష్టానుసారం, కేవలం టి.ఆర్.ఎస్. పార్టీ నాయకులతోనే ఎక్కువ సంప్రదింపులు జరిపి, మిగతా పార్టీల, ప్రజాసంఘాల అభిప్రాయాన్ని నామమాత్రంగానైన పరిగణనలోకి తీసుకోలేదన్నది స్పష్టమౌతున్నది. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో ముందు నిలిచి పార్టీలకతీతంగా ప్రజల్ని నడిపించిన తెలంగాణ జెఏసినైతే ఈ వ్యవహారంలో పూర్తిగా నిర్లక్ష్యపర్చారు. ఈ అంశంలో ప్రజల ఆకాంక్షలకనుగుణంగా ప్రభుత్వ విధానాన్ని రూపొందించడంకంటే ఆ విధానానికి అనుగుణంగానే ప్రజల అభిప్రాయాన్ని మలచే ప్రయత్నమే ఎక్కువ చేసినట్టు కనిపిస్తున్నది.

ఈ తతంగంలో ప్రభుత్వానికి సమర్థవంతమైన పరికరాలుగా కొన్ని మీడియా సంస్థలు భాగానే పనిచేశాయి. ఓ పత్రికైతే జిల్లాల పునర్వ్యవస్థీకరణ ఓ పెద్ద విప్లవంగా వర్ణించి ప్రజలకింకేం అవసరం లేదనేలా, అభివృద్ధంతా కొత్తజిల్లాలతోనే రాత్రికి రాత్రే జరుగుతుందన్నట్టు రాతల్ని వండివార్చింది.

జనాభా, భౌగోళిక విస్తీర్ణ పరిస్థితులు, చారిత్రక నేపథ్యం, వెనకబాటుతనం లాంటి అంశాల నిర్దిష్ట ప్రాతిపదికన కొత్త జిల్లాలు ఏర్పడతాయని చెప్పినా కూడా అలాంటిది ఏదీ ఈ జిల్లాల చిత్రపటాల్లో కనిపించడంలేదు. హైద్రాబాద్ జనాభా అతి పెద్దది కాగా విస్తీర్ణంలో అతి చిన్నది. సిరిసిల్లాలో కేవలం 5.43 లక్షల జనాభా మాత్రమే ఉన్నది. నల్లగొండలో 31 మండలాలుంటే, వరంగల్ అర్బన్ జిల్లా కేవలం 11 మండలాలతోనే ఏర్పాటైంది. కొన్ని జిల్లాల్లో గ్రామాల సంఖ్య 500 దాటితే, మరికొన్ని జిల్లాల్లో ఆ సంఖ్య 200 లోపే ఉన్నది.

పరిశ్రమలు, సహజ వనరులు, నీటి సదుపాయాల పరంగా కొన్ని జిల్లాలకు అనేక అనుకూలతలు మరికొన్ని జిల్లాలు అననుకూల పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తున్నది. మహబూబ్‌నగర్ జిల్లాను తీసుకుంటే రంగారెడ్డి (శంషాబాద్)లో కలపబడిన షాద్‌నగర్, కొత్తూర్ లలో పారిశ్రామిక సంస్థలు కేంద్రీకరించబడ్డాయి. ప్రాజెక్టుల పరంగా వనపర్తి, జోగుళాంబగద్వాల జిల్లాలు అనుకూల స్థితిలో ఉన్నాయి. ఆదివాసీలు, గిరిజనులు కూడా అనేక జిల్లాల్లోకి విసిరివేయబడ్డారు.

కొత్త మండలాలుగా ప్రతిపాదించబడి, చివరి క్షణంలో విరమించుకోవడంతో ఆయా ప్రాంతాల్లో ప్రజలు ఉద్యమబాట పట్టారు. ఆత్మహత్యలు చేసుకోవడం జరిగింది. జనగామా, గద్వాలలాంటి చోట్ల ప్రభుత్వం ప్రజల డిమాండ్‌లకు అనుగుణంగా ముందే సానుకూలంగా స్పందించినట్లయితే విధ్వంసం, ఉద్యమకారులపైన కేసులు వంటివి ఉండేవికావు.

ప్రతిపాదనలో లేనటువంటి శంషాబాద్ జిల్లా ప్రభుత్వ పెద్దల సామాజిక వర్గానికి చెందిన ఓ బడా పెట్టుబడిదారునికి, ఆయన

సన్నిహితంగా ఉండే ఓ 'స్వామీజీ' భూముల విలువలు పెరిగేలా ఆ జిల్లా ఏర్పాటు చివరిలో చోటుచేసుకున్నది. ఓ ఎంపి ఫామ్‌హౌజ్ కోసం మొయినాబాద్ మండలాన్ని శంషాబాద్‌లో కలిపారు. ప్రజల ప్రయోజనాలు, ఆకాంక్షలకంటే నేతల పలుకుబడే ఈ ప్రక్రియలో కీలక పాత్ర పోషించింది.

ఈ మొత్తం కొత్త జిల్లాల్లో ఒకే ఒక సానుకూలమైన, ప్రజలకు సౌకర్యవంతమైన అంశం ఏంటంటే జిల్లా కేంద్రం 70 కిలోమీటర్ల లోపు ఉండడమే. కొన్ని జిల్లాలో ఒకే ఒక అసెంబ్లీ నియోజకవర్గముంది. కొన్ని అసెంబ్లీ నియోజకవర్గాలు మూడు జిల్లాల పరిధిలోకి వెళ్లిపోవడంతో అక్కడ ప్రాతినిథ్యం వహించే ప్రజాప్రతినిథులు మూడు జిల్లాల అధికార యంత్రాంగంతో వ్యవహరించి పనులు చక్కబెట్టాలంటే కాలహరణకు దారితీసి అభివృద్ధి కుంటుబడే అవకాశమే ఎక్కువున్నది.

ఈ జిల్లాల పునర్విభజన ప్రక్రియతో కొత్త ఉద్యోగాలు, ఉన్న ఉద్యోగులకు పదోన్నతి అనేమాట ఉత్తదనే తేలిపోయింది. ఆయా శాఖల సిబ్బందిని కుదించడమో, మిగులు ఉన్నారని సర్దుబాటు చేయడమో చేసి ఆయా జిల్లాలకు పంపించారు తప్ప కొత్త ఉద్యోగాలు పుట్టుకొచ్చే అవకాశాలు ఏ మాత్రం కనిపించడం లేదు. ఒకవేళ పెరిగినా కూడా ప్రభుత్వ ఆదాయాన్ని పెంచే శాఖల్లోనో, ప్రజలమీద కర్రపెత్తనం చేసే పోలీసు శాఖలోనో పెరుగొచ్చేమో కానీ, ప్రజలకు ఉపాధి, ఉద్యోగాలు అందించాలనే ఉద్దేశ్యంతో జరిగే అవకాశమైతే లేదు. కొన్ని జిల్లాల విస్తీర్ణం జనాభారీత్య జిల్లా స్థాయి ఉద్యోగ నియామకాలల్లో అతి తక్కువ ఖాళీలుండి అన్యాయం జరిగే అవకాశం ఉంది, 371-డి రాజ్యాంగ బద్దమైన జోనల్ వ్యవస్థపైన ప్రభుత్వం తుది నిర్ణయం తీసుకోకపోవడంతో గందరగోళం నెలకొని ఉన్నది.

కొత్తజిల్లాల ఏర్పాటు ముఖ్యమంత్రి చెబుతున్నట్టు గొప్పపాలనా సంస్కరణ ఏమాత్రం కాదు, మహా అయితే పాలనకు సంబంధించిన సంస్థాగత మార్పు మాత్రమే.

ఇంకో ప్రధానమైన అంశం పోలీసు శాఖలో డివిజనల్, సర్కిళ్లలతో పాటు పోలీసు స్టేషన్‌ల సంఖ్య కూడా ఇబ్బడిముబ్బడిగా పెరిగింది. మండలాల సంఖ్య పెరగడంతో పది గ్రామాలతోను, కొన్ని ఐదు గ్రామాలతోనే అవి ఏర్పడ్డాయి. పాలన ప్రజలకు చేరువవడం ఏమో కానీ పోలీస్ ఠాణాలు మాత్రం చాలా దగ్గరగా అయినాయి! ప్రజల మీద నిర్బంధం, ప్రజా ఆందోళనల మీద అణిచివేత పెరిగే అవకాశం ఉన్నది. అవినీతితో కంపుకొడుతున్న ఉద్యోగ వ్యవస్థ, పోలీసు శాఖ జవాబుదారీతనం లేకుండా, ప్రజల పట్ల బాధ్యతాయుతమైన పాత్ర పోషించకుండా కేవలం నిర్మాణ పరంగా, భౌతికంగా చేరువైనంత మాత్రన ఒరిగేదేముండదు.

పాలనా యూనిట్లను ప్రజల చెంతకు తీసుకురావడం దానికదే విప్లవాత్మకమైన మార్పు కానేరదు. అభివృద్ధిని కూడా గ్యారంటీ చేయదు. 73, 74వ రాజ్యాంగ సంస్కరణల ద్వారా స్థాని క సంస్థలకు ఇవ్వబడిన నిధులు, విధులు అధికారాల బదలాయింపు లేకుండా జిల్లాల సంఖ్య, మండలాల సంఖ్య పెంచడమంటే జిల్లా స్థాయిలో పాలనా వికేంద్రీకరించినట్టే అనిపిస్తుంది కానీ స్థానిక సంస్థలపైన పై స్థాయిలో పెత్తనం పెరిగే అవకాశమే ఎక్కువ ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టే 'అభివృద్ధి' సంక్షేమ పథకాలు ప్రజలకు మరింతగా అందడానికి జిల్లా స్థాయి అధికార యంత్రాంగానికి పర్యవేక్షణ, నియంత్రణ చిన్న జిల్లాలతో సులభం కావచ్చునేమో కానీ, అసలు ప్రభుత్వ విధానాలకు ప్రజాభివృద్ధికరమైన స్వభావం ఉండాలి కదా? ఓటు బ్యాంకును కూడబెట్టే విధానాలే తప్ప ప్రభుత్వాల దగ్గర అసలైన అభివృద్ధి విధానాలేమున్నాయి.

కొత్త రాష్ట్రంలో పాత రాజకీయాలు, పైనుండి రుద్దబడే పాత అభివృద్ధి నమూనాయే తప్ప, గ్రామాలు స్వయంపోషకాలుగా ఎదిగే ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూన ఇప్పుడున్న ప్రభుత్వం దగ్గర లేదనేది స్పష్టం.

కొత్త జిల్లాల్లో వ్యాపారస్తులకు, రియల్ మాఫియాకు, పట్టణీకరణ పెరిగే క్రమంలో నిర్మాణరంగం పుంజుకోవడంతో ఇసుక మాఫియాకు, ప్రభుత్వ పనులను చేపట్టే కాంట్రాక్టర్లకు తక్షణ లాభాలుంటాయనేది నిర్వివాదాంశం. ఈ జిల్లాల ఏర్పాటుతో అధికార పార్టీ రాజకీయ ప్రయోజనాలే పైచేయి పొందుతాయి తప్ప ప్రజల ప్రయోజనాలు కావు. పెద్ద జిల్లాలో పాతుకుపోయిన బలమైన రాజకీయ నాయకత్వాన్ని బలహీనపర్చడం, తమ చెప్పుచేతుల్లో ఉండే నాయకత్వానికి పదవులివ్వడం ద్వారా రాష్ట్ర స్థాయిలో తమ నాయకత్వ పట్టును పెంచుకోవడానికే భాగా ఉపకరిస్తుంది. పార్టీ పదవులు, ప్రభుత్వ పదవులు అధికార పార్టీ నాయకులకు తప్పక అందుతాయి. కొత్త నాయకత్వానికి, అనేక సామాజిక వర్గాలకు రాజకీయ పదవులు ఆయా స్థాయిల్లో వచ్చే అవకాశం ఉన్నప్పటికి పైస్థాయిలో పాతుకుపోయిన ఆధిపత్య వర్గాల నాయకత్వాన్ని సవాల్ చేసేంత ఎదగలేదనేది కూడా స్పష్టం. కొత్త జిల్లాల అధికార కార్యాలయాల, మౌళిక సదుపాయాల నిమిత్తం జిల్లాకు వందకోట్లు అవసరం అవుతాయని ప్రభుత్వం చెబుతున్నది. పడబోయే ఆ ఖర్చంతా ప్రజల నెత్తిన రుద్దడం ఖాయం.

ఏది ఏమైనా దళితులకు గిరిజనులకు మూడు ఎకరాల భూమి, లక్షలాది ఉద్యోగాల కల్పన, వ్యవసాయ అభివృద్ధి, కేజి టు పిజి ఉచిత విద్య, మైనార్టీలకు 12 శాతం రిజర్వేషన్లు, గిరిజనులకు రిజర్వేషన్ల పెంపు వంటి హామీలు మరిపించాలంటే ఈ మాత్రం హడావిడి తప్పదేమో!.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.*

# పెట్టుబడిదారీ ప్రయోజనాలకే జిల్లాల పునర్విభజన

*తెలంగాణలో కొత్త జిల్లాల ఏర్పాటులో ప్రజాభీష్టం ఎంత మాత్రం లేదనీ, అది కేవలం పెట్టుబడిదారుల, అధికార పార్టీ నాయకుల అవకాశవాదానికీ, సహజ వనరులు కొల్లగొట్టేందుకే ఉపయోగపడుతుందనీ అంటున్నారు* **ఎన్. హేమా వెంకట్రావ్**

తెలంగాణ అపారమైన సహజ వనరులకు ఆలవాలం. ప్రపంచీకరణ నేపథ్యంలో ఈ సంపద కోసం ఎన్నాళ్లుగానో దేశ, విదేశీ గుత్త పెట్టుబడిదారులు, వాటి సంస్థలు ప్రయత్నాలు చేస్తున్నాయి. ఇక్కడ పెట్టుబడులు పెట్టడానికి ప్రయత్నిస్తున్న క్రమంలో ముఖ్యమంత్రి కెసిఆర్ ఎటువంటి నిఖార్సైన నిబంధనలు లేకుండానే వారిని ఆహ్వానిస్తున్నారు. వీరి దోపిడీకి సహకరించడానికి తెలంగాణను భౌగోళికంగా సిద్ధం చేస్తున్నారు. మౌలిక సదుపాయాల కోసం సుపరిపాలన, సౌలభ్యం పేరిట రాష్ట్రాన్ని అశాస్త్రీయంగా ముక్కలు చేసి జిల్లాలుగా ఏర్పాటు చేస్తున్నారు. ప్రజలకు మౌలిక సదుపాయాలు ఏర్పాటు చేసి పెట్టుబడిదారీ వర్గం అతి సులువుగా దోచుకోవడానికి రంగం సిద్ధం చేయబడుతుంది. అవసరమైతే ఇదే ప్రజల పేరిట సామ్రాజ్యవాదపు సంస్థలైన ప్రపంచబ్యాంకు ఐఎంఎఫ్, ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకుల నుండి పెద్ద ఎత్తున పెట్టుబడులు తెచ్చి రోడ్డు, రవాణా, కమ్యూనికేషన్, ఇన్‌ఫర్మేషన్, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులను నిర్మిస్తుంది. ఈ లూటికి సహకరించడానికి రాజకీయ నాయకుల నుంచి స్థానిక ఆధిపత్య కుటుంబాల వరకు ఆసరా తీసుకోవాలి. అందుకు అందరికి తలా ఇంత పందేరం వెయ్యాల్సిందే. ఈ క్రమాన్ని దోపిడి రాజ్యానికి సామాజిక పునాదిగా మారుతున్న వైనం మనం చూస్తాం. ఈ దోపిడీకి జిల్లాల విభజన వాటి అండదండలు బ్యూరోక్రసి, పోలీసు దన్ను అవసరం. ఈ పెత్తందార్లు, రాజకీయ నాయకులను మనం ప్రజాహితులుగానో, ప్రజా ప్రతినిధులుగానో చూసే ప్రమాదం ఉంది. వీరు సహజ వనరుల దోపిడీలో సామ్రాజ్యవాద దళారి బూర్జువ పెట్టుబడికి సామాజిక పునాదిగా పనిచేసే శక్తులుగా వ్యవహరిస్తున్నారు.

తెలంగాణ విప్లవోద్యమ శక్తులు మరింత బలపడకుండ, వనరుల దోపిడీని మరింత సులభతరం చేయడానికి చిన్న ప్యాకెట్లు అవసరం. పోలీసు (ఎస్‌పి) స్థాయి బలగాలతో ఔట్ పోస్టులతో జిల్లాలో మోహరించ వచ్చు. దోపిడీ వర్గాల సాయుధ బలగాలకు, ప్రజాపోరాట గెరిల్లా వర్గాల మధ్య ఘర్షణ మొదలైతే విప్లవోద్యమాలను తేలికగా అణిచివేయడానికి వీలుగా చిన్న జిల్లాల ప్రతిపాదన, అంతేకాకుండ ఆధిపత్య కులవర్గాల సామూహిక సంస్థానాలను ఏర్పరచుకోవడానికి టిఆర్‌ఎస్‌కు వెసులుబాటు అవుతుంది. రాజ్యం మరింత శక్తివంతం అవుతుందని, విప్లవోద్యమ ప్రభంజనాన్ని తిప్పి కొట్టవచ్చునని, వ్యూహాత్మక ఎత్తుగడతో పాటు హిందూ రాజ్యస్థాపన ధ్యేయం కూడా ఇందులో ఇమిడి ఉంది.

గత కొన్ని నెలలుగా కొత్త జిల్లాల ఏర్పాటు ప్రక్రియ తెలంగాణ ప్రభుత్వం చేపట్టింది. ఈ విషయం మీద ప్రజలు, ప్రజాసంఘాలు తమ అభ్యంతరాన్ని తెలుపుతూ సభలను నిర్వహించారు. జిల్లాలో వివిధ ప్రాంతాలకు, ఆ ప్రాంతాల ప్రజలకు గల అస్థిత్వాలను ప్రశ్నించే స్థాయిలో, కనుమరుగు చేసే రీతిలో కొత్త జిల్లాల ప్రక్రియ సాగుతుందని తెలియ జేశారు. ప్రతి అస్థిత్వ పోరాటం వెనుక ఆ జాతుల, ప్రాంతాల ప్రజల ఆకాంక్ష ఉంది. ఆ ఆకాంక్ష బలంగా ఉద్యమ రూపుదిద్దుకొని తెలంగాణ ఏర్పడింది. అయితే ఈ జిల్లాల విభజన దేశానికి గాని, రాష్ట్రానికి గాని కొత్త కాదు. టిఆర్ఎస్ 2014 ఎలక్షన్ మానిఫెస్టోలో చెప్పింది కూడా, కాని ఆ విభజన ప్రక్రియ విధి, విధానాలు సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు ప్రజాభీష్టం మేరకు తీసుకోవాల్సి ఉంటుంది. మరి ఉద్యమ పథంలో నడచి తెలంగాణ అస్థిత్వాన్ని కాపాడిన హీరోగా తనను తాను ప్రకటించుకొనే ముఖ్యమంత్రి కె.చంద్రశేఖర్ రావుకి, అతని ప్రభుత్వానికి ప్రజాప్రయోజనాల పట్ల నిబద్ధత ఉందా? లేదా అతని రాజకీయ లబ్ధి కోసం చేస్తున్నాడా అని ఆలోచించాలి. ఆ కోణాల నుంచి చూస్తేనే జిల్లా పునర్విభజన దాని లోతుపాతులను అర్థం చేసుకోగలం.

దేశంలో ఇప్పటికి 684 జిల్లాలు ఉన్నాయి. రమారమి 18.5 లక్షల ప్రజలు సగటున ఉన్నారు. తెలంగాణలో చూసినట్లయితే దానికి రెండింతల జనాభా ఉన్నారు. సుమారు 12 వేల కిలోమీటర్ల విస్తీర్ణం ఉన్న జిల్లాలు ఉన్నాయి. దేశంలో అత్యధిక విశాలమైన జనాభా కలిగిన జిల్లా మహారాష్ట్రలోని థానే, హిమాచల్ ప్రదేశ్‌లోని గోమాంగ్ వ్యాలి 800 మంది జనాభా గలిగి ఉండగా, పాండిచ్చేరి కేవలం 8 చదరపు కిలోమీటర్లతో చిన్న జిల్లాగా ఉన్నది. 1956 కి ముందు ఉమ్మడి రాష్ట్రంలో మన భద్రాచలం, తూర్పు గోదావరి, కృష్ణ, గోదావరి, వరంగల్, జిల్లాలోని కొన్ని మండలాలను కలిపి ఖమ్మం జిల్లాగా ప్రకటించారు. అందుకే ఉమ్మడి రాష్ట్రం విడిపోతున్నపుడు ఆంధ్ర ప్రాంతం వారు భద్రాచలం అంశాన్ని లేవనెత్తారు. అలాగే శ్రీకాకుళంలోని కొంత భాగాన్ని విశాఖపట్నంలోని కొంత భాగాన్ని కలుపుతూ విజయనగరం జిల్లాగా ఏర్పడింది. 1956కి ముందు జనగాం నల్గొండ జిల్లాలో ఉండేది.

1974లో 1/74 జిల్లాల చట్టం వచ్చింది. దాని ప్రకారం జిల్లాల పరిధి పెంచనూ వచ్చును, తగ్గించనూ వచ్చును. ఆ తరువాత 1983లో ఎన్‌టిఆర్ అధికారంలోకి వచ్చాక మండల వ్యవస్థలను తీసుకు వచ్చాడు. పట్వారి పద్ధతిని రద్దు చేశాడు. బిసి, ఎస్‌సిలకు రాజకీయ రిజర్వేషన్ ఏర్పాటు చేశాడు. మన దేశాన్ని ప్రజాస్వామిక దేశంగా ప్రకటించుకున్న తరువాత రాజ్యాంగం మీద ప్రమాణం చేసి గద్దెనెక్కిన నాయకులు కనీస ప్రాథమిక హక్కుల సూత్రాలను విధి, విధానాల సాంప్రదాయాలను తూట్లుపొడిచి తను ఇష్టారాజ్యంగా జిల్లాలను రోజుకొక్క తీరుగా, సంఖ్యగా ప్రకటిస్తున్నారు. కొన్నిసార్లు 23గా మరికొన్ని సార్లు 26 అని, రాజకీయ ప్రయోజనాలు ముఖ్యం కాదని ప్రజాభీష్టం ముఖ్యం అని రకరకాల ప్రకటనలు ఇస్తూ ప్రజలను మభ్య పెట్టాలని ప్రయత్నిస్తున్నారు.

1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినపుడు ఫజిల్ అలీ కమీషన్

రెండు సంవత్సరాలు దేశంలో పర్యటించి ప్రజల ఇష్టాలు అభిప్రాయాలు ఓ మేరకైనా తెలుసుకొని ప్రభుత్వంకు కొన్ని సలహాలు సూచనలు ఇచ్చింది. కాని ఇప్పటి ప్రభుత్వానికి కనీసం ఒక విధాన రూపకల్పన అవసరమని తోచలేదు. ప్రజాభిప్రాయం తెలుసుకోవడానికి ఒకవైపు ఆగష్టు 22, 2016లో ప్రకటించి సెప్టెంబరు 25 వరకు ప్రజల అభిప్రాయం కోరుతూనే వారు అనుకున్న ప్రతిపాదిత జిల్లా హెడ్‌క్వార్టర్‌లు తీసుకొని సున్నాలు, మరమ్మతులు కూడా చేసుకుంటున్నారు. ఇంక ప్రజాభీష్టము ఏముంటుంది?

ఒక దేశం గొప్పతనం ఆ దేశ ప్రజలకు కల్పించిన హక్కులపై ఆధారపడి ఉంటుంది అని ఎచ్.జె. లాస్కి అంటారు ప్రభుత్వాలు తమ అధికారాలను రాజ్యాంగానికి లోబడి ప్రజల హక్కులకు భంగం కలిగించకుండ వినియోగించుకోవాలి. స్వేచ్ఛా, స్వాతంత్ర్యం హక్కు రాజ్యాంగంలో పొందుపరిచారు. 19(1-బి) శాంతియుతంగా నిరాయుధంగా సమావేశాలను నిర్వహించుకునే హక్కు ఉంది. ఆదివాసీలకు, ప్రత్యేక జిల్లాలు కావలెనో, చారిత్రాత్మక, సాంస్కృతిక ప్రాతిపదికన జిల్లాలు కావలెనో ప్రజలు ప్రతిఘటిస్తే తోసిపుచ్చుతుంది. రాజ్యాంగ అధికరణ 13 ప్రకారం ప్రజలకు వ్యతిరేకంగా చట్టాలు చేయరాదు, నడుచుకోకూడదు. అలా చేస్తే న్యాయస్థానాలు వాటిని చెల్లవని ప్రకటించవచ్చు. అలాగే చట్టం ముందు అందరూ సమానులేనని రాజ్యాంగం చెబుతుంది. సమన్యాయ పాలన కూడా వక్కాణించారు. కాని జిల్లాల పంపకాలు చూస్తుంటే ఈ సమన్యాయ పాలన వైఖరి కన్పించదు.

ఆదివాసీల కొరకు 5వ షెడ్యూల్డు ఈశాన్య ప్రాంత తెగలకు 6వ షెడ్యూలుల్లో ప్రత్యేక హక్కులు కల్పించారు. అడవి, నీరు, వనరులుపై ఆదివాసీలకే హక్కు ఉంటుంది. దీనిపై కేవలం గవర్నరుకే నిర్ణయాధికారం ఉంటుంది. వారికి ఆ హక్కులు దక్కనీయక పోవడం వలన అనేక ఉద్యమాలు పోటెత్తాయి. శ్రీకాకుళం నక్సలిజం పోరాటం తర్వాత 1/70, పైసా చట్టం, 1996, అడవి హక్కుల చట్టం 2006లో ఆదివాసీలు తెచ్చుకోగలిగారు. అయినా వాటి అమలు నామమాత్రమే. ఫారెస్ట్ రిజర్వుడ్ ఫారెస్టు అయింది. హరితాంధ్ర, హరిత తెలంగాణలో గిరిజనుల పోడు హక్కు చేజారింది. చెట్లు నాటే కార్యక్రమం పేరిట తరాలుగా పోడు చేసుకుంటూ జీవనాన్ని వెళ్లదీస్తున్న వారి బ్రతుకులు మైదానంలో పడ్డాయి. వారి భూమి ఆదివాసేతర భూస్వాముల చేతుల్లోకి సగానికి పైగా పోయింది. ఆర్థిక మండలాలు, మైనింగ్ కాంట్రాక్టుల పేరిట భూమి పెట్టుబడి వర్గానికి ఇప్పటికే అప్పచెబుతున్నారు. ఇక గిరిజనేతర వలసలు చెప్పనక్కర్లేదు. వారి జీవితాలలో భాగమైన అడవి వారికి తప్ప అందరికి ఉన్నతిని తెచ్చి పెట్టింది. వాటికి చట్టబద్ధత లేదు. అందుకే షెడ్యూలు ప్రాంతాలలోకి మండలాలను విడగొట్టి మైదాన ప్రాంతంలో కలుపుతున్నారు. ఈ ప్రాంతాల నుండి ఆదివాసీలను వెళ్లగొట్టడమే కాకుండా క్రమంగా మైదాన ప్రాంతంగా మార్చవచ్చు. అప్పుడు షెడ్యూల్డు వారి నిబంధనలు వర్తించవు.

ఆదిలాబాదు నుండి భద్రాచలం వరకు గోదావరి పొడవునా షెడ్యూల్డు ప్రాంతమంతా భౌగోళికంగా, నైసర్గికంగా ఒకే ప్రాంతంగా ఉంటుంది. రాజ్యాంగ పరంగా షెడ్యూల్డు ప్రాంతమైన ఈ ప్రాంతం మొత్తాన్ని ఒకే పరిధిలోకి తీసుకుని వీలైనన్ని ఆదివాసి జిల్లాలు ఏర్పాటు చేయవచ్చును. ఆదివాసీల డిమాండ్ కూడా ఇదే. కాని ప్రస్తుతం ఖమ్మం జిల్లాలోకి షెడ్యూల్డు మండలాలైన జూలురుపాడు, ఏన్కూరు, సింగరేణి, కారేపల్లిలను మైదాన ప్రాంత జిల్లా ఖమ్మంలోకి వెళతాయి. షెడ్యూల్డు మండలాలైన బయ్యారం గర్లను మైదాన ప్రాంత జిల్లా మహబూబాబాద్‌కు వెళతాయి. వరంగల్‌లోని షెడ్యూల్డు మండలాలైన కొత్తగూడెం, గూడూరు, శానాపురంలను మహబూబాబాద్‌లోకి పంపుతారు. 40 లక్షల జనాభా గల హైద్రాబాదును మొదట రెండు జిల్లాలుగా ప్రకటించి మాట మార్చారు. 12,210 చకిమీ వరంగల్‌ను నాలుగు జిల్లాలుగా విభజిస్తున్నారు. 13,132 చకిమీ వైశాల్యం గల ఖమ్మం జిల్లాను రెండు జిల్లాలు చేస్తూ, 848 కిమీ గల మెదక్‌ను మూడు జిల్లాలు చేస్తు, 7400 చకిమీ గల కరీంనగర్‌ను మూడు జిల్లాలుగా విభజిస్తున్నారు.

ఆదివాసి జిల్లాలను ముక్కలు చేయడానికి కారణం వారి అస్థిత్వాన్ని, ప్రాంత అస్థిత్వాన్ని దెబ్బతీయడమే కాకుండా మరో కోణం ఉంది. దేశ విప్లవోద్యమానికి భూమిక ఈ ఆదివాసీల అటవీ ప్రాంతం. కొమరం భీం మొదలు నేటి జనతన సర్కారు వరకు ఆదివాసీలు రాజ్యంపై తమ హక్కుల కోసం పోరాడుతున్నారు. అసలు పోరాటమే వారి జీవన విధానం కూడా. ఆ చరిత్ర మన ముఖ్యమంత్రికి, ప్రధానమంత్రి మోడీకి కూడా బాగా తెలుసు. వీలైనంత వరకు షెడ్యూల్డు ఏరియాను ముక్కలు చేసి మైదాన ప్రాంతంలో కలిపి తద్వారా వారి పోరాట స్ఫూర్తిని నీరు గార్చడం ముఖ్యోద్దేశం. అందుకే చత్తీస్‌గడ్‌లోని బస్తర్ జిల్లా తొమ్మిది ముక్కలైంది. విప్లవోద్యమాన్ని అణిచి వేయడానికి జిల్లా పునర్విభజన ఒక ఎత్తుగడగా వాడుకుంటున్నారు. ఈ ప్రక్రియను ముందే పోలీసులకు అధికార హంగులు ఇన్నోవా లాంటి ఖరీదైన కార్లు సమకూర్చారు. కేంద్రాన్ని సహాయం కోసం అర్థించారు. ఉద్యమాల అండదండలతో అధికారం చేజిక్కించుకున్న కెసిఆర్‌కు వీటి ప్రభావం తెలుసు. అవెక్కడ తన వైపు గురి పెడతాయో తెలిసిన అతను ముందు జాగ్రత్తగా చేస్తున్న పనులలో జిల్లాల పునర్విభజన పేరుతో ఆడుతున్న నాటకం.

మరొక్క అంశం ఏమిటంటే ఇప్పుడు ప్రభుత్వం చాలా భూమిని ప్రాంతాల వారిగా పరిశ్రమలకు, కొంత భాగాన్ని కొత్తగూడెం ఎయిర్‌పోర్టుకు అప్పగించింది. ఈ భూభాగం అంతా దాదాపు గిరిజన ప్రాంతంలో ఉన్నదే. కొత్తగూడెం ఎయిర్‌పోర్టునే తీసుకుందాం. ఇక్కడ అడవి, నీరు, ఖనిజాలకు ప్రసిద్ధి. ఇక్కడ గిరిజనులు పోడు చేసుకుని వ్యవసాయం చేసుకుంటున్నారు. అక్కడి వనరులను కొల్లగొట్టడానికి ఎయిర్‌పోర్టు అవసరం. దానికి భూమి అవసరం. ప్రజలు తిరగబడితే పోలీసు ఫోర్స్ అవసరం. దానికి అతి దగ్గరగా జిల్లా హెడ్‌క్వార్టర్స్ అవసరం. కాబట్టి ఈ రోజు కొత్తగూడెం భద్రాద్రి ఒక జిల్లా అయింది. డిఎస్‌పి స్థాయి పోలీసు బలగం ఉన్న చోట జిల్లా ఎస్‌పిల స్థాయికి పెరుగుతుంది. అప్పుడు సునాయసంగా వనరులు దోపిడి జరుగుతుంటే దానికి ప్రజలు తిరగబడితే వేగంగా ప్రజావ్యతిరేక చర్యలు తీసుకోవడానికి వీలవుతుంది. అందుకే భౌగోళిక విస్తీర్ణం నైసర్గిక స్వరూపం గాని, జనాభా అంశాలు ప్రాతిపదికన కంటే కూడా గుత్త పెట్టుబడి దారి వర్గాన్ని, పరోక్షంగా సామ్రాజ్యవాదానికి బాటలు వేయడానికి ముఖ్యమంత్రి అతని ప్రభుత్వం పావులుగా మారడానికి సిద్ధపడుతున్నారు. వారి వర్గ ప్రయోజనాలను కాపాడదలుచుకున్నారు. మనం ప్రశ్నిస్తే ఆదివాసీలకు అభివృద్ధి అవసరం లేదా అవి మనల్నే ప్రశ్నిస్తారు. వారి అభివృద్ధి వారి అభిప్రాయాలు, ఆకాంక్షల మీద ఆధారపడాలినగాని పాలకుల నమూనాతో రుద్దబడగూడదు. చరిత్రలో ఆదివాసీలు రాజ్యాలు ఏర్పాటు చేసుకొని వారభీష్టం మేరకు పాలించిన చరిత్ర వారికి ఉంది.

కొత్త జిల్లాల ఏర్పాటు ప్రక్రియ పరిశీలిస్తే కుల, వర్గ రాజకీయ స్వరూపం కూడా బయట పడుతుంది. ప్రస్తుత తెలంగాణలో రెండు ఆధిపత్య కులవర్గాల ప్రాబల్యం ఉంది. ఒకటి జనాభా రీత్యా తక్కువ శాతం ఉన్నప్పటికి అధికార రీత్యా పై చేయిలో ఉంది. మరోవర్గం జనాభా రీత్యా ఎక్కువ కాబట్టి వాటిమధ్య ఘర్షణ నిత్యం నివురు గప్పిన నిప్పులా ఉంటుంది. అది ఎప్పటికైనా ప్రమాదమే. వీరే కాకుండా పాత తెలుగుదేశం మిత్రులు తమ పార్టీ వీడి టిఆర్ఎస్‌లోకి వచ్చారు. కాంగ్రెసు నుంచి వలస వచ్చిన తమ ప్రాంత భూస్వాములు ఉన్నారు. వీరితో పాటు కుటుంబ ఆశ్రితుల ప్రయోజనాలు ఉన్నాయి. ఒకే జిల్లాలో నాలుగు, ఐదు వర్గాలు ఉన్నాయి. వీరందరిని సంతృప్తి పరచనిదే అధికారం నిభాయించడం కష్టం, అందుకే ప్రజలను సౌకర్యం, పాలనా సౌలభ్యం కొరకు జిల్లాల ఏర్పాటు అని పైకి బుకాయిస్తూ స్వప్రయోజనాలకు, పెట్టుబడిదారి వర్గానికి టిఆర్ఎస్ కొమ్ము కాస్తుంది. పెరగనున్న అసెంబ్లీ నియోజక వర్గాల బ్లూప్రింట్ సిద్ధం చేసుకొని వాటి ఆధారంగా కొత్త జిల్లాల రూపురేఖలు దిద్దుకొంటున్నాయి. సమతుల్యంగా సంస్థానాలు తమ అనుచరగణంకు అప్పగించే లక్ష్యంతో టిఆర్ఎస్ ముందడుగు వేస్తుంది. తమకు రాజకీయంగా ప్రతికూలంగా ఉన్న, ప్రతిపక్ష పార్టీలకు ప్రాబల్యం ఉంటుందనుకున్న అసెంబ్లీ నియోజకవర్గాల పరిధిలోని మండలాలను విడదీసి రెండు మూడు జిల్లాలకు పంపిస్తున్నారు. అందుకే ఎలక్షన్ కమీషన్ చేయబోయే డిలిమిటేషన్ ప్రక్రియను కూడా ప్రభుత్వం ఇప్పుడే పూర్తి చేస్తుంది.

ప్రతి జిల్లాలోని మండలాలకు అస్థిత్వ, చారిత్రక రాజకీయ నేపధ్యం ఉంటుంది అన్నది వాస్తవం. ఈ జిల్లాల విభజన కూడా తీరొక్కతీరు పేర్కొన లేదు. మొదట వరంగల్‌తో పాటు జనగాం, భూపాలపల్లిని ప్రతిపాదించారు. తర్వాత జనగాంకు బదులు మహబూబాబాద్‌ను ప్రకటించారు. తర్వాత హన్మకొండ, వరంగల్ జిల్లాలలో నోటిఫికేషన్ ప్రకటించారు. జనగాం కావాలని జనగాం ఘర్షణ, డి.కె.అరుణ రాజీనామాతో వాటిని జిల్లాలుగా చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఇది ఎంతవరకు సఫలీకృతమవుతుందో వేచి చూడవలసిందే. ఆంధ్ర వలస వాదుల నుంచి ప్రాంతీయ అస్థిత్వ ఉద్యమ స్ఫూర్తితో తెలంగాణ సాధించిన ప్రజలకు మళ్లీ పెత్తందారి తనంతో వారి ఇష్టానికి వ్యతిరేకంగా జిల్లాల విభజన చేస్తున్నారు. ఉదా: వరంగల్ జిల్లాలోని దొడ్డి కొమరయ్య, బందగీ ఉద్యమ ఉత్తేజాన్ని ఇప్పటికి ప్రజలు నెమరు వేసుకుంటారు. ఆ ప్రాంతాన్ని ముక్కలు చేసి వేరే వేరే జిల్లాలకు కలుపుతుంటే ప్రజలు తిరగబడుతున్నారు. హుజురాబాద్, హుస్నాబాద్ నియోజక వర్గాలను కరీంనగర్‌లో ఉంటే వరంగల్‌లో కలపడానికి కారణం వరంగల్ జిల్లాలోని నలుగురి వందమాదిగలకు అచ్చటి భూభాగం చాలక ఈ మండలాలను కలపడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రతిపాదిత జిల్లాకేంద్రం మంచిర్యాలలో భాగంగా ఉన్న శ్రీరాంపూర్ మండలాన్ని పెద్దపల్లిలో కలపడానికి ఇదే ఏలినవారి ప్రయోజనాలు ఉన్నాయి.

లౌకిక దేశమైన భారత్‌లో భాగమైన తెలంగాణలో అన్ని కులవర్గాల వారు ఉన్నారు. సుమారుగా ఆదివాసి జనాభా 10 శాతం, 12 శాతం దళితులు, 12 శాతం మైనార్టీ వర్గాలు వీరుకాక ఇతర బడుగు బలహీన వర్గాలు పేద ప్రజలు ఉన్నారు. వారు ఏమి కోరుకుంటున్నారు అన్నది ప్రభుత్వానికి అప్రధానం అయింది. గత దశాబ్దికాలం నుంచి భారతదేశం హిందూరాజ్యం కావటానికి అనేక హిందూమతోన్మాద శక్తులు ఆర్ఎస్ఎస్, భజరంగదళ్, తీవ్రంగా పనిచేయగా 2014లో కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చింది. మన ముఖ్యమంత్రి ఉద్యమకారుడనని చెప్పుకుంటూనే యజ్ఞయాగాదులు, హోమాలతో వారికంటే ముందు వరుసలో ఉన్నారు. స్వామిలోర్లకి పుణ్యక్షేత్రాలకు పెద్ద దిక్కుగా మారిన అతను అతి చిన్న యాదగిరిగుట్ట భూభాగాన్ని ఇతర జిల్లాలోని భూభాగాలతో కలిపి యాదాద్రి జిల్లాగా చేసి చినజీయరు స్వామికి కానుకగా ఇస్తానన్న మాటను నిలబెట్టుకుంటున్నాడని వినికిడి. వారి రియల్ ఎస్టేటు ప్రయోజనాలు ఎలాగూ ఉన్నాయి. తెలంగాణ ఆవిర్భావానికి ముందు నక్సలైట్ల ఎజెండానే నా ఎజెండా అని ప్రకటించుకున్న కెసిఆర్ హిందూత్వ శక్తుల కంటే తన ధార్మిక విధానాలను బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. యాదాద్రి, భద్రాద్రి, రాజాద్రి ఇంకెన్నో మరి. 1956లో భాషానుయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడు జిల్లాలు సెక్యులర్ పేర్లతోనే ఉన్నాయి. అన్నవరం పుణ్యక్షేత్రాంగా ఉన్న తూర్పు గోదావరి అన్నవరం జిల్లాగా మారలేదు. సింహాద్రి అప్పన్న ఉన్న విశాఖ సింహాద్రి జిల్లాగా, తిరుపతి కలిగిఉన్న చిత్తూరు జిల్లా అవే పేర్లతో కొనసాగించాయి. మరొక గమనించవలసిన అంశం ఏమిటంటే 84 లక్షలు అంటే 25 శాతం తెలంగాణ జనాభా కల్గిన హైద్రాబాదు జిల్లాను హైద్రాబాద్, సికింద్రాబాద్ జిల్లాలుగా విభజిస్తామన్నారు. కాని చేయలేదు. దానికి కారణం హైద్రాబాద్‌లో 70 శాతం మైనార్టి ముస్లింలే. విభజిస్తే హైద్రాబాద్‌లో ముస్లింల పట్టు పెరుగుతుందనే భావనతోనే హైద్రాబాద్, సికింద్రాబాద్ విడగొట్టలేదన్నది అందరికి తెలిసిన వాస్తవమే. ఇది దేశంలో, రాష్ట్రంలో పెరుగుతున్న ఫాసిస్టు పాలనకి ప్రతిరూపం.

మరి జిల్లాలను ఎలా పునర్విభజించాలి. అన్న ప్రశ్న మనముందుంటే దానికి సమాధానమొక్కటే. స్వప్రయోజనాలు, నిధులు, నీళ్లు, భూమి, ఉపాధి, జనాభా, వైశాల్యం కోణాలే కాకుండా ఆ జిల్లాల సంస్కృతి, చారిత్రక నేపథ్యం, రాజకీయ సారూప్యం కలిగిన వాటిగా ఉండాలని కోరుకుంటున్నారు. ఆ రాష్ట్ర ఆదాయంలో పోలిస్తే ఉత్పత్తి వనరులు ఆ జిల్లాలో ఒకేలా ఉండాలి. జిల్లాలో వివిధ ప్రాంతాలను, ఆ ప్రాంతాల ప్రజలకు గల అస్థిత్వాలను ప్రశ్నించే స్థాయిలో కనుమరుగు చేసే రీతిలో కొత్త జిల్లాల ప్రక్రియ కొనసాగకూడదని ప్రజలు కోరుకుంటున్నారు. విప్లవ పార్టీలు మరింత ముందుకెళ్లి రాష్ట్రంలోకి షెడ్యూల్డు ప్రాంతాన్ని ఒక యూనిట్‌గా తీసుకొని వాటిని క్రమబద్ధంగా విభజించాలని డిమాండ్ చేస్తున్నారు. ఆదిలాబాద్, కొమరం భీం (అసిఫాబాదు) కరీంనగర్ జిల్లాలో మూడు సెమి షెడ్యూల్డు మండలాలతో పాటుగా వరంగల్ జిల్లాలోని షెడ్యూల్డు మండలాలతో ములుగు కేంద్రం జిల్లాగా, ఖమ్మం జిల్లాలోని షెడ్యూల్డు మండలాలతో ఇల్లందు భద్రాచలం కేంద్రంగా నాన్ షెడ్యూల్డు ప్రాంతాలలో మిగిలిఉన్న 42గా గిరిజన గ్రామాలను కలుపుతూ ఆదివాసి జిల్లాలను ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తున్నారు.

జిల్లాల ప్రతిపాదనలను ప్రజాభీష్టాన్ని దృష్టిలో పెట్టుకొని చేయాలి. ప్రజల అకాంక్షలను ఆధారంగా విధి విధానాలను రూపొందించాలి. వాటిపై నిపుణుల కమిటీని ఏర్పాటు చేసి ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా మద్దతు సంపాదించాలి. అంతేకాని జిల్లాల ఏర్పాటు రాజకీయ లబ్దికోసమో, ఉన్నత వర్గాల ఆర్థిక, రాజకీయ సామాజిక అధిపత్య వర్గాల కోసం ఉండకుండా రాజ్యాంగం నిర్దేశించినట్లుగా ఉండాలి. రాష్ట్రాల ఏర్పాటుకు ఒక మేరకు స్పష్టత ఉంది. జిల్లాల అంశం రాష్ట్రాలది అగుట వలన 7/74 చట్టం ఉన్నప్పటికి ప్రజల అవసరాలు, మౌలిక సదుపాయాలు కల్పన, అస్థిత్వం తదితర కారణాల పట్ల స్పష్టత లేకపోవడం

# మల్లన్నసాగర్ భూసేకరణ నోటిఫికేషన్ మోసం

***మల్లన్నసాగర్ నిర్మాణం వల్ల నిర్వాసితులవుతున్న వారికి ఆ ప్రాజెక్టు కింద భూమి కేటాయించకుండా రకరకాల చట్టాల లొసుగులను ప్రభుత్వం తనకు అనుకూలంగా మార్చుకొని ప్రజలను తప్పుదోవ పట్టిస్తోందని అంటున్నారు బి. రామకృష్ణ***

గత ఐదారు నెలలుగా మల్లన్నసాగర్ రిజర్వాయర్‌కు వ్యతిరేకంగా తమతమ భూములను, జీవితాలను కాపాడుకోవడానికి ప్రజలు నిరసనలు తెలుపుతూ వస్తున్నారు. భూసేకరణకు సంబంధించి తెలంగాణ ప్రభుత్వం భూసేకరణ చట్టం 2013ను వర్తింపచేయకుండా 2015 జూలై 30న జిఓ 123 ను తెచ్చింది. దీని ప్రకారం తమ ఇష్ట ప్రకారం భూములను, ఆస్తులను అమ్మడానికి పత్రాలపై సంతకాలు చేసి అంగీకరిస్తున్నట్లుగా ఒప్పందం జరుగుతుంది. భూములు, ఆస్తులకు ఏదో కొంత మొత్తం చెల్లించి చేతులు దులుపేసుకోవడం జరుగుతుంది. ఈ మొత్తంలోనే భూముల, ఆస్తుల విలువ జీవనాధారాన్ని కోల్పోవడం, పునరావాసం, పునఃస్థిరీకరణల విలువ ఉంటాయని చెప్పారు. అదెంత అనేది ఎలా నిర్ణయిస్తారో ఈ ఉత్తర్వుల్లో లేదు. భూస్వంతదారులకు ధరను నిర్ణయించడంలో భాగస్వామ్యం లేదు. అధికారులు ఎంత నిర్ణయిస్తే అంతేనన్నమాట అది న్యాయబద్ధమైనదా లేదా అని ప్రశ్నించే పరిస్థితి లేదు. మల్లన్నసాగర్ ముంపు గ్రామాల్లో ఈ ఉత్తర్వుల ప్రకారం చాలా మట్టుకు భూములను సేకరించారు. పేరుకు ఇష్ట ప్రకారం అన్నారే గాని నయాన, భయాన అనేక పన్నాగాలు పన్నారు.

ఈ క్రమంలో ముంపుకు గురయ్యే 14 గ్రామాలు అలాగే వాటిని ఆనుకుని ఉన్న మరో ఏడు చిన్న చిన్న పల్లెల్లోని ప్రజలు తీవ్రంగానే వ్యతిరేకిస్తూ వచ్చారు. నీటి పారుదల శాఖ మంత్రి, అధికార పార్టీ వ్యక్తులు ప్రజలను మభ్యపెట్టి పరోక్షంగా భయాందోళనలకు గురిచేసి జిఓ 123 ప్రకారం సేకరిస్తూపోయారు. భూసేకరణ చట్టం 2013 కంటే జిఓ 123 ద్వారానే ఎక్కువ మేలు జరుగుతుందని ప్రచారం చేస్తూ వచ్చారు. జిఓ 123ను కాదని ముందుకెళితే ప్రజలే నష్టపోతారని చెబుతూ వారిని అభద్రతలోకి నెట్టివేశారు. నష్ట పరిహారం కోసం కోర్టుల చుట్టూ తిరగవలసి వస్తుందని గతంలో నాగార్జునసాగర్, సింగూరు వంటి ఇతర ఎన్నో ప్రాజెక్టుల విషయంలో నేటికీ కూడా అప్పటి ప్రజలే కాకుండా వారి సంతానం కూడా కోర్టుల చుట్టూ తిరుగుతున్నారని స్వయానా నీటి పారుదల శాఖ మంత్రి పదేపదే ప్రకటిస్తూ వచ్చారు. అయినప్పటికీ ప్రజల నుండి వ్యతిరేకత వస్తుండడంతో ఇళ్లు కట్టిస్తామని ఇతర వసతులెన్నో కల్పిస్తామని తన వద్దకు పిలుపించుకున్న ప్రజలతో చెబుతూ, పత్రికా ముఖంగా, టీవీ చర్చల్లో నీటిపారుదల శాఖా మంత్రి హరీష్‌రావు చెబుతూ వచ్చారు. కాని ఎక్కడా కూడా పునరావాసం,

---

వలన పాలకులు ఇష్టారాజ్యంగా చేస్తున్నారు. కాబట్టి ఈ చట్టాన్ని మరింత విస్తృత పరచి హేతుబద్ధత శాస్త్రీయత కల్పించాలి. జిల్లా పునర్విభజనలో రాజ్యాంగ షరతులకు లోబడి విధి విధానాలు పాటించాలి.

రాష్ట్ర ప్రభుత్వాన్ని కూడా గిరిజనేతర వ్యక్తిగా చూడాలని సుప్రీం కోర్టు సమతా తీర్పులో చెబుతుంది. అయినప్పటికి కె.సి.ఆర్. ప్రభుత్వం రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడి షెడ్యూల్డు ప్రాంతాల్ని విడగొట్టి ఆదివాసి హక్కులకు తూట్లు పొడుస్తుంది. రాజ్యాంగ బద్ధతతో వచ్చిన హక్కులతో ఆదివాసి స్వయంపాలిత జిల్లాలను ఏర్పాటు చేయవలసిన బాధ్యత నుండి ప్రభుత్వం తప్పుకుంటున్నందుకు గవర్నరు చట్టబద్ధమైన చర్యలు తీసుకోవాలి. కాని అది జరిగేనా! ఆర్టికల్ 244(1) పార్ట్–సి 6(సి) ప్రకారం రాష్ట్రాలు విభజన క్రమంలో ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం, కరీంనగర్, మహబూబ్‌నగర్, ఆదివాసీ, నాన్‌షెడ్యూల్డు గ్రామాలను షెడ్యూల్డు హోదా కల్పించ వలసింది. కాని ఈ అంశాన్ని పట్టించుకున్న దాఖలాలు లేవు. షెడ్యూల్డు ఆర్టికల్ 244(సి) ప్రకారం షెడ్యూల్డు ప్రాంతాల పరిపాలన వ్యవహారాలు గవర్నరు అధీనంలో ఉంటాయి. అందువల్ల షెడ్యూల్డు తెగల కౌన్సిల్ ద్వారా 6వ షెడ్యూల్డును పోలిన స్వయం పాలిత జిల్లాలు ప్రకటించవచ్చును. “పెసా చట్టం –1996(4) క్లాజు ప్రకారం ఆదివాసీల అలవాట్లు భూమి అడవి ప్రకృతి వనరులు, సంస్కృతి సంప్రదాయాల రక్షణ కోసం 5వ షెడ్యూల్డులోని ప్రాంతాలను స్వయం పాలిత జిల్లాలుగా ఏర్పాటు చేసుకోవచ్చని 1996 లో భూరియా కమీషన్ 2014 లో కలేల్కర్ కమిటి శ్రీకృష్ణ కమిటి సూచించిన పాలక వర్గాలకు ఖాతరు లేదు. సుమారు 35 లక్షల జనాభాతో 17,852 చ.కి.మీ. విస్తీర్ణంలో ఉన్న ఆదివాసీల పోరాటాన్ని ఎక్కుపెడితే కాని, తమ హక్కులను కాపాడుకోలేమన్న స్పృహకు మరింత పదును పెడితే కాని ప్రభుత్వం దిగిరాదు.

ప్రజా ప్రతిఘటనలకు పుట్టినిల్లు అయిన తెలంగాణ గడ్డ పరిపాలనా సౌలభ్యం పేర ప్రజా విద్రోహ చర్యలకు పాటు పడితే గద్దెనెక్కించిన ప్రజలే బుద్ధి చెబుతారు. భౌతికంగా ప్రజల వద్దకు పాలన ముసుగులో తమకు ఇష్టం వచ్చిన అభివృద్ధి నమూనాను జిల్లాల పునర్విభజనతో ముందుకెళితే ప్రజలే త్రిప్పికొడతారు. దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్న గురుజాడ వాక్కులు మరచి ఈ మట్టినే సరుకుగా, మార్కెటుగా మార్చే ప్రభుత్వ ద్వంద్వ నీతి గుట్టు విప్పుతారు. భూమి అంటే యుద్ధభూమి కూడా కదా! భూమి కోసం తరాలుగా తెలంగాణ యుద్ధభూమిగా మారిన చరిత్ర ఉంది. ప్రతి ఒక్క తెలంగాణవాది దేశ, విదేశీ కార్పొరేట్ శక్తులకు దాసోహమంటున్న, సామ్రాజ్యవాద, దళారి పాలనకు ద్వారాలు తెరుస్తున్న ప్రభుత్వాన్ని ఆ నాయకత్వాన్ని గమనిస్తున్నారు. మహాకవి కాళోజి అన్నట్లు ‘సొంత గడ్డలో సొంతవారే అన్యాయం చేస్తే వారిని పాతరెడతారు’ అన్న ఆయన స్ఫూర్తిని ఏలినవారు గుర్తించుకుంటే మంచిది లేదా చరిత్ర పునరావృతమవుతుంది.

*(రచయిత న్యాయవాది)* వీ

పునఃస్థిరీకరణ గురించి లిఖిత పూర్వక ఉత్తర్వుల రూపంలో ముందుకు రాలేదు. ఇక్కడే ఉంది అసలు మోసం, కుట్ర. జిఓ 123లో సెక్షన్ 8లో ఉన్న పునరావాసం, పునఃస్థిరీకరణకు అవసరమయ్యే మొత్తాన్ని తెలిపే పదాలను తొలగిస్తూ జిఓ 214ను 2015 నవంబర్ 28న తెచ్చారు. అసలే జిఓ 123 సరైంది కాదంటుంటే అందులోని ఈ పదాలను తొలగించేశారు. మరోవైపు ఇళ్లు కట్టిస్తామని మరితర వసతులు కల్పిస్తామని మంత్రి చెప్పడాన్ని ఏమనాలి? ఇంకోసారి జిఓ 123, భూసేకరణ చట్టం 2013లలో ప్రజలు ఏది కోరుకుంటే దాన్ని అమలు చేస్తామని చెబుతారు. ప్రజలు భూసేకరణ చట్టం 2013 ను కోరుతున్న విషయం స్పష్టమయ్యాక జిఓ 123 వైపు ఎందుకు ఒప్పిస్తున్నారు. నేరుగా భూసేకరణ చట్టం 2013ను అమలు చేయొచ్చుకదా. ఏమంటే భూసేకరణ చట్టం ప్రకారం ప్రాజెక్టులు ఆలస్యం అవుతుందంటున్నారు. 20వేల ఎకరాల భూములు సుమారు 15వేల జనాభా ఉన్న 3వేలకు పైగా కుటుంబాల జీవితాలు విచ్ఛిన్నం కాబోతున్న సందర్భంలో నిర్వాసితుల కుటుంబాల గురించి ఆలోచించకూడదా. ప్రాజెక్టులు ఎవరి కోసం, ఎందుకోసం, ఏ ప్రయోజనాల కోసం స్పష్టం చేయాలి కదా. వీరు తమ భూములను, ఆస్తులను, సామాజిక సంబంధాలను, తమ ప్రాంతం, ఊర్లపై ఉండే మమకారం, అనుబంధం, ఉపాధులు ఓ రకంగా జీవితాన్నే కోల్పోతున్నప్పుడు వారి పక్షాన నిలబడాల్సిన అవసరం లేదా?

అభివృద్ధి కోసం కొందరు త్యాగాలు చేయవల్సిందేనని పట్టుబట్టేవారు గుర్తించవలసిందేమంటే ఆ అభివృద్ధిలో ఈ ప్రజలకు స్థానం ఎందుకు ఉండకూడదని. ప్రాజెక్టు వల్ల ప్రయోజనం జరుగుతుందని అంటున్నప్పుడు ఆ ప్రయోజనాలను నిర్వాసితుల ప్రజలకు ఎందుకు పంచకూడదని. లక్షల ఎకరాలకు సాగునీరు అందుతుందని అంటున్నప్పుడు ప్రయోజనం పొందే ఆ భూముల్లో ఈ ప్రజలకు వాటా ఎందుకు ఇవ్వరని. ప్రాజెక్టు రాకముందు నీరందని భూములకు నీరు వస్తుందని అనుకుంటున్నప్పుడు నీరందే ఆ భూముల్లో కొంతభాగం ఈ ప్రజలకు ఎందుకు ఇవ్వకూడదని, నిర్వాసితుల జీవితాలను ఛిద్రంచేసి వారి రక్తమాంసాలను మరెవరికోసమో పంచిపెడదామనడం, అలా కోరుకోవడం సరైనది ఎలా అవుతుంది.

ముంపుకు గురయ్యే గ్రామాల్లోని వేములఘాట్ ప్రజలు మొదటి నుండి మల్లన్నసాగర్ ప్రాజెక్టును బలంగా ప్రతిఘటిస్తూ వస్తున్నారు. వారు జిఓ 123 ప్రకారం భూములివ్వడానికి సిద్ధపడలేదు. అదే క్రమంలో హైకోర్టు ఈ జిఓను కొట్టివేసింది. కోర్టు వ్యవహారాలు, ప్రజా ప్రతిఘటనల ఫలితంగా ప్రభుత్వం చివరకు 2016 సెప్టెంబర్ 29న వేములఘాట్‌లో 775 ఎకరాలు, 1 గుంటలు, ఎర్రవల్లిలో 161 ఎకరాలు, 25గుంటల భూముల సేకరణకై 2013 చట్టం ప్రకారం ప్రాథమిక నోటిఫికేషన్‌ను విడుదల చేసింది. డా. బి.ఆర్. అంబేద్కర్ ప్రాణహిత చేవెళ్ల సుజల స్రవంతి ప్రాజెక్టు రిజర్వాయర్ నిర్మాణ నిమిత్తం అవసరమున్నదని భావించినందున సెక్షన్ 40 కింద భూసేకరణ అత్యవసరం అయినందున సామాజిక ప్రభావం అధ్యయనం నుంచి మినహాయిస్తూ భూములకై నోటీసు జారీ చేయనైనదని తెలిపారు. సెక్షన్ 15 ప్రకారం ఇట్టి ప్రాథమిక నోటిఫికేషన్ జారీ చేసిన 60 దినాలలో సంబంధమున్న వ్యక్తులెవరైనా భూసేకరణ అధికారి ముందు వారి అభ్యంతరాలను రాతపూర్వకంగా తెలియజేయవచ్చునని 1) ప్రత్యేక ఉపకలెక్టర్ (భూసేకరణ), యూనిట్ III, డా. బిఆర్ఎపిసిఎస్ ఎస్‌పి అండ్ రెవిన్యూ డివిజనల్ అధికారి. 2) జాయింట్ కలెక్టర్, మెదక్ జిల్లా 3) జిల్లా కలెక్టర్ మెదక్, సంగారెడ్డి గారి సంతకాలతో నోటీసులు జారీ చేయడం జరిగింది. భూసేకరణ చట్టం సెక్షన్ 40 ప్రకారం అత్యవసర పరిస్థితుల్లో అంటే భారత డిఫెన్స్ లేదా జాతీయ భద్రత లేదా ఏవైనా ప్రకృతి వైపరీత్యాల వల్ల వచ్చే అత్యవసరాలు లేదా పార్లమెంటు ఆమోదించిన ఇతర అత్యవసరాలకు సంబంధించిన వాటికోసం అవసరమైన కనీస విస్తీర్ణానికి పరిమితమై ఉంటుంది. దీని ప్రకారం పరిహారం అవార్డు ప్రకటించకపోయినప్పటికి కూడా ప్రభుత్వ నిర్దేశం ప్రకారం కలెక్టర్ నోటిఫికేషన్ ఇచ్చిన 30 దినాలలో ఆ భూములన్నీ ప్రభుత్వ ఆధీనంలోకి వస్తాయి.

అయితే వేములఘాట్, ఎర్రవల్లి గ్రామాల్లో భూసేకరణకు సంబంధించి ఈ అత్యవసర పరిస్థితులలోని ఏది కూడా వర్తించదు. ఈ సెక్షన్‌ను అనుసరించి సామాజిక ప్రభావ అధ్యయనం నుండి మినహాయిస్తూ భూసేకరణకు నోటీసు జారీచేయడం ప్రజలను తప్పుదారి పట్టించడం అవుతుంది. సెక్షన్ 40(4) ప్రకారం భూముల సేకరణ చేసేటప్పుడు 2013చట్టంలోని చాప్టర్ II నుండి చాప్టర్ VI (సెక్షన్ 4 నుండి 47)వరకు ఉన్న నిబంధనల్లో కొన్నింటిని గానీ అన్నింటిని గానీ అన్వయించకుండా ఉండే అవకాశం ప్రభుత్వానికి ఉంది. ఈ మినహాయింపుల్లో మచ్చుకు కొన్ని చూద్దాం.

ప్రజాప్రయోజన పథకం కోసం భూమిని సేకరించాలని అనుకున్నప్పుడు స్థానిక పంచాయితీలను సంప్రదించి ప్రభావిత ప్రాంతంలో సామాజిక ప్రభావ అంచనా అధ్యయనం చేయాలి. ఈ అంచనాలో సేకరించే భూమి ప్రజా ప్రయోజనాలను నెరవేరుస్తుందా, నిర్వాసిత కుటుంబాలు, బాధిత కుటుంబాల అంచనా, ఎంత భూమి, ఎన్ని ఇళ్లు ఆవాసాలు మునిగిపోతాయి. సేకరిస్తున్న భూమి ప్రతిపాదిత ప్రాజెక్టుకు అవసరమైన అత్యంత కనీస విస్తీర్ణమేనా? మరొకచోట ఇంత భూసేకరణ జరగడానికి అవకాశం లేదని నిర్ధారణ జరిగిందా. మొత్తం ప్రాజెక్టు ఖర్చులో సామాజిక ఖర్చు భాగం ఎంత వంటి ఎన్నో అంశాలను అధ్యయనం చేయాలని చాప్టర్ II లోని సెక్షన్ 4 వివరిస్తుంది.

ఈ సామాజిక ప్రభావ అంచనా రిపోర్టును స్వతంత్ర నిపుణుల బృందంచే పరీక్షింపజేయాలని సెక్షన్ 7 వివరిస్తుంది. చాప్టర్ IIIలోని సెక్షన్ 10 ఆహార భద్రత గురించి వివరిస్తుంది. దీని ప్రకారం అసాధారణ పరిస్థితుల్లో తప్పిస్తే బహుళపంటలు, నీటి పారుదల వసతులున్న భూములను సేకరించకూడదు. పొడవైన మార్గాల్లో నిర్మించే ప్రాజెక్టులైన రైల్వేలు, హైవేలు, మేజర్ జిల్లా రోడ్లు, నీటి పారుదల ప్రాజెక్టులు, కరెంటు లైన్లు వంటివాటికి మినహాయింపులనిచ్చారు. నీటి పారుదల కాలువలకు మినహాయింపు ఉంది కానీ నీటి రిజర్వాయర్లకు లేదు. దీని ప్రకారం చూస్తే మల్లన్నసాగర్ రిజర్వాయర్ ప్రాజెక్టు 2013 చట్టానికి విరుద్ధమైనది. ఎందుకంటే ఈ ప్రాంతమంతా కూడా బహుళ పంటలు పండే నీటి పారుదల వసతులున్నాయి.

చాప్టర్ V లోని సెక్షన్ 31 ప్రకారం ప్రభావిత ప్రాంత ప్రజల పునరావాసం, పునఃస్థిరీకరణకు సంబంధించి ఒక కమిషన్‌ను నియమించాలి. ఈ కమిటీలో ప్రభుత్వ అధికారులతో పాటుగా బాధిత ప్రాంతాల్లో నివసించే మహిళా ప్రతినిధి, ఎస్‌సి, ఎస్‌టి ప్రతినిధి, స్వచ్ఛంద సంస్థ ప్రతినిధి, జాతీయ బ్యాంకు ప్రతినిధి, పంచాయతీ ఛైర్ పర్సన్ పార్లమెంటు అసెంబ్లీల సభ్యులు వంటి వారు ఉండాలి. సెక్షన్ 39ను అనుసరించి నష్టపరిహారాన్ని 3 నెలలలోపు అందించాలి. పునరావాసం పునఃస్థిరీకరణకు సంబంధించిన ధనాన్ని 6 నెలల లోపు చెల్లించాలి.

మౌలిక వసతుల ఏర్పాటుకు సంబంధించి 18 నెలల లోపు కల్పించాలి. నీటి పారుదల ప్రాజెక్టుల విషయంలోనైతే సేకరించిన భూములు మునిగిపోయే 6 నెలల లోపే పునరావాస, పునః స్థిరీకరణ ఏర్పాట్లు చేయవలసి ఉంటుంది. ఇవన్నీ ఏర్పాటు చేయడానికి కలెక్టర్ పూర్తి బాధ్యత వహించాలి. ఇవన్నీ కూడా ప్రభావిత ప్రాంత ప్రజలను నిర్వాసితులను చేసేకంటే ముందే కల్పించాలి. భూములకు సంబంధించి మార్కెట్ విలువను సవరించడానికి, నిజమైన మార్కెట్ రేటుతో సమానం చేయడానికి తగిన చర్యలు తీసుకోవాలని సెక్షన్ 26లో వివరించారు. నిర్వాసితులకు ఎక్కువ ప్రయోజనం చేకూర్చేలా మార్కెట్ విలువలను కలెక్టర్ నిర్ణయించే అధికారాన్ని కలిగి ఉన్నాడు.

2013 చట్టంలో 'ప్రజా ప్రయోజనం' అనే నెపంతో, ప్రత్యేక పరిస్థితులనే మినహాయింపులను, ఆహార భద్రత గురించి మరో చోట భూములను వినియోగిస్తామని, మరేవో కారణాలను చూపి భూములను సేకరించే వెసులుబాటును 2013 చట్టం ప్రభుత్వం చేతిలో పెట్టిందనేది కూడా మర్చిపోకూడదు. మల్లన్నసాగర్ వంటి వాటికి సంబంధించి న్యాయంగా, నైతికంగా ప్రభుత్వాలకు భూసేకరణ సాధ్యపడదు. కానీ బుల్డోజర్ లా తరుముకు వస్తున్నప్పుడు బలమైన ప్రజాప్రతిఘటన తప్ప 2013 చట్టంలోని ఏ నిబంధనలు అడ్డంగా నిలువవు. నర్మదా నదిపై డ్యాంలకు వ్యతిరేకంగా వచ్చిన బలమైన ఉద్యమాలను అణచివేసిన, పశ్చిమబెంగాల్ లోని సింగూరు విషయంలో ప్రజలు విజయం సాధించిన అనుభవాలు ఉండనే ఉన్నాయి. భూసేకరణ చట్టం ప్రకారం విస్తాపనకు గురయ్యే వారికున్న రక్షణల గురించి వాటి అమలు గురించి ప్రభుత్వం ఆలోచించడం లేదు. భూసేకరణ చట్టంలోని 107 సెక్షన్ ప్రకారం ఈ చట్టంలోని పునరావాస, పునః స్థిరీకరణ, నష్ట పరిహారాల కంటే మరింత మెరుగైన వాటిని ఏ రాష్ట్రమైనా సరే అందించడానికి విధానాలను ఏర్పరుచుకోవచ్చు. అయితే కనీసం 2013 చట్టాన్నైనా అమలు చేయాలని అడగవలసి వస్తున్నది. 2013 చట్టంలోని షెడ్యూల్ 1లో కనీస నష్టపరిహారాన్ని ఎలా లెక్కించాలో వివరించారు. భూములకు, ఆస్తులకు మార్కెట్ విలువను లెక్కించే విధానాన్ని సెక్షన్ 29లో వివరించారు. సెక్షన్ 26 ప్రకారం కలెక్టర్ మార్కెట్ విలువను నిర్ణయించే లేదా సవరించే అధికారం కలిగి ఉన్నాడు. షెడ్యూల్ 1లో వివరించిన నష్ట పరిహారానికి అదనంగా పునరావాస, పునః స్థిరీకరణలో భాగంగా బాధిత కుటుంబాలకు ఇవ్వవలసిన వాటిని రెండవ షెడ్యూల్ (31(1), 38(1), 105(3)లను అనుసరించి) లో వివరించారు. దీని ప్రకారం ఇళ్లు కోల్పోయిన వారికి ఇళ్లు ఇవ్వాలి. ఈ ఇళ్లను ఇళ్లులేని బాధిత ప్రజలకు కూడా ఇవ్వాలి.

నీటి పారుదల ప్రాజెక్టుల విషయంలోనైతే వ్యవసాయ భూములను కోల్పోతున్నప్పుడు నష్టపరిహారానికి బదులుగా ప్రాజెక్టు కమాండ్ ఏరియాలో కనీసం ఓ ఎకరా భూమి, ఎస్.సి, ఎస్.టిల విషయంలోనైతే ఎంత కోల్పోతే అంత లేదా రెండున్నర ఎకరాలలో ఏది తక్కువైతే అది కేటాయించాలి. ప్రాజెక్టు వలన వచ్చే ఉద్యోగాల్లో నిర్వాసిత కుటుంబాల్లో కనీసం ఒకరికి ఉద్యోగం ఇవ్వాలి లేదా కుటుంబానికి 5 లక్షల చొప్పున ఒకేసారి చెల్లించాలి లేదా 20 ఏళ్లకు గాను ధరల సూచీ ఆధారంగా నెలకు 2 వేలకు తగ్గకుండా ఒక్కో కుటుంబానికి చెల్లించాలి. జీవనోపాధిగా ప్రతి నిర్వాసిత కుటుంబానికి నెలకు రు. 3 వేల చొప్పున ఒక సంవత్సరం వరకు చెల్లించాలి. నిర్వాసిత కుటుంబాలు ఖాళీ చేసి మరో ప్రాంతానికి వెళ్లడానికి రవాణా ఖర్చుల నిమిత్తం రు. 50 వేలు చెల్లించాలి. గొడ్లపాక, చిన్నచిన్న కొట్లు ఉన్న కుటుంబాలకు కొత్త ప్రాంతంలో వాటిని ఏర్పాటు చేసుకోవడానికి గాను కనీసం రు. 25 వేలు ఇవ్వాలి. వ్యవసాయేతర భూములు కలిగి ఉన్నవారు లేదా వృత్తిపనివారు, చిన్నచిన్న వ్యాపారస్తులు లేదా స్వయం ఉపాధి పొందుతున్న వ్యక్తులకు కనీసంగా 25వేలు ఒకేసారి చెల్లించాలి. ప్రాజెక్టులో చేపలు పట్టుకునే హక్కు బాధిత కుటుంబాలకు ఇవ్వాలి. ప్రతి నిర్వాసిత కుటుంబానికి 50 వేల మొత్తం చెల్లించాలి. ఇవన్నీ కూడా షెడ్యూల్ 1 ప్రకారం చెల్లించే నష్ట పరిహారానికి అదనంగా ఉంటాయి.

మూడవ షెడ్యూల్ (సెక్షన్స్ 32, 38(1), 108(3)లను అనుసరించి) నిర్వాసితులు కావడం ద్వారా అనుభవించే వ్యధను తగ్గించడంలో భాగంగా పునఃస్థిరీకరణ చేయడంలో మౌలిక వసతుల ఏర్పాటు గురించి వివరిస్తుంది. రోడ్లు, రవాణా వ్యవస్థ, బస్ సర్వీసులు, డ్రైనేజీ వ్యవస్థ, ప్రతి కుటుంబానికి రక్షిత మంచినీటి వ్యవస్థ, పశువులకు తాగునీరు, పశువుల మేతకు సంబంధించిన స్థలం, రేషన్ దుకాణాలు, పంచాయతీ భవనాలు, గ్రామస్థాయి పోస్టాఫీసులు, విత్తనాలు, ఎరువుల వసతులు, స్మశాన వాటికలు, విద్యుత్ కనెక్షన్లు, అంగన్ వాడీలు, విద్యా హక్కు చట్టం గురించి పాఠశాలలు, ఉప ఆరోగ్యకేంద్రం, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, పిల్లలకు ఆటస్థలం, ప్రతి వందమందికి ఒక కమ్యూనిటీ కేంద్రం, పశువైద్య సేవలు మొదలైనవన్నీ కూడా కల్పించాలి.

ఇప్పుడు సామాజిక ప్రభావ అంచనా అధ్యయనం నుండి మినహాయింపులను పొందేందుకు సెక్షన్ 40 ప్రకారం భూసేకరణ కోసం ప్రాథమిక నోటిఫికేషన్‌ను జారీ చేశారు. ఈ సెక్షన్‌ను మల్లన్నసాగర్ కోసం అన్వయించడం ఏ కోశానా సరైందికాదు. ఇది మోసపూరితం. 2013 చట్టంలోని ఛాప్టర్ XII లోని సెక్షన్ 84(3) ప్రకారం 2013 చట్టాన్ని తప్పుగా అన్వయిస్తే లేదా ఉల్లంఘిస్తే, సరిగ్గా పాటించకపోతే సంబంధిత అధికారులపై క్రమశిక్షణ చర్యలు తీసుకోవల్సి ఉంటుంది. సెక్షన్ 40 చాటున మల్లన్నసాగర్ నిర్మాణ న్యాయబద్ధతను వివరించే సామాజిక ప్రభావ అంచనా అధ్యయనం నుండి మినహాయింపులను పొందేలా ప్రభుత్వం తప్పుడు నోటిఫికేషన్‌ను జారీ చేసింది. ఇది అసమంజసమైనది. ఈ నోటిఫికేషన్‌ను వెనక్కి తీసుకుని, ఇలా జారీ చేసినందుకు క్షమాపణలు చెప్పాల్సి ఉన్నది. ప్రాజెక్టు నిర్మాణం జరగాలా వద్దా అనేది తేలాలి కదా! అందుకోసం సామాజిక ప్రభావ అంచనా అధ్యయనం, స్వతంత్ర నిపుణుల బృందం అధ్యయనాలను, పర్యావరణ ప్రభావ అధ్యయనాలను చేపట్టవలసి ఉన్నది. దానికోసమే పూర్తి వివరాలతో ఉన్న ప్రాజెక్టు నివేదిక ( డిపిఆర్) అనేది అవసరం. ఇదంతా కూడా 2013 చట్టంలో చెప్పబడింది. ప్రాజెక్టు నిర్మాణ సమంజసత్వం తేలిన తరువాతనే భూసేకరణకు వెళ్లాలి. అలాంటిదేమీ జరపకుండానే, నష్టపరిహారం పునరావాస, పునఃస్థిరీకరణ ప్రణాళిక లేకుండానే మల్లన్నసాగర్ కోసం ముంపుకు గురయ్యే 14 గ్రామాల్లో వేములఘాట్, ఎర్రవల్లి గ్రామాలలోని కొంతభాగం తప్పిస్తే అన్నింటిలో 123 ప్రకారం భూములను స్వచ్ఛందంగా వదులుకుంటున్నట్లు ఒప్పందం చేయించుకున్నారు. ఇదెంత దగా. తన చేతిలో అధికారం, పోలీసు బలగాలు ఉన్నాయి కదా అని ప్రభుత్వం ఇష్టారీతిన వ్యవహరించడం తగదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# సాంస్కృతిక తంతువు తెగుతున్న బతుకమ్మ!

*తెలంగాణ ప్రజల అస్తిత్వ పోరాటానికి ఉద్యమ ప్రతీకగా నిలిచిన బతుకమ్మ ఇప్పుడు పాలకుల ప్రచార వస్తువుగా మారిపోయిందని అంటున్నారు* **గొడితాల వెంకటేశ్వర్లు**

తరాల తరబడి జరిగిన అస్తిత్వ పోరాటానికి తెరపడింది. తమదైన సంస్కృతి కోసం అర్రులు చాచిన తెలంగాణ ప్రజానీకం ఇప్పుడు తన్మయత్వంతో తడిసి ముద్దవుతోంది. తెలంగాణలోని పండుగలు పబ్బాలు అన్నీ సామూహిక సంబరాలే. సాంస్కృతిక ఏకీకరణకు జీవగర్రలే. ఉర్సులైనా, ఉత్సవాలైనా, జాతరలైనా సామూహిక జన సమైక్యతకు ఆటపట్లు. దసరా పండగనాటి అలాయ్ బలాయ్ అయినా, పీరీల పండగనాటి హిందూ ముస్లిం సోదరులు సమైక్యతారాగంతో ఆడే అలావ్ ఆటైనా, రంజాన్ మాసపు ఇఫ్తార్ విందైనా, కులమతాలకతీతంగా ఎత్తే బోనాల పండుగైనా అన్నీ కలగలిసిన సబ్బండ వర్ణాల సమ్మేళనాలే. తెలంగాణ జాతి సాంస్కృతిక ఏకీకరణకు తార్కాణాలే. అటువంటి సువిశాల సౌభ్రాతృత్వ భావన వెల్లివిరిసే సాంస్కృతిక జీవనమే తెలంగాణ సమాజానికి పెట్టనికోట. కాగా...

సంతోషానికి విషాదానికి, చావుకి పుట్టుకకి, వ్యక్తి పూజకు, విగ్రహ పూజకు పూలను వాడుకోవడం ప్రపంచానికి తెలుసు. కాని కులమత వర్గ వైషమ్యాల భేదం లేకుండా ధనిక పేద తేడా లేకుండా సామాజిక ఏకీకరణకు సమిష్టి తత్వానికి చిహ్నంగా పూలతో పలకరించుకోవడం ఒక్క తెలంగాణకే తెలుసు. అదే బతుకమ్మ.

సామాజిక అంతరాలు, నిచ్చెనమెట్లు సమాజంలోని నిమ్నోన్నతాలు ఎన్ని ఉన్నా మనిషితత్వమొక్కటే, మానవీయ స్పర్శ ఒక్కటే ముఖ్యమన్న అంతస్సూత్రం బతుకమ్మ తెలుపుతుంది. బంగారు వన్నెలీనే తంగేడు పూలు, ఏటిగట్లపై ఎనుగులపై పూసే కట్లపూలు, ఎద్దుల కాలిగిట్టెల కింద నలిగే గడ్డిపూలు, పంటచేల మీది గునుగుపూలు, పెంటకుప్పల మీది గోరెంట్లపూలు, బంతులు, చేమంతులు అన్నీ కలిసి బంగారు బతుకమ్మగా అడపడుచుల చేతుల మీదుగా ఒక్కటై, భేదభావంలేని అంతరంలేని, ఆత్మగౌరవాన్ని ఆనందాన్ని పొందినట్లుగా సమాజమంతా సుకుమారమైన మానవీయ స్పర్శతో మెలగాలని బతుకమ్మ తత్వం చెబుతోంది. తెలంగాణ జాతి చరిత్రకు సంస్కృతికి సంప్రదాయా లకు చిహ్నంగా నిలిచిన బతుకమ్మ ప్రకృతితో ప్రకృతిని ఆరాధించే తత్వాన్ని నేర్పుతుంది.

నిజానికి తెలంగాణలో భిన్నకులాల, మతాల, దొరల, భూస్వాముల, అట్టడుగు వర్గాల సమాజం ఉంది. ఒకప్పటి నిజాం కాలంలో సామూహిక ఉత్సవాల నిర్వహణ నిషిద్ధంగా ఉండేదంటారు. అటువంటి కాలం నుండి నిన్నమొన్నటి ఆంధ్రపాలన అంతమయ్యేవరకు 'బతుకమ్మ' పోరాటానికి ప్రతీకగా నిలిచింది. సామూహిక సామాజిక ఏకీకరణకు తోడ్పడింది.

సాగిపోతున్న ప్రజాపోరాట ప్రవాహాలను ఒకప్పుడు తలుపు చాటునుండి చూసే తరుణుల హృదయాల్లో రగిలే స్వేచ్ఛాపిపాసకు, స్త్రీశక్తి నైపుణ్యానికి, స్త్రీల ఏకీకరణకు, ప్రాకృతిక శుద్ధికి బతుకమ్మ బాటలు పరచింది. కౌటుంబిక వ్యవస్థ విచ్ఛిత్తితో మానవ సంబంధాలు అనుబంధాలు మరుగున పడుతున్న నేటి సమాజంలో బతుకమ్మ అనుబంధాల వారధిగా, మానవ సంబంధాల మనుగడకు మలుపుగా నిలుస్తుంది.

అరవై ఏళ్ల కల సాకారం కావడానికి ఉద్యమ ప్రతీకగా నిలిచిన బతుకమ్మ తెలంగాణ సామాజిక ఏకీకరణకు నిలువెత్తు పూల సంతకమై నిలిచి ఆంధ్రా నిరంకుశ పాలనపై అంకుశమై అవతరించి, అమరుల త్యాగాలతో స్వాతంత్ర పతాకం ఎగరేసిన బతుకమ్మ ఇప్పుడిక స్వతంత్ర తెలంగాణ సౌభాగ్యగీతిక.

బతుకమ్మ సాహిత్యం, పాటలు కేవలం భారత రామాయణాది పురాణ సంబంధ గేయాలేగాక, సమాజంలోని కులాలతో సంబంధం లేకుండా, భిన్నవ్యక్తుల నడుమ సంబంధాలను సృష్టించుకుంటూ వ్యంగ్యాన్ని అధిక్షేపాన్ని, ఆశీశ్శాపాలను కలబోసుకొని ఆత్మీయతానుబంధాలను ప్రతిధ్వనింపజేస్తాయి. అంతేగాకుండా స్త్రీలపై అణచివేత, స్త్రీపట్ల చిన్నచూపు, అవమానాలపాలై మానాభిమానాలు కోల్పోయిన సందర్భాలను తెలియజేస్తూనే, గతంలో నుండి వర్తమానం, వర్తమానం నుండి భవిష్యత్తులో ఏ అణచివేతా లేకుండా సమసమాజం రూపొందాలన్న భావనను కల్గిస్తాయి. ఉద్యమకాలంలో బతుకమ్మను ఆలంబనగా చేసుకొని వెలువడిన గేయసాహిత్యమే ఇందుకు తార్కాణం.

ఒక్క కుటుంబంలోని వ్యక్తులనే ఏకం చేయడం కాదు. మొత్తం తెలంగాణా సమాజంలోని వ్యక్తులను, కష్టసుఖాలను, సంబంధ బాంధవ్యాలను పంచుకునే కౌగిలింతల కూడలి బతుకమ్మ. ఇప్పుడు ఆప్యాయతల కలబోత బతుకమ్మ. ఆత్మీయ ఆలింగనాల గుబాలింపు బతుకమ్మ.

దశాబ్దాల తరబడి తెలంగాణ సంస్కృతీ సంప్రదాయాలు, పండుగలు, ఆచారాలు, భాష అణచివేయబడి అనాదరణకు గురైనాయి. ఈ నేపథ్యంలో ఇరవై ఒకటో శతాబ్దం పూర్వార్థంలోనే తెలంగాణ సాంస్కృతిక పునరుజ్జీవనానికి నాంది పలకాలి. తెలంగాణ సంస్కృతి పట్ల విస్పష్టమైన రాజకీయ దృఢచిత్తంగల పాలకపక్షాలు 'బతుకమ్మ'ను, 'బోనాలు'ను రాష్ట్ర పండుగలుగా పరిగణించి ఉత్సవాలు నిర్వహించడం మన సంస్కృతిని ప్రపంచానికి చాటిచెప్పినట్లయింది. బతుకమ్మ పండుగల ప్రాశస్త్యాన్ని కోడిపందాల క్రిందో, అట్లతద్దె క్రిందనో అణగదొక్కిన పాపపంకిలాన్ని ఇప్పుడిప్పుడే కడుక్కుంటోంది. ఇప్పుడిక తెలంగాణలో బోనాలు కులమతాల సమైక్యతకు ఆనవాలు కాగా, బతుకమ్మ స్త్రీ చైతన్యానికి,

సామూహిక స్త్రీల హక్కుల పోరాటాలకు దిక్సూచి కావాలి. సాంఘిక, పురాణ కథనాలలో అణచివేయబడి, అనాదరణకు గురై, అత్తింటి ఆరళ్లకు బలై, తిరుగుబాటు ఆత్మపోరాటమై, శక్తిగా, భావస్వేచ్ఛకు ప్రతినిధిగా నిలబడిన బతుకమ్మ తెలంగాణ సమాజ ఏకీకరణకు సాక్షిగా నిలబడాలి.

అలాగాకుండా తెలంగాణ సాంస్కృతిక ప్రతీకయైన బతుకమ్మ ఇప్పుడు పాలకులకు ప్రచార వస్తువైంది. రాష్ట్ర పండుగ పేరుతో పెద్దపీట వేస్తున్నట్లు రాజ్యం రాగాలుదీస్తుంది. బతుకమ్మ పండుగను తామే సృష్టించినట్లు వింతపోకడలు పోతోంది. పండగ పేరుమీద కోట్లాది రూపాయలు విడుదల చేస్తున్నట్లు చెప్తుంది. 10 కోట్ల నుండి 35 కోట్ల వరకు బడ్జెట్ పెట్టి విదేశాల్లో సైతం బతుకమ్మ ఖర్చు చేయడం వింతగా అనిపిస్తోంది. చెరువుగట్ల దగ్గర మట్టి నింపి చదును చేయడానికి, విద్యుద్దీపాలు ఏర్పాటుకు, బతుకమ్మ ఘాట్ల నిర్మాణాలకు ఖర్చు చేస్తున్నట్లు చెప్పుకుంది. తాత్కాలిక ఏర్పాటుకు కోట్ల రూపాయలు కుమ్మరించడం చూస్తే రాష్ట్రాభివృద్ధిని కాంక్షించే బుద్ధిజీవులకు విస్మయం కలుగక మానదు. పైగా గతంలో తెలంగాణలో బతుకమ్మ ఆడుకునే వాళ్లే లేనట్లు, తామే ఇప్పుడే ఆ ఘనత సాధించినట్లు గొప్పలు పోతూ, కేరళలో ఓనం పండుగకు ఐదువేల మందితో సామూహిక ఉత్సవం ద్వారా గిన్నీస్ బుక్ రికార్డు సాధించారని, కనీసం 10 వేల మందితో తెలంగాణలో బతుకమ్మ ఆడించి గిన్నీస్ బుక్ రికార్డు నెలకొల్పాలనుకుంది. తద్వారా విదేశీయులను ఆకర్షించి పర్యాటక రంగాన్ని అభివృద్ధి పరచుకోవచ్చని ప్రభుత్వం ఆలోచనగా చెప్పుకుంది. ఈ పర్యాటక రంగ అభివృద్ధి బతుకమ్మ ఆడే సామాన్య స్త్రీలకు ఏమైనా ఉపయోగపడుతుందా? పోనీ పూల పండగకు కొండెక్కిన, సామాన్యులందరికి అవసరమైన పూలరేట్లను అదుపు చేయలేని ప్రభుత్వం ఈ పూల పండగ పేరుతో తెలంగాణను ప్రపంచపూల మార్కెట్‌గా మరో ఆమ్‌స్టర్‌డ్యాంగా తీర్చిదిద్దగలదా?

ఖండాంతరాల్లో బతుకమ్మను ప్రపంచానికి పరిచయం చేయడం ప్రశంసనీయమే. కాని తెలంగాణను అంటిపెట్టుకొని ఉన్న తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, గుజరాత్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో నివసించే, మరీ ముఖ్యంగా మహబూబ్‌నగర్, కరీంనగర్, వరంగల్, నిజామాబాద్ జిల్లాల పరిసర ప్రాంతాల నుండి వలసవెళ్లిన తెలంగాణ ప్రజలున్న చోట బతుకమ్మ ఆడి అక్కడి రాష్ట్రాల ప్రజలకు బతుకమ్మ విశిష్టత చాటడం పక్కనపెట్టి, ప్రచారార్భాటానికి పరాయి దేశాల్లో బతుకమ్మ వేడుకలంటూ తెరతీశారు. అదీ సద్దుల బతుకమ్మ తర్వాత కూడా వారం రోజులుగా బతుకమ్మలు పేర్చడం, పసుపు ముద్దను గౌరమ్మగా భావించే తెలంగాణ ప్రజల పవిత్ర విశ్వాసాన్ని కాపాడినట్లా? లేక హేళన చేసినట్లా ఆలోచించాలి. స్వార్థ ప్రయోజనాల కొరకు ప్రజల విశ్వాసాన్ని పరిహసించడం తగదు. తరాలుగా బతుకమ్మను పవిత్రంగా తమ ఇంటి దేవతగా భావించి పూజ గదిలో పూజలందుకున్న బతుకమ్మ ఇప్పుడు పాలక పక్షాల అత్యుత్సాహంతో నడిబజారులో ప్లాస్టిక్‌పూలను చుట్టుకొని, పెట్రోల్ బంకులు, సినిమాహాళ్ల ముందు రాలిపోయిన ప్లాస్టిక్ పూల రెక్కల సాక్షిగా బరువుగా, బాధగా దర్శనమిస్తోంది. ప్రభుత్వ ప్రచారహోరులో బతుకమ్మ స్వచ్ఛతకు ప్రాకృతిక సహజత్వానికి దూరంగా జరుగుతోంది. ఇటువంటి అసహజ ధోరణికి విదేశీ బతుకమ్మకు మీడియా విస్తృత ప్రచారమివ్వడం నిజంగా విడ్డూరమే. ఎక్కడా వెలివాడల్లో మాల మాదిగ వాడల్లో బతుకమ్మ ఆడించిన, ఆడిన దాఖలా లను అవిచూపించే సాహసంగాని మీడియా చేయలేదు. ఒక వ్యక్తి పూజకు మాత్రమే మీడియా నీరాజనాలు పట్టడం హాస్యాస్పదంగా ఉంది. పైగా ప్రభుత్వ పోకడలతో తెలంగాణలో బతుకమ్మ ఆటలో వింతలు చూడాల్సి వచ్చింది. అదేమిటంటే, స్త్రీలు మాత్రమే ఆడుకునే బతుకమ్మ ఆట ఈసారి పురుషులు ఆడడం, అధికారులు చుట్టు కాముడేయడం బహుశా అధికారుల ఆజ్ఞలను తిరస్కరించలేకనో లేక అధినాయకులకు ఎదురు చెప్పలేకనో గాని పురుషులాడే బతుకమ్మ తెలగాణలో వింతగాక మరేమవుతుంది.

ఏకీకృతమైన తెలంగాణ స్త్రీ సమాజంలో ఆధిపత్యపోరుతో మరో వింత పోకడ పొటమరించింది. బంగారు బతుకమ్మ అని ఒకవైపు, బహుజన బతుకమ్మ అని మరోవైపు తెలంగాణ స్త్రీ సమాజాన్ని నిలువునా చీల్చే వింత ప్రయత్నం మరొకటి మొదలైంది. మీడియాలో ఈ విభజన స్పష్టంగా కనిపిస్తుంది. ఏ దేశ సంస్కృతి అయినా, ఏ జాతి ఆచార వ్యవహారాలైనా స్త్రీల వలన నిలబడతాయి. లౌకిక బాధ్యతలు, సంస్కృతీ బాధ్యతలు స్త్రీ నిర్వహిస్తుంది. కాగా సుస్థిరంగా పాతుకుపోయిన సంప్రదాయాలు, కట్టుబాట్లు స్త్రీని పరిపాలిస్తున్నాయి. ఈ నేపథ్యంలో సంప్రదాయానికి తలొగ్గే బానిసలుగా స్త్రీలను చూడకుండా స్త్రీ చైతన్యానికి ఇలాంటి సామూహిక పండగలను వేదికలుగా మలచాలి. అంతేగాని ఎవరికి వారు గుంపు కట్టుకో చూడడం విషాదకరం. జనాభాలో సగమైన మహిళలు ప్రగతిపథంలో పయనిస్తే తప్ప జాతి జీవనంలో రావాల్సిన మార్పురాదు. పల్లెపడుచుల మనుగడలో ఆచార వ్యవహారాల్లో ఆరోగ్యకరమైన మార్పులు రావాలి. అవి వారి సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి దోహదపడే కంచుకోటలు కావాలి. అందుకోసం మన పండగలు పబ్బాలు మన విశ్వాసాలకు, ఆచార వ్యవహారాలకు, మన భావనకు, అస్థికతకు, ప్రకృతి ప్రభావాలకు సకల సంస్కృతికి ప్రతీకలుగా వెలుగొందాలి.

మనోవికాసానికి, పారమార్థిక చింతనకు దోహదపడే పండగలు జాతి సంప్రదాయపు తంతువు తెగకుండా తరాలనుండి తరాలకు వారసత్వ వారధిగా ఉండాలి. మన జీవన స్రవంతిలో అంతర్వాహిని వలె ప్రవహిస్తూ సాంస్కృతిక వికాసానికి నిలువుటద్దాలై నిలబడాలి. ఈ నేపథ్యంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి పురుడుపోసుకోవాల్సిన నేటి తెలంగాణలో తరతరాల సాంస్కృతిక చిహ్నామైన బతుకమ్మ అంటే తర్వాతి తరాలకు ఒక సంస్థ సృష్టించిన భావన కాకూడదు. బతుకమ్మ ఉన్నవారి కన్నబిడ్డా గాదు, బడుగుల బంధువూ గాదు. అందరి ఆడపడుచు బతుకమ్మ. ధనవంతులకు బంగారు బతుకమ్మ, బడుగులకు బహుజన బతుకమ్మ అంటూ, ఎంగిలిపూవు మీది, చద్దులు మావి అన్న చందాన సాగిపోబోయే తోవపట్ల అప్రమత్తం కావాలి. లేకుంటే అధికారం కొమ్ము కాయడానికే అవతరించిన మీడియా సామాజిక ఏకీకరణ చిహ్నాన్ని ఛిద్రం చేసేందుకు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది.

నిజానికి సామాజికీరణ అంటే వ్యక్తుల నడుమ, పాలక పాలితుల నడుమ, అధికార, అనధికారుల నడుమ, ప్రభుత్వం ప్రజల నడుమ అంతరాలు లేకుండా సమాజం అంతా ఒక్కటే అనే భావనే ఒక పండుగైతే నిజంగా బహుజన బతుకమ్మ అయినా, బంగారు బతుకమ్మ ఐనా తెలంగాణ సమాజానికి అంతకన్నా కావాల్సింది ఏముంటుంది?

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# బుద్ధవాదులూ యుద్ధవాదులూ

*యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి భారత, పాకిస్తాన్ పాలకులు ఇద్దరూ చేస్తున్న ప్రయత్నాలనూ, ప్రత్యేకించి భారత పాలకుల ప్రయత్నాలనూ ఖండిస్తున్నారు* **కె.పి. శశి**

"*మనం యుద్ధం నుంచి బుద్ధుడి దగ్గరికి, శాంతి దగ్గరికి వెళతాం.* కొన్నిసార్లు యుద్ధం అవసరమవుతుంది. కాని మన మార్గం మాత్రం బుద్ధుడు చెప్పినదే" – లక్నోలో రామలీల సందర్భంగా నరేంద్ర మోడీ.

తత్వవేత్త అవతారమెత్తిన నరేంద్ర మోడీ సత్యం పలికారు. నిజంగానే మన ప్రాంతంలో ఇవాళ యుద్ధవాదానికీ బుద్ధవాదానికీ మధ్య ఘర్షణ ఉంది. గతంలో, భారతదేశాన్ని భారతీయ జనతా పార్టీ ప్రధానమంత్రి అటల్ బిహారీ వాజపేయి పాలిస్తున్నప్పుడు, జాతీయ స్థాయిలో భాజపా ప్రతిష్ఠ దిగజారుతున్నప్పుడు, విశ్వసనీయత సాధించడానికి ఇదే విధంగా ద్వేష రాజకీయాల సహాయం తీసుకునే ఎత్తుగడ వేశారు. పోఖ్రాన్‌లో అణుపరీక్షల పేలుళ్లు జరిపారు. అత్యంత హింసాత్మకమైన ఆ సాంకేతిక పరిజ్ఞాన పరీక్షకు 'బుద్ధుడి చిరునవ్వు' అని పేరు పెట్టారు. అంతర్జాతీయ సంబంధాల పరిధిలో చూసినప్పుడు మొత్తం దక్షిణాసియాలో శాంతిదే పైచేయిగా ఉన్న సమయమది. ఆ శాంతిని యుద్ధవాదులు అలా ధ్వంసం చేశారు. ప్రతిగా పాకిస్తాన్‌లోని యుద్ధవాదులు మరొక అణుపరీక్షతో స్పందించారు. దానికి భారత యుద్ధవాదులు మరొక అణుపరీక్షతో ప్రతిస్పందించారు. అలా ప్రతిస్పందనల వరుస సాగింది. చివరికి అది కార్గిల్ యుద్ధంగా పరిణమించింది. ఈ దేశంలోని ముస్లింలందరికీ పాకిస్తానీ ఏజెంట్లుగా ముద్ర వేశారు. భారతదేశంలోనూ పాకిస్తాన్‌లోనూ రాజకీయ నాయకత్వపు విరిగిపోయిన కుర్చీలు ఈ విద్వేష రాజకీయాల ప్రచారంతో మరమ్మత్తయ్యాయి. ఇరువైపులా ప్రధానస్రవంతి ప్రచార మాధ్యమాలు సంతోషంగా సంచలనాత్మక కల్పనలనే వార్తలుగా ముందుకు తోశాయి. చిట్టచివరికి, నష్టపోయినవారెవరు?

బుద్ధుడి చిరునవ్వు పేలుళ్ల సమయంలో మరొక ఆసక్తికరమైన అంశం ఉంది. అప్పటికి భారత ప్రభుత్వంలో రక్షణశాఖ మంత్రిగా ఉండిన జార్జి ఫెర్నాండెజ్‌కు కూడ భారతదేశం అణుపరీక్ష జరుపుతున్నదనే విషయం తెలియదు. మర్నాడు ఉదయం పత్రికా విలేఖరులు ఆయనను ప్రశ్నించడం ప్రారంభించాక గాని ఆయనకు ఆ విషయం తెలియలేదు. విలేఖరులు ఆయనను నిద్రలేపి, 'శత్రువెవరు' అని అడిగారు. నిద్రమత్తులో గందరగోళంతో ఆయన 'ఇంకెవరు, చైనానే' అని గట్టిగా జవాబిచ్చాడు. తనను తాను సరిచేసుకుని శత్రువు పాకిస్తాన్ అని చెప్పడానికి ఆయనకు మూడు రోజులు పట్టింది. తాను భాజపా నాయకత్వంలోని ప్రభుత్వంలో రక్షణ శాఖ మంత్రిగా ఉన్నాననే విషయం బహుశా ఆయన మరిచిపోయి నట్టున్నాడు. సరే, ప్రధానమంత్రిగా తన స్థానాన్ని పదిలపరచుకోవడానికి అటల్ బిహారీ వాజపేయి చేయగలిగిన ఒకేఒక్క పని యుద్ధం ద్వారా ద్వేష రాజకీయాలను వ్యాపింపజేయడమేననే సంగతి చరిత్రలో మిగిలిపోయింది. అటువంటి విద్వేష రాజకీయాల వల్ల ఇటు భారతదేశంలోనూ, అటు పాకిస్తాన్ లోనూ రాజకీయ నాయకత్వాలు లబ్ధి పొందాయి.

ప్రధానమంత్రి నరేంద్ర మోడీ సాధికారత దిగజారుతున్న సమయంలో చరిత్ర పునరావృతమవుతున్నది. "కొన్నిసార్లు యుద్ధం అవసరమవుతుంది" అని ఆయనన్న మాట అక్షరాలా నిజం. కాని ఎవరికి అవసరమవుతుంది అనేదే అసలు ప్రశ్న. తమ దగ్గర అణ్వాయుధాలున్న రెండు దేశాలు యుద్ధంలోకి దిగినప్పుడు అంతిమ విజేతలు ఎవరూ ఉండరు. రెండు వైపులా నష్టపోయినవారు మాత్రమే ఉంటారు.

మరి దీన్నెట్లా సమర్థించుకుంటున్నారు? దీన్ని తీవ్రవాదానికి వ్యతిరేకంగా సాగుతున్న యుద్ధం అని సమర్థించుకోజూస్తారు. ఇది సరిగ్గా స్త్రీలనూ, పిల్లలనూ, అమాయకులనూ చంపడానికి ఆఫ్ఘనిస్తాన్‌లో, ఇరాక్‌లో జార్జిబుష్ చేసిన ప్రయత్నం లాంటిదే. సర్జికల్ దాడులు చేయించినవాళ్లను ఒక సూటి ప్రశ్న అడగవలసి ఉంది. మీరు తీవ్రవాదులను చంపారా లేక సాధారణ సైనికులను చంపారా అని. సాధారణ సైనికులంటే తమ కుటుంబ అవసరాలు తీర్చడానికి భద్రమైన ఉద్యోగం వెతుకుతూ తమ ఇళ్ల నుంచి సరిహద్దుల్లోకి వచ్చినవారు తప్ప మరొకరు కారు. మరి సర్జికల్ దాడులలో ఇందరు చనిపోయారు, అందరు చనిపోయారు అని చెప్పుకునే గొప్పల మాటేమిటి? భారత ప్రచార మాధ్యమాలు ఆ హతుల సంఖ్య రెండు డజన్లు ఉండవచ్చునని అంటున్నాయి. ఆ సంఖ్య రెండు మాత్రమేనని పాకిస్తాన్ అంటున్నది. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అధికార వార్తాపత్రిక 'దేశాభిమాని' తన దేశభక్తిని నిరూపించుకోవడంలో భాజపా కన్న, కాంగ్రెస్ కన్న ఒక అడుగు ముందుకు వేసి, ఆ సంఖ్యను 36గా ప్రకటించింది. చరిత్రలో ఇంతకుముందు కూడ, పోఖ్రాన్‌లో అణు పరీక్ష జరిగినప్పుడు, సిపిఐ (ఎం) అణు బాంబు పొరుగుదేశానికి బెదురుగా పనిచేస్తుందని తక్షణ సానుకూల స్పందన ప్రకటించింది. అణ్వాయుధ వ్యతిరేక ఉద్యమకారులు ఆందోళన ప్రారంభించాక తెలివి తెచ్చుకుని అణుబాంబుకు వ్యతిరేక ఉద్యమానికి మద్దతు ఇచ్చింది.

ఇక రాహుల్ గాంధీ అనే కుర్రాడున్నాడు. ఆయన నరేంద్ర మోడీ ఇటు మెసిలినా అటు మెసిలినా ప్రశ్నించడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని యుద్ధం విషయం వచ్చేసరికి, నరేంద్ర మోడీ తన జీవితంలోకెల్లా చేసిన తెలివైన పని పాకిస్తాన్‌తో యుద్ధానికి సన్నాహం చేయడమేనని ప్రకటించాడు. ఇక ఈ కుర్రాడు దేశ ప్రధానమంత్రి అయితే దేశం భవిష్యత్తు ఏమవుతుందో?

భారతదేశంలోనూ పాకిస్తాన్‌లోనూ ఉన్నప్రజలు తమ చరిత్ర నుంచి నేర్చుకోవలసింది ఏమైనా ఉన్నదంటే అది రెండువైపులా శాంతియుతంగా జీవించవలసిన అవసరం ఉన్నదని మాత్రమే. దేశ విభజన నాటి నుంచీ ఈ విద్వేష రాజకీయాల క్రీడలో మనం ఎన్నో ప్రాణాలు పోగొట్టుకున్నాం. శాంతియుతంగా జీవించే మన హక్కును ఇప్పటికిప్పుడే స్థిరపరచు కోకపోతే, రెండు దేశాలలోనూ మనుషుల మనుగడే ప్రమాదంలో పడే స్థితి త్వరలోనే రాబోతున్నది.

ఇటీవల కౌంటర్ కరెంట్స్ డాట్ ఆర్గ్ సంపాదకుడూ నేనూ కొచ్చిన్‌లో ఆటోరిక్షాలో వెళ్తున్నప్పుడు, డ్రైవర్ యుద్ధం గురించి మాట్లాడడం మొదలెట్టాడు. సర్జికల్ దాడులు జరిగినందుకు ఆయన చాల సంతోషంగా ఉన్నాడు. "యుద్ధమంటూ వస్తే పాకిస్తాన్ కూడ దాడులు చేస్తుంది గదా. భారత్ పాకిస్తాన్ రెండూ అటూ ఇటూ దాడులు చేసుకుంటూ పోతే బహుశా నీ ఆటోరిక్షా మీదనే బాంబు పడవచ్చు"అని మేం హెచ్చరించాం. ఆయన మాత్రం పాకిస్తాన్ దగ్గర అంత పని చేసే సాంకేతిక పరిజ్ఞానం లేదని నమ్మకంగా చెప్పాడు. మేం ఇద్దరం ఒకరివైపు ఒకరం చూసి నవ్వుకున్నాం. యుద్ధమంటే ఏదో సరిహద్దుల్లో జరిగిపోయేదనీ భారతదేశంలో సరిహద్దులకు సుదూరంగా ఉన్న కొచ్చిన్ దాకా అది రాదనీ ఆ డ్రైవర్ అనుకుంటున్నాడు. అది నిజం కాదని, ఆయన నెత్తి మీద కూడ బాంబు పడడానికి అవకాశం ఉన్నదనీ మేం చెప్పినప్పుడు ఆయన మాట్లాడకుండా ఉండిపోయాడు.

ఇక సరిహద్దుల విషయానికే వస్తే, అక్టోబర్ 3న ట్రిబ్యూన్ ఇండియా పత్రికలో రాసిన ఒక వ్యాసంలో ప్రీతమ్ సింగ్ సరిహద్దు ప్రాంతాల గ్రామాల ప్రజలను ఖాళీ చేయించడం గురించి ఒక హెచ్చరిక చేశారు. సరిహద్దుకు సుదూరంగా ఉన్న ప్రాంతాలు యుద్ధ కాంక్షను ప్రకటించే ఆటలాడగలవు గాని, యుద్ధమే వస్తే ఇరు దేశాలలోని సరిహద్దు ప్రాంతాలూ సర్వనాశనమవుతాయని ఆయన అన్నాడు. సరిహద్దులకు రెండు వైపులా రైతులను నిర్వాసితులను చేయడం గురించిన ప్రశ్న అసలైనది. ఆ వ్యాసం చదువుతుంటే నాకు 'జై జవాన్ జై కిసాన్' నినాదం ఎంత బూటకమో తెలిసివచ్చింది. సరిహద్దుకు రెండు వైపులా ఉన్న జవాన్లను చంపేస్తారు, రెండు వైపులా ఉన్న కిసాన్లను వాళ్ల పొలాల్లోకి వెళ్లనివ్వకుండా నిర్వాసితులను చేస్తారు. ఈ మొత్తం వ్యవహారంలో జవాన్ల, కిసాన్ల ప్రయోజనాలేమీ లేవు. లాహోర్, ఢిల్లీ చదరంగం ఆడుకుంటుంటే, సరిహద్దు మీద ఉన్న భటులు మాత్రం తమ ప్రాణాలు త్యాగం చేయవలసి ఉంటుంది.

ప్రీతం సింగ్ బ్రిటన్‌లోని సుప్రసిద్ధుడైన భారతీయ విద్యావేత్త. కాని ఆయనలాగే ఆలోచించేవాళ్లు పాకిస్తాన్‌లో కూడ ఉన్నారు: 'గౌరవనీయమైన డాన్ వార్తాపత్రికలో సుప్రసిద్ధ పాకిస్తాన్ జర్నలిస్టు రాసిన ఒక వార్తావ్యాసం అచ్చయ్యాక ఆయన పేరును పాకిస్తాన్ ప్రభుత్వ ఎగ్జిట్ కంట్రోల్ (రాకపోకలపై ఆంక్షల) జాబితాలో చేర్చారు. ఆ వార్తావ్యాసంలో ఆయన దేశంలోని పౌర పాలకులకూ సైనిక పాలకులకూ మధ్య విభేదాలు ఉన్నాయని చాలకాలంగా ఉన్న వదంతులకు నిర్ధారణలు చూపారు. పాకిస్తాన్ ప్రభుత్వం జారీ చేసిన ఒక ఆర్డినెన్స్ ప్రకారం ఈ తయారయ్యే ఆంక్షల జాబితాలో పేర్కొన్న వ్యక్తులు దేశం విడిచివెళ్లడానికి వీలు లేదు. డాన్ పత్రిక అసిస్టెంట్ ఎడిటర్ సిరిల్ అల్మీదా తన పేరు ఈ జాబితాలో చేరిందని సోమవారం నాడు ట్విట్టర్ ద్వారా ప్రకటించారు. దాని మీద పాకిస్తానీ ప్రభుత్వాధికారులు ఇంకా స్పందించలేదు' అని అల్ జజీరా ప్రకటించింది.

ఈ మొత్తం వ్యవహారంలోని సత్యం ఏమంటే పాకిస్తాన్ అధికార వర్గాలూ, భారత అధికారవర్గాలూ కూడ ఒకే విషయానికి భయపడు తున్నాయి. ఇవాళో రేపో ఏదో ఒకరోజు సత్యం బైటపడి ప్రజల దృష్టికి వస్తుందని అవి భయపడుతున్నాయి. వాళ్ల ఆటలు బైటపడతాయని అవి భయపడుతున్నాయి! అందువల్ల తమ ఆటల గురించి ఎక్కడా విమర్శనాత్మక వ్యాఖ్యలు రాగూడదని అవి జాగ్రత్తలు తీసుకుంటున్నాయి. ఉపఖండంలోని ప్రజల జీవితాలతో తాము ఆడుకుంటున్నామనే వాస్తవం బైటపడగూడదని జాగ్రత్తలు తీసుకుంటున్నాయి.

నరేంద్ర మోడీ పడుతున్న గందరగోళం వాస్తవికమైనదే. తాను యుద్ధవాదా బుద్ధవాదా హిందువా ఆయనకు తెలియడం లేదు. బుద్ధవాదం ఈ నేలమీదనే పుట్టి ఉండవచ్చు గాని యుద్ధవాద సూత్రాలు ఉపయోగించి ఆ బుద్ధవాదాన్ని ఈ దేశంనుంచి వెళ్లగొట్టినది బ్రాహ్మణవాద అధికారవర్గాలే. బుద్ధవాదం కుల వివక్షను వ్యతిరేకించే ప్రబోధాలు చేసిందనేదే బ్రాహ్మణవాద ఆగ్రహం. భారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ అంబేద్కర్ తనకు తాను బౌద్ధంలోకి పరివర్తన చెందినప్పుడు, ఆయన అలా మతాంతరీకరణ చెందడానికి భారత పాలకవర్గాల ఆమోదపత్రం ఏమీ అవసరం లేకపోయింది. కాని కాలం గడుస్తున్నకొద్దీ హిందూత్వ శక్తులు ఈ దేశంలో ఎటువంటి చట్టాలు ప్రవేశపెట్టాయంటే ఎన్నో రాష్ట్రాలలో మతాంతరీకరణ అసాధ్యమై పోయింది. ఇవాళ అంబేద్కర్ సజీవంగా ఉండి ఒడిశాలోనో, చత్తీస్‌గడ్ లోనో బౌద్ధంలోకి పరివర్తన చెందదలచుకుంటే భారత రాజ్యపు అనుమతి సంపాదించవలసి ఉండేది. మతం అనేది వ్యక్తిగత విశ్వాసానికి సంబంధించిన విషయమే అయితే, ఆ విశ్వాసాన్ని ఇష్టపూర్వకంగా మార్చుకునే స్వేచ్ఛ ఉండాలి. అటువంటి మత స్వేచ్ఛను భారత రాజ్యాంగం ఆమోదిస్తుంది. కాని ప్రస్తుత భారతదేశంలో ఎన్నో రాష్ట్రాలలో ఆ రాజ్యాంగం హామీ ఇచ్చిన మత స్వేచ్ఛ ఉల్లంఘనకు గురవుతున్నది. ప్రజల మత స్వేచ్ఛను ఉల్లంఘిస్తూ ఎన్నో రాష్ట్రాలు చట్టాలు తయారుచేశాయి.

ప్రాచీన భారతదేశంలో యుద్ధవాదుల దుర్మార్గాలకు బుద్ధవాదులు బలి అయిపోయారు. కాని బుద్ధవాదులు శక్తిమంతులుగా మారిన మరికొన్ని ఆసియా దేశాలను చూస్తే, బుద్ధవాదులు కూడ యుద్ధవాదు లుగా మారిపోయిన దృశ్యం కనబడుతుంది. శ్రీలంకలో బుద్ధవాదులు ఆ దేశంలో తమిళులకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధాన్ని సమర్థించడానికి అత్యంత చురుకైన యుద్ధోన్మాదులుగా ప్రవర్తించారు. కొలంబో జైలు ముందు ఉన్న పెద్ద బుద్ధ విగ్రహం వేలాది మంది తమిళ స్త్రీల, పిల్లల కన్నీటికి సాక్ష్యంగా నిలిచి ఉంది. ఆ తమిళుల కుటుంబాలు హత్యకూ, అత్యాచారాలకూ, దోపిడీకి, మారణకాండలకూ గురయ్యాయి. వారిలో ఎందరో జైలు పాలయ్యారు. శ్రీలంకలోని బుద్ధవాదుల అదృష్టమేమంటే వాళ్ల బుద్ధ విగ్రహాలు మాట్లాడవు!

ఇవాళ భారతదేశంలోని యుద్ధోన్మాదుల తక్షణ పర్యవసానం బాలీవుడ్ నటుల మీద ప్రభావంలో కనబడుతున్నది. చాలరోజులుగా బాలీవుడ్ బడిపిల్లల జ్ఞానస్థాయికన్న దిగువన ఉన్న కథలను అమ్ముకుంటూ కాలం

గడిపి ఉండవచ్చు. కాని ఈ పరిశ్రమ ముస్లింలు, హిందువులు, క్రైస్తవులు, నాస్తికులు, ఇతర విశ్వాసాలు గలవాళ్లు అందరూ కలిసి ఉన్న విచిత్ర సమ్మేళనంగా ఉండింది. పేరూ డబ్బూ పొందడానికి అనేక వైవిధ్యాలు క్రియాశీలంగా సహకరించుకోవడం ద్వారానే ఈ కలల పరిశ్రమ మనుగడ సాగిస్తూ వచ్చింది. ఇప్పుడిక, వేరే దేశానికీ జాతికీ చెందిన కళాకారులను లక్ష్యంగా చేసుకుని దాడులు చేయడం మాత్రమే కాదు, పాకిస్తానీ నటులతో విజయవంతమైన సినిమాలు తీసిన దర్శకుల మీద కూడ దాడులు చేస్తున్నారు. భారతీయులైనా, పాకిస్తానీలైనా నటులు నటులే. కళకారులు కళాకారులే. ఒక హిందువు ముస్లింలాగ నటించగలిగితే, ఒక ముస్లిం క్రైస్తవుడిలాగ నటించగలిగితే, ఒక క్రైస్తవుడు నాస్తికుడిలా నటించగలిగితే, ఒక నాస్తికుడు పూజారిలా నటించగలిగితే, ఒక పాకిస్తానీ హిందువులా నటించడం సాధ్యమే. ఆయన భారతదేశానికి రావడానికి తగిన పాస్ పోర్ట్, వీసా లాంటి అధికార అనుమతి పత్రాలు ఉంటే చాలు. ఒక పాకిస్తానీ ఒక భారతీయుడిలా నటించగూడదని భారత రాజ్యాంగంలో ఎక్కడా లేదు. తాము ప్రాతినిధ్యం వహిస్తున్న కథలోని పాత్రలతోనే వారికి సంబంధం. సినిమాలకు వెళ్లే సగటు మనుషులందరూ వారిని తమ ఊహల్లోని పాత్రలతోనే గుర్తించి ఆమోదిస్తారు గాని వారి మూలాలు ఏమిటి, వారి అస్తిత్వాలు ఏమిటి అని ఆలోచించరు. సినిమా పరిశ్రమ ద్వారా ఈ విధంగా తమ మతోన్మాద రాజకీయాలను విస్తరించాలని హిందుత్వ శక్తులు చేస్తున్న ప్రయత్నం విజయం సాధిస్తే, అదే పద్ధతిలో పాకిస్తాన్ కూడ ప్రయత్నించి చాల సులభంగా తమ దేశంలోకి హిందీ సినిమాలు రాకుండా కట్టడి చేయగలదు. భారతదేశంలో పెద్దగా పాకిస్తానీ సినిమాలు చూడం గాని, బాలీవుడ్ సినిమాలు మాత్రం పాకిస్తాన్‌లో పెద్దఎత్తున ఆడతాయి. పాకిస్తాన్ గనుక భారత సినిమాలను అడ్డుకోవాలనుకుంటే నష్టపోయేది భారతీయులు, బాలీవుడ్ సినిమా పరిశ్రమ, భారత ప్రభుత్వం ఆర్జించే విదేశ మారక ద్రవ్యం మాత్రమే. ఈ అర్థరహిత ప్రహసనాన్ని నడుపుతున్న వారికి ఎవరైనా ఈ తెలివి కల్పించగలరా? ఈ యుద్ధం వల్ల ఆసియాలో సినిమా పరిశ్రమ బలి అయిపోతున్నప్పుడు, సరిహద్దుకు ఇరువైపులా ఉన్న నటులు, కళాకారులు, రచయితలు, కవులు, సినిమా, సాంస్కృతిక రంగాల ప్రముఖులు, బైటికి వచ్చి ఈ అబద్ధాన్ని బద్దలు కొట్టవలసి ఉంది.

ఔను, ఒక కోణంలో నరేంద్ర మోడీ నిజమే చెపుతున్నాడు. నిజంగానే ఘర్షణ బుద్ధవాదులకూ యుద్ధవాదులకూ మధ్యనే. కాని బుద్ధవాదం, యుద్ధవాదం, హిందూమతం, హిందుత్వ అనేవి ఏమిటో తెలుసుకోవడంలో మన ప్రధానమంత్రి గందరగోళ పడుతున్నట్టున్నాడు. ఇప్పటికే యుద్ధపు తుపాకిమందు వాసన వ్యాపిస్తున్నది. దక్షిణాసియాలో ఇప్పుడు వీస్తున్న శాంతి కాముక పౌరుల పరిమళాన్ని ఈ తుపాకి మందు వాసన ఏం చేయబోతున్నదో చూడవలసి ఉంది. కాని భారతదేశంలోనూ పాకిస్తాన్‌లోనూ అధికారంలో ఉన్న యుద్ధవాదుల కింద మనందరమూ కష్టకాలాన్ని ఎదుర్కోబోతున్నామని అర్థం చేసుకోవడానికి పెద్ద జ్యోతిష్యమేమీ అవసరం లేదు. భారత ప్రభుత్వం పాకిస్తాన్ మీద దాడి చేయడమంటే, అది తన ప్రాచీన చారిత్రక మూలాలమీద దాడిచేయడమేనని హిందుత్వ శక్తులు అర్థం చేసుకోవలసి ఉంది. ఎందుకంటే, మన ప్రాచీన చారిత్రక మూలాలైన మొహెంజోదారో, హరప్పా ఇంకా పాకిస్తాన్‌లోనే ఉన్నాయి గాని, భారతదేశంలో లేవు. అందువల్ల శాంతి అవసరాన్ని ఎత్తిపట్టవలసిన అవసరం హిందుత్వ శక్తులవైపు నుంచి, ఇప్పుడిప్పుడే తలెత్తుతున్న జాతీయవాదుల వైపు నుంచి ఉంది.

భారతదేశం, పాకిస్తాన్ రెండు దేశాలలోనూ న్యాయం, శాంతి, సామరస్యం వంటి విలువలను నమ్మేవాళ్లు బైటికి వచ్చి ఈ పెరిగిపోతున్న యుద్ధోన్మాదానికి ముగింపు పలకవలసిన సమయం ఆసన్నమైంది. ఇరువైపులా ఉన్న పౌరసమాజం, మానవహక్కుల కార్యకర్తలు, సినిమారంగ ప్రముఖులు, రచయితలు, కవులు, సాంస్కృతిక కార్యకర్తలు తమ గళం ఎత్తవలసి ఉంది. ఆ పని చేయకపోతే, యుద్ధోన్మాదులు మన జీవితాలతో ఆడుకోవడానికి సిద్ధంగా ఉన్నారనే గుర్తింపుతో ఆ పని చేయవలసి ఉంది. భారత, పాకిస్తాన్‌లలోని యుద్ధవాదులకు వ్యతిరేకంగా అందరూ ఏకం కావలసిన సమయం ఆసన్నమైంది. రెండు దేశాలలోని సంచలనాత్మక ప్రధానస్రవంతి ప్రచార మాధ్యమాలు, అవినీతిపరులైన సైనికాధికారులు, తమ అధికార పీఠాలు కదిలిపోతున్న, పరపతి తగ్గిపోతున్న రాజకీయ నాయకులు మన స్వేచ్ఛనూ శాంతినీ సామరస్యాన్నీ తమ ఇష్టం వచ్చినట్టుగా అమ్మడానికీ కొనడానికీ వీల్లేదని బలమైన సామాజిక సందేశాన్ని ప్రకటించవలసి ఉంది. ఇరువైపులా యుద్ధవాదులను ఒంటరి చేయవలసిన సమయం ఇదే. సరిహద్దులకు రెండు వైపులా ఉన్న ప్రజలు కాకపోతే శాంతిని ఎవరు కాపాడుతారు?

*www.countercurrents.org* నుంచి

*(రచయిత సామాజిక కార్యకర్త, డాక్యుమెంటరీ, సినిమా నిర్మాత. 'గావ్ చోడబ్ నహీ' పాట చిత్రీకరణ ద్వారా సుప్రసిద్ధుడు)* వీ

## రాబోయే సంచికలలో...

- **తాగునీరు మానవ హక్కు - డా. వి. విజయకుమార్**
- **బహుజనులను విడదీస్తున్న హిందూవాదం - డా. కత్తి పద్మారావు**
- **కమ్యూనిజం అంటే ఏమిటి? - సురేష్**
- **మంది మనిషి కాళోజీ - డా. బోనకుర్తి సోమేశ్వర్**
- **ఆర్థిక సంస్కరణలు - వ్యవసాయ సంక్షోభం - మచ్చ శ్రద్ధానందం**

# కావేరి జలాల వివాదం

*రాజకీయ పార్టీలు కావేరి జలాల వివాదంతో ఇరు రాష్ట్రాల ప్రజలలో విభేదాలు సృష్టిస్తున్నాయనీ, దీన్ని హేతుబద్ధంగా ప్రజాస్వామికవాదులతో, నీటి నిపుణులతో చర్చించి పరిష్కరించాలనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

**కా**వేరి జలాల వివాదం వల్ల రెండు రాష్ట్రాల్లో ఉద్రిక్త పరిస్థితులు నెలకొన్నాయి. కర్ణాటకలో తమిళనాడు బస్సులను ధ్వంసం చేయడంతో పాటు, హింసాత్మక చర్యలకు కర్ణాటక ప్రజలు పాల్పడ్డారు. వీరిని అదుపు చేయాల్సిన పోలీసులు అత్యుత్సాహంతో కాల్పులు జరపడంతో ఒకరు చనిపోయారు. హింసతో సమస్యలను పరిష్కరించలేమని తెలిసినప్పటికీ, ప్రజలు హింసాయుత కార్యకలాపాలకు పాల్పడ్డారు. దీని వెనుక రాజకీయ నాయకుల రెచ్చగొట్టే చర్యలు, అవగాహనలేని ప్రసంగాలే ప్రధాన కారణంగా ఉన్నాయి. సాధారణ పరిస్థితులను నెలకొల్పడానికి ఇరు రాష్ట్ర ప్రభుత్వాలు ఎటువంటి చర్యలు చేపట్టలేదు.

తమిళనాడు ప్రభుత్వం 2007 కావేరి జలవివాద ట్రిబ్యునల్ తుది తీర్పును అమలు చేయాలని సుప్రీం కోర్టును ఆశ్రయించింది. సుప్రీం కోర్టు సెప్టెంబర్ 5న తీర్పునిస్తూ, సెకనుకు 15వేల క్యూబిక్ అడుగుల చొప్పున పది రోజులపాటు తమిళనాడుకు నీటిని విడుదల చేయాలని చెప్పింది. తాజా వివాదానికి ఇదే కారణమైంది. దీన్ని కర్ణాటక రైతులు స్వాగతించలేదు.

2012లోను ఇదే తరహా వివాదం చెలరేగింది. కావేరి నదీజలాల అథారిటీ ఆదేశాలను కర్ణాటక బేఖాతరు చేయడంతో, అప్పుడు సుప్రీంకోర్టు జోక్యం చేసుకుంది. చివరికి సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు బిజెపి ప్రభుత్వం 9 వేల క్యూసెక్కుల నీటిని పదిరోజుల పాటు విడుదల చేసింది. కర్ణాటక రైతుల నిరసనల మధ్యే నీటి విడుదల జరిగింది. వర్షాభావ పరిస్థితులు కర్ణాటకలో నెలకొన్న రీత్యా కావేరి నదీ జలాల అథారిటీ ఆదేశాలను పాటించలేమని అప్పుడు బిజెపి చెపితే, ఇప్పుడు కాంగ్రెస్ ప్రభుత్వం అదే మాట చెపుతోంది. న్యాయస్థాన తీర్పులను పౌరులు గౌరవించాలని పదేపదే ప్రకటించే రాష్ట్ర ప్రభుత్వాలు, వారే న్యాయస్థానానికి వ్యతిరేకంగా నడుచుకుంటున్నారు.

కర్ణాటక ప్రభుత్వం కావేరి జలాలు వదిలితే దక్షిణ కర్ణాటక తాగునీటి ఎద్దడిని ఎదుర్కొంటుందని వాదిస్తోంది. కావేరి నీటి విడుదల జరగకపోతే నీరందక పంటలు ఎండిపోతాయని తమిళనాడు మాట్లాడుతోంది. ఉభయ తారకంగా రెండు రాష్ట్రాలు కృషి చేయకపోవడం వెనుక రాజకీయ కారణాలున్నాయి. జయలలిత అనారోగ్యం కారణంవల్ల తాత్కాలికంగా సమస్య తగ్గుముఖం పట్టినప్పటికీ, తీవ్రత తగ్గలేదు.

81,155 స్క్వేర్ కిమీ (ఎస్‌కెఎం)లో కావేరి బేసిన్ విస్తరించి ఉంది. తమిళనాడులో 43,856 ఎస్‌కెఎంలు, కర్ణాటకలో 34,273 ఎస్‌కెఎంలు, కేరళలో 2,866 ఎస్‌కెఎంలు, పుదుచ్చేరిలో 160 ఎస్‌కెఎంలలో కావేరి బేసిన్ ఉంది.

కర్ణాటకలోని తలకావేరి, కొడుగుల దగ్గర కావేరి నది మొదలవుతుంది. దీనికి సింహ, హేమావతి, అర్కవతి, హెున్నుహెూలు, లక్ష్మన్న తీర్థ, కాబిని, భవాని, లోకపావని, నోయ్యల్, అమరావతి అనే ఉపనదులు ఉన్నాయి. కావేరిలోకి కర్ణాటక నుండి 425 టిఎంసిఎఫ్‌టిలు, తమిళనాడు నుండి 252 టిఎంసిఎఫ్‌టిలు నీరు చేరుతుంది. సాధారణ నీటి సరఫరా లేని కాలంలో 192 టిఎంసిలు తమిళనాడుకు కావేరి జలాలు విడుదల చేసిన తర్వాత, మేకదత్తు ప్రాజెక్టు నెలకొల్పడానికి కర్ణాటక పావులు కదుపుతోంది. దీని ద్వారా బెంగుళూరులో ఉన్న కోటిమంది ప్రజలకు తాగునీరు అందించాలని కర్ణాటక భావిస్తోంది. దీన్ని తమిళనాడు వ్యతిరేకిస్తోంది. సాధారణ నీటి సరఫరా ఉన్న కాలంలో, అంటే 740 టిఎంసిల కన్నా తక్కువ ఉన్న కాలంలో నెలవారీగా తమిళనాడుకు నీటి విడుదల ఉండాలని ట్రిబ్యునల్ తీర్పు చెప్పింది. 1934 నుండి 1971 వరకు (44 సంవత్సరాల డేటా ప్రకారం) సగటు నీటి దిగుబడి 767 టిఎంసిలు ఉంటోందని ట్రిబ్యునల్ గుర్తించింది. నదీ పరివాహక ప్రాంతంలో ప్రత్యక్ష సగటు నిల్వ సామర్థ్యం 310 టిఎంసిలు ఉంది.

సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును ప్రస్తుతానికి ఇరు రాష్ట్రాలు గౌరవించాల్సిన అవసరముంది. కావేరి జల వివాద ట్రిబ్యునల్ నికర జలాల ప్రాతిపదికనే తీర్పు చెప్పింది. వర్షాభావ పరిస్థితులున్నప్పుడు మాత్రం కర్ణాటక పేచీ పెడుతోంది. ఈ అంశంపై ట్రిబ్యునల్ దృష్టి కేంద్రీకరించాల్సిన అవసరముంది. కర్ణాటక ప్రభుత్వం సుప్రీంకోర్టులో వాదిస్తూ, కెఆర్ఎస్ (కృష్ణరాజసాగర్) ప్రాజెక్టులో తగినంత నీరులేదని, రోజుకు 10 వేల క్యూసెక్కుల నీటినే విడుదల చేయగలమని పేర్కొంది. కాని సుప్రీంకోర్టు 15 వేల క్యూసెక్కులు వదలాలని చెప్పడంతో కర్ణాటక రైతులు ఆందోళనకు గురయ్యారు. తర్వాత రోజుకు 12 వేల క్యూసెక్కులకు తగ్గించిన సుప్రీంకోర్టు ధర్మాసనం మరో 5 రోజుల పాటు పెంచుతూ తీర్పుని సవరించింది. దీనివల్ల కర్ణాటక అదనంగా 18 వేల క్యూసెక్కుల నీటిని విడుదల చేయాల్సి వచ్చింది. దీంతో మరింత రెచ్చిపోయిన కర్ణాటక పౌరులు 30 లారీలకు నిప్పు పెట్టడమే గాక, 150 వాహనాలు ధ్వంసం చేశారు. ఇవన్నీ తమిళనాడు రిజిస్ట్రేషన్‌కు చెందిన వాహనాలే కావడంతో తమిళనాడులోను ఉద్రిక్త పరిస్థితులు నెలకొన్నాయి. కావేరి నదీ జలాల వివాదాల ట్రిబ్యునల్ (కావేరి వాటర్ డిస్ప్యూట్స్ ట్రిబ్యునల్–సిడబ్ల్యుడిటి), కావేరి నిర్వాహక బోర్డు (సిఎంబి)ను ఏర్పాటు చేయాలని గతంలోనే ప్రతిపాదించింది. నికర జలాలు, మిగులు జలాల ప్రాతిపదికన, ఉప బేసిన్లలో నీటి ప్రవాహం, వర్షాభావ పరిస్థితుల ఆధారంగా నీటి విడుదల సూచి ఉండాలని ఇరురాష్ట్రాలు భావిస్తున్నాయి.

వర్షపాతం ఆధారంగా, ఇన్‌ఫ్లోలను దృష్టిలో ఉంచుకుని రాష్ట్రాల మధ్య నీటి పంపకం జరగాల్సి ఉంది.

రాజ్యాంగంలోని ఆర్టికల్ 262, అంతరాష్ట్ర నదీ జలాల వివాదాల చట్టం–1962 ప్రకారం, అంతరాష్ట్ర నీటి వివాదాలలో సుప్రీంకోర్టు జోక్యం కూడదని చెప్తుంది. అయితే దీనికి విరుద్ధంగా కేంద్ర ప్రభుత్వం పావులు కదిపింది. ట్రిబ్యునల్ ఆదేశాలకు సుప్రీంకోర్టు స్థాయి సాధికారత ఉన్నప్పటికీ, కేంద్రం సుప్రీంకోర్టు తీర్పును గౌరవించాలని ఆదేశించింది. బిజెపి రాజకీయంగా కర్ణాటకలో బలపడడానికి, తమిళనాడులో నిలదొక్కుకోవడానికి కావేరి జలాల వివాదాన్ని పావుగా వాడుకుంటోంది. సిఎంబిని ఏర్పాటు చేయాలని అన్ని వర్గాలు కోరుకుంటున్నాయి. దీర్ఘకాలిక పరిష్కారం కోసం సిడబ్ల్యుడిటి చేసిన ప్రతిపాదనలో లోటు వర్షపాతం ఉన్న కాలంలో నీటి పంపిణీపై స్పష్టత లేదనేది వాస్తవమే. సిడబ్ల్యుడిటి అవార్డును కర్ణాటక బేఖాతరు చేయకపోవడాన్ని కేంద్రం సీరియస్‌గా తీసుకోలేదు. సరికదా సుప్రీంకోర్టు ఆదేశాలకు వ్యతిరేకంగా కేంద్రం నడుచుకుంది. దీనికి 1956 నాటి చట్టాన్ని ఉపయోగించుకుంది.

కావేరి నదీ జలాల వివాదం బ్రిటిష్ వలస కాలం నుండి ఉంది. 1892లోనే మైసూరు–మద్రాసు ప్రావిన్స్‌ల మధ్య తలెత్తింది. మైసూరు రాజుల అధీనంలో మైసూరు ప్రాంతం ఉండేది. బ్రిటిష్ నియంత్రణలో మద్రాసు ప్రావిన్స్ ఉండేది. నదులపై ప్రాజెక్టులను కట్టాలని మైసూరు రాజులు కోరినప్పటికీ, మద్రాసు ప్రావిన్స్ వ్యతిరేకించింది. అయితే మద్రాసు ప్రాంతానికి నష్టం జరగకుండా మైసూరు రాజులు నీటి పారుదల ప్రాజెక్టులను కట్టుకోవాలని ఇరు ప్రావిన్స్‌ల మధ్య ఒప్పందం జరిగింది. 1910లో కావేరి నదిపై 41.5 టిఎంసిల సామర్థ్యంతో కన్నాంబడి గ్రామం వద్ద ప్రాజెక్టును నిర్మించ తలపెట్టారు. దీనికి మైసూరు రాజు కృష్ణరాజ ఒడయార్, ఇంజనీర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య ప్రాజెక్టు బ్లూప్రింట్‌ను రూపొందించారు. మొదటి దశలో భాగంగా 11 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో మైసూరు ప్రాజెక్టును చేపట్టింది. రెండవ దశ నిర్మాణ పనులను మైసూరు ప్రారంభించడాన్ని మద్రాసు ప్రభుత్వం అడ్డుచెప్పడంతో పనులు ఆగిపోయాయి. అయితే పాత ప్రణాళిక ప్రకారమే ప్రాజెక్టు నిర్మాణాన్ని మైసూరు ప్రావిన్స్ చేపట్టడంతో మద్రాసు–మైసూరుల ప్రావెన్స్‌ల మధ్య గొడవ తలెత్తింది. 1892 ఒప్పందాన్ని దృష్టిలో ఉంచుకుని బ్రిటిష్ ప్రభుత్వం మధ్యవర్తిత్వం చేసుకోవాలని ఆదేశించింది. ఎచ్.డి.గ్రిఫిన్ మధ్యవర్తిగాను, ఎం.నీథర్‌సోల్ మదింపుదారుగాను బ్రిటిష్ ప్రభుత్వం వివాదాన్ని పరిష్కరించడానికి నియమించింది. 1914లో వారు మైసూరుకు అనుకూలంగా నివేదికను అందజేశారు. ఈ ఒప్పందం ప్రకారం 50 ఏళ్లపాటు ఇరు ప్రావిన్సులు నీటి పంపకాన్ని చేసుకోవాలని తీర్మానించారు.

1956లో భాషా ప్రాతిపదికన రాష్ట్రాల విభజన జరిగిన తర్వాత మైసూరు–మద్రాసు ప్రాంతం మూడు రాష్ట్రాలుగా, ఒక కేంద్రపాలిత ప్రాంతంగా విభజించబడింది. కావేరి పరివాహక ప్రాంత పరిధిలోకి కర్ణాటక, తమిళనాడు, కేరళతోపాటు పుదిచ్చేరి వచ్చి చేరింది. కావేరి ఉపనది కాబిని కేరళలో ఉండటం వల్ల, కావేరి జలాల్లో వాటాను కేరళ రాష్ట్రానికి ఇవ్వాలనే డిమాండ్ ఊపందుకుంది. అలాగే కావేరి నది పుదిచ్చేరి గుండా ప్రవహించి సముద్రంలో చేరుతుంది కాబట్టి ఆ ప్రాంతానికి కావేరి నదీ జలాలను ఇవ్వాల్సివచ్చింది.

కావేరి నదీ జలాలను ఇన్‌ఫ్లో ఆధారంగా పంపిణీ చేయడానికి 1997 తర్వాత కేంద్ర ప్రభుత్వం కావేరి రివర్ అథారిటీ, కావేరి మానిటరింగ్ కమిటీలను ఏర్పాటు చేసింది. 2002లో కర్ణాటకతో పాటు, తమిళనాడు రాష్ట్రం కరువు బారిన పడింది. ఇన్‌ఫ్లో తక్కువ వచ్చినప్పుడల్లా ఇరు రాష్ట్రాల మధ్య నీటి వివాదం జరుగుతోంది.

1892, 1924లలో జరిగిన ఒప్పందాలే ఇప్పుడు ఇరు రాష్ట్రాల మధ్య ఉద్రిక్తతలకు దారితీస్తోంది. నీటిచేరిక (ఇన్‌ఫ్లో) ఆధారంగా కర్ణాటక కావేరి నదీ జలాల్లో వాటా అడుగుతోంది. స్వాతంత్ర్యం రాకపూర్వం జరిగిన రెండు ఒప్పందాలు తమిళనాడు ప్రభుత్వానికి మద్దతుగా ఉన్నాయని కర్ణాటక ఆరోపిస్తోంది. తమ రాష్ట్రంలో కావేరి నదీ జలాల ఒప్పందం మేరకు నీటి సరఫరా జరుగుతుందని భావించి, రైతులు 30 లక్షల ఎకరాలను అదనంగా సాగులోకి తీసుకొచ్చారని, నీటి సరఫరా లేకపోతే లక్షల సంఖ్యలో రైతులు కరువు కాటకాలకు గురౌతారని తమిళనాడు వాదిస్తోంది. వివాదాల నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం 1990లో ఒక ట్రిబ్యూనల్‌ను ఏర్పర్చింది. 16 సంవత్సరాల పాటు ఇరు రాష్ట్రాల వాదనలు విన్న ట్రిబ్యూనల్ ఫిబ్రవరి 5, 2007న తీర్పును వెలువరించింది. 419 (58 శాతం) టిఎంసిల కావేరి నదీ జలాలను తమిళనాడుకు, 270 (37 శాతం) టిఎంసిలను కర్ణాటకకు ఏటా విడుదల జేయాలని తీర్పునిచ్చింది. అలాగే 30 (4 శాతం) టిఎంసిలను కేరళకు, 7 (1 శాతం) టిఎంసిలను పుదుచ్చేరికి ఇవ్వాలని కూడా తీర్పులో పేర్కొంది. సాధారణ వర్షపాతం నెలకొన్న సంవత్సరాలలో తమిళనాడుకు 192 టిఎంసిల నీటిని విడుదల చేయాలని తీర్పులో పేర్కొన్నారు. ఈ ఒప్పందాన్ని వివిధ కారణాల రీత్యా నాలుగు రాష్ట్రాలు వ్యతిరేకిస్తూ, తిరిగి తమ వాదనలను వినాలని కోరాయి. కర్ణాటక 2007 ఒప్పందం మేరకు ససేమిరా నీటిని విడుదల చేయమని నిరాకరించడం తోనే, తమిళనాడు సుప్రీంకోర్టును ఆశ్రయించింది.

సాధారణ వర్షపాతం ఆధారంగా కావేరి నదిలో నీరు 730 బిలియన్ ఎఫ్‌టి3 మాత్రమే అందుబాటులో ఉండగా, 1100 బిలియన్ ఎఫ్‌టి3ని నాలుగు ప్రాంతాలు అడుగుతున్నాయి. కర్ణాటక 425 బిలియన్ ఎఫ్‌టి3ని, తమిళనాడు 566 బిలియన్ ఎఫ్‌టి3ని, కేరళ 100 బిలియన్ ఎఫ్‌టి3ని, పుదుచ్చేరి 10 బిలియన్ ఎఫ్‌టి3ని అడుగుతున్నాయి. కావేరి నదీ జలాల మీద ఆధారపడి కర్ణాటక, తమిళనాడు రైతులు పంటలను పండిస్తున్నారు. తాగునీటి అవసరాలకు రెండు రాష్ట్రాలు ఈ నీటిని వాడుకుంటున్నాయి. రెండు రాష్ట్రాల్లోని ఎక్కువ కరువు ప్రాంతాలు ఈ నీటి మీదే ఆధారపడి జీవనం సాగిస్తున్నాయి. తమిళనాడులో 30 శాతం రివర్ సోర్సెస్ ఉంటే, కర్ణాటకలో 53 శాతం రివర్ సోర్సెస్ ఉన్నాయి. అలాగే తమిళనాడులో 54 శాతం రివర్ బేసిన్ ఏరియా ఉంటే, కర్ణాటకలో 43 శాతం రివర్ బేసిన్ ఏరియా ఉంది. కర్ణాటకలో ఎక్కువ కావేరి రివర్ సోర్సెస్ ఉండడం వల్ల కావేరి నదీ జలాలు ఎక్కువగా తమకే కావాలని కర్ణాటక అడుగుతోంది. గతం నుండి తమిళనాడు కావేరి నదీ జలాలను ఎక్కువగానే తీసుకుంది. అయినప్పటికీ ఇంకా ఎక్కువ కావాలని అడుగుతోందని కర్ణాటక వాదిస్తోంది.

42 శాతం కావేరి బేసిన్ ఏరియా కర్ణాటకలో ఉన్నప్పటికీ, 37శాతం వాటర్ షేర్‌నే కర్ణాటక పొందుతోంది. కాబట్టి రివర్ కాచ్‌మెంట్ ఏరియా

ప్రాతిపదికన వాటర్ షేర్‌ను సమీక్షించాలి. 63 శాతం కావేరి బేసిన్ ఏరియా, కర్ణాటకలోని కరువు ప్రాంతాల్లో ఉంది. అదే తమిళనాడులో అయితే 29 శాతం కావేరి బేసిన్ ఏరియా మాత్రమే కరువు ప్రాంతంగా ఉంది. వర్షాభావ పరిస్థితుల్లో గత ఒప్పందాల మేరకు తమిళనాడుకు నీటి సరఫరా చేయడం కుదరదని కర్ణాటక పేర్కొంటోంది. అలాగే సౌత్ వెస్టర్న్ మాన్‌సూన్ వల్ల కర్ణాటక ఎక్కువగా లబ్దిపొందుతూ, అదే వాటర్‌ను తమిళనాడుకు ఇస్తోంది. నార్త్ ఈస్టరన్ మాన్‌సూన్ వల్ల లబ్దిపొందుతున్న తమిళనాడు, ఆకాలంలోను కర్ణాటక నుండి నీటిని కోరడం సహేతుకం కాదని కర్ణాటక చెపుతోంది.

గతం నుండి తమిళనాడు కావేరి నదీ జలాల్లో అధిక వాటాను పొందుతోంది. దానికి అనుగుణంగా డామ్‌లను కట్టుకుని, లక్షల ఎకరాలని పంటపొలాలుగా మార్చుకుంది. కొత్తగా కర్ణాటక కావేరి నదీజలాలను ఒప్పందాలకనుగుణంగా నీటిని సరఫరా చేయమని చెపుతూ, తమిళనాడు వాటాను, కర్ణాటకే తీసుకోవాలని చూస్తోందని తమిళనాడు చెపుతోంది. కర్ణాటకలోని 70 శాతం జియోగ్రాఫికల్ ఏరియానే తమిళనాడులో ఉన్నప్పటికీ, జనాభాతో పోల్చుకుంటే కర్ణాటక కన్నా 120 శాతం అధికంగా తమిళనాడు కల్గివుంది. కాబట్టి జనాభా ప్రాతిపదికన తమిళనాడుకే ఎక్కువ కావేరి నదీ జలాల వాటా ఉండాలని తమిళనాడు అభిమతం. 1924 ఒప్పందం మేరకు తమిళనాడు నీటి వాటాను అడుగుతోంది. ఆ ఒప్పందాన్ని ఎటువంటి పరిస్థితుల్లోను మార్చడానికి వీలులేదని తమిళనాడు వాదిస్తోంది. కర్ణాటక ప్రజలు ఒప్పుకోవడం లేదనే సాకుతో జాతీయ నదీ జలాల ఒప్పందాన్ని కర్ణాటక కాలరాయడం భావ్యంకాదని తమిళనాడు పేర్కొంటోంది.

దేశంలోనే ఎక్కువగా కావేరి నదీ జలాలు 95 శాతం వరకు ప్రజలకు ఉపయోగపడుతున్నాయి. 85 శాతం కావేరి నదీ జలాలు వ్యవసాయానికి ఉపయోగపడుతున్నాయి. 15 శాతం తాగునీటికి ఉపయోగపడుతోంది. కర్ణాటకలో కావేరి నదీ జలాలను తాగునీటిగానే ఎక్కువగా ఉపయోగిస్తు న్నారు. కర్ణాటకలో 1/4 వంతు ఆహార ధాన్యాలు కావేరి నదీ జలాలతోనే పండిస్తున్నారు. 1/3వ వంతు బియ్యాన్ని తమిళనాడులో కావేరి నదీ జలాలతోనే పండిస్తున్నారు. కర్ణాటకలో మండ్య, మైసూరు జిల్లాలు అధికంగా కావేరి నదీ జలాలను ఉపయోగించుకుంటున్నాయి. అలాగే తమిళనాడులో తంజావూర్, తిరువాయూర్, నాగపట్టణం, ఈరోడ్ జిల్లాలు కావేరి నీటిని ఉపయోగించుకుంటున్నాయి.

1892లో మొదలైన కావేరి వివాదానికి ఇప్పటివరకు కేంద్రంలో అధికారంలోకి వచ్చిన ఏ పార్టీ చిత్తశుద్ధితో పరిష్కారానికి కృషిచేయలేదు. 1924లో ఇరు రాష్ట్రాలు కావేరి జల ఒప్పందంపై సంతకాలు చేశాయి. ఈ ఒప్పందంలో కృష్ణరాజసాగర్ (కెఆర్ఎస్) డామ్‌కు సంబంధించిన నిబంధనలను పొందుపరిచారు. ఒప్పందంలోని క్లాజ్ 11 ప్రకారం 5 సంవత్సరాల తర్వాత కెఆర్ఎస్ తప్ప మిగిలిన ప్రాజెక్టుల విషయంలో ఇరు రాష్ట్రాలు తమ అభిప్రాయాలను తెలపవచ్చని పేర్కొనబడింది. 1924 ఒప్పందం మేరకు కావేరి మిగులు జలాలను ఇరు రాష్ట్రాలు ఉపయోగించుకుంటూ వచ్చాయి. కెఆర్ఎస్ డామ్ నిర్మాణాన్ని మద్రాసు ప్రభుత్వం వ్యతిరేకించిన దరిమిలా మిట్టూరు డామ్‌ను నిర్మించడానికి అనుమతి ఇవ్వబడింది. 1892, 1924 ఒప్పందాలు ఇరు రాష్ట్రాలకు కావేరి జలాలను వాడుకోమని తీర్పు చెప్పినప్పటికీ, భాషా ప్రాతిపదిక రాష్ట్రాలు ఏర్పడిన తర్వాత వివాదాలు ఎక్కువయ్యాయి.

ముఖ్యంగా 1924 ఒప్పందం 50 సంవత్సరాల వరకే చెల్లుతుంది. అంటే 1974 నాటికి ఈ ఒప్పంద కాలం పూర్తవుతుంది. కావేరి నది కర్ణాటక నుండే ప్రవహిస్తుంది కాబట్టి, ఎక్కువ శాతం నీటిని కర్ణాటక డిమాండ్ చేస్తోంది. అందుకే బ్రిటిష్ సామ్రాజ్యానికి–మైసూర్ మహారాజాకి మధ్య జరిగిన ఒప్పందానికి తాము కట్టుబడి వుండాల్సిన అవసరం లేదని కర్ణాటక వాదిస్తోంది. నిజనిర్ధారణ కమిటీలు సైతం తమిళనాడు 566 టిఎంసిఎఫ్‌టి (వెయ్యి మిల్లీ క్యూబిక్ అడుగులు), కర్ణాటక 177 టిఎంసిఎఫ్‌టి (వెయ్యి మిల్లీ క్యూబిక్ అడుగులు) ఉపయోగించుకున్నట్టు పేర్కొన్నాయి. 1976లో అదనంగా 125 టిఎంసిఎఫ్‌టి నీళ్లను ఇరు రాష్ట్రాలు వాడుకోవాలనే ఒప్పందానికి వచ్చాయి. అంతర్జాతీయ సహజ న్యాయ సూత్రాల ప్రకారం 94 శాతం కావేరి నీటిని సమాన ప్రాతిపదికన కర్ణాటక–తమిళనాడు రాష్ట్రాల మధ్య పంచాలని కర్ణాటక వాదిస్తోంది. మిగిలిన నీటిని కేరళ, పుదుచ్చేరికి ఇవ్వాలని చెప్తోంది. తమిళనాడు 1924 ఒప్పందానికే కట్టుబడాలని పేర్కొంటోంది. కర్ణాటక వాదనతో విభేదించిన తంజావూర్, తమిళనాడుకు చెందిన రైతులు ఒక సంఘంగా ఏర్పడి 1986లో సుప్రీం కోర్టును ఆశ్రయించి, కావేరి నదీ జలాల వివాదాన్ని పరిష్కరించాలని అభ్యర్థించారు. 1990లో సుప్రీంకోర్టు ఇరు రాష్ట్రాల వాదనలు విన్న తర్వాత, వారినే చర్చల ద్వారా సమస్యను పరిష్కరించుకోమని ఆదేశించాయి. ఆ దిశగా అడుగులు పడకపోవడంతో సుప్రీంకోర్టు కేంద్రాన్ని ఆదేశిస్తూ, ట్రిబ్యునల్‌ను ఏర్పాటు చేసి కావేరి జల వివాద సమస్యను పరిష్కరించే దిశగా కృషి చేయాలని చెప్పింది. పది సంవత్సరాల (1980–1990) కాలంలో తమిళనాడులో కావేరి నది ఇన్‌ఫ్లోను దృష్టిలో పెట్టుకుని ట్రిబ్యునల్ 1991లో తీర్పునిచ్చింది. తమిళనాడుకు ఏటా 205 టిఎంసిఎఫ్‌టి నీరు ఇవ్వాలని, కొత్తగా కర్ణాటక వ్యవసాయ పంట పొలాలను విస్తరింపజేసుకోకూడదని తీర్పులో పేర్కొంది. కర్ణాటక ట్రిబ్యునల్ అవార్డును గౌరవించలేదు. తమ నిరసనలను బాహాటంగానే తెలియజేసిన క్రమంలో సుప్రీంకోర్టు జోక్యం చేసుకుని ట్రిబ్యునల్ అవార్డుని గౌరవించాలని చెప్పినప్పటికీ కర్ణాటక పెడచెవిన పెట్టింది.

ఈ మధ్యంతర ఉత్తర్వులను ఇండియా గెజెట్‌లో ముద్రించారు. 1993లో తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత చెన్నైలో ఆమరణ నిరాహారదీక్షకు దిగి, ఈ ఉత్తర్వులవల్ల తమిళనాడు రాష్ట్రం తన న్యాయమైన నీటివాటాను కోల్పోతుందని పేర్కొంది. 1995లో కర్ణాటకలో వర్షాభావ పరిస్థితుల వల్ల ఇంటిరీయమ్ ఉత్తర్వులను పాటించలేదు. తమిళనాడు అదే సంవత్సరం సుప్రీంకోర్టు తలుపు తడుతూ 30 టిఎంసిఎఫ్‌టి (వెయ్యి మిల్లీక్యూబిక్ అడుగులు) కావేరి జలాలను తమ రాష్ట్రానికి విడుదల చేయాలని పిటిషన్ వేసింది. కర్ణాటక రాష్ట్రంతో పాటు, సుప్రీంకోర్టు సైతం ఈ డిమాండ్‌ను తోసిపుచ్చాయి. అయినప్పటికీ సుప్రీంకోర్టు అప్పటి ప్రధాని పి.వి. నరసింహారావుని ఈ విషయంలో జోక్యం చేసుకోమని చెప్పింది. ప్రధాని ఇరు రాష్ట్ర ముఖ్యమంత్రులతో సమావేశాన్ని ఏర్పాటుచేసి చర్చలు జరిపినపుడు, ఇరు రాష్ట్రాలు సమస్యను సామరస్యపూర్వకంగా పరిష్కరించడానికి తోడ్పాటును అందిస్తామని చెప్పాయి.

# డబ్ల్యుటిఒను బ్రిక్స్ సవాలు చేస్తుందా?

*బ్రిక్స్ అభివృద్ధి నమూనా ప్రైవేట్, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల మార్కెట్ అవసరాలకు అనుగుణమైన విధానాలు చేపడుతుందనీ, వాటి వల్ల సామాన్య ప్రజలు తీవ్రమైన సంక్షోభంలోకి నెట్టబడుతారనీ అంటున్నారు* **ఎస్. ఆశాలత**

కొద్ది రోజుల క్రితం భారతదేశ ఆతిథ్యంలో గోవాలో జరిగిన బ్రిక్స్ శిఖరాగ్ర సదస్సు సభ్య దేశాల సామాన్య ప్రజలలో పెద్దగా ఉత్సాహాన్ని కలిగించ లేకపోయిందనే చెప్పాలి. ఎందుకంటే ఈ రెండు రోజుల సదస్సులో కొన్ని వాణిజ్య ఒప్పందాలను కుదుర్చుకోవటంతో పాటు (పాక్) ఉగ్రవాదం పై తీవ్ర పదజాలంతో ధ్వజమెత్తటమే భారత ప్రభుత్వం ఏకైక ఉద్దేశంగా పెట్టుకుంది. బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా, దక్షిణాఫ్రికా దేశాలు కలసి ఏర్పడిన బ్రిక్స్ గత దశాబ్ద కాలంలో ప్రపంచపు దక్షిణ ప్రాంతంలో ఆవిర్భవించిన ఒక కొత్త భౌగోళిక–రాజకీయ కూటమి. 2006లోనే దీనికి అంకురార్పణ జరిగినప్పటికీ 2009లో బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనాలు 'బ్రిక్' కూటమిగా సంఘటితపడి మొదటి సదస్సును జరుపుకున్నాయి. 2010లో దక్షిణాఫ్రికా పూర్తి స్థాయి సభ్య దేశంగా చేరింది. దీనితో పశ్చిమ దేశాల ఆధిపత్యం కింద నలుగుతూ అభివృద్ధి చెందుతున్న మూడవ ప్రపంచంగా పిలవబడుతున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాల దేశాలు ఒక కూటమిగా ఏర్పడినట్లయింది. రాజకీయ, ఆర్థిక సహకారం, ఆధిపత్య స్వభావం గల అంతర్జాతీయ ద్రవ్య వ్యవస్థ సంస్కరణ, ప్రపంచ ఆర్థిక సంక్షోభం నుండి కోలుకోవడం ఈ కూటమి ప్రధాన ఉద్దేశాలుగా ప్రకటించారు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థను గుప్పెట్లో పెట్టుకుని శాసిస్తున్న ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ వంటి సంపన్న పశ్చిమ దేశాల ఆధిపత్య సంస్థలను సవాలు చేసి దక్షిణాది దేశాలకు ప్రత్యామ్నాయ, న్యాయమైన ఆర్థిక కేంద్రాన్ని నెలకొల్పడం ఈ కూటమి ప్రధాన ఉద్దేశంగా చెప్పబడుతోంది. ఇప్పటివరకు జరిగిన బ్రిక్స్ కూటమి ప్రయాణం నిజమైన అర్థంలో ఈ దిశలో ఎంతవరకు ముందుకు వెళ్లిందో నిశితంగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

ఈ కూటమి ఆవిర్భవించిన కొన్ని సంవత్సరాల వరకు ఎటువంటి నిర్మాణం లేకుండా అనధికార వేదికగానే ఉండిపోయింది. ఏడాదికొకసారి ఒక సభ్య దేశం ఆతిథ్యంలో శిఖరాగ్ర సదస్సులు జరుపుకుంటున్నది. (8వ శిఖరాగ్ర సదస్సు గోవాలో అక్టోబర్ 15, 16 తేదీలలో జరిగింది). కొన్ని అంతర్జాతీయ రాజకీయ పరిణామాల పట్ల కొంత మేరకు బ్రిక్స్ కూటమి ప్రగతిశీల అభిప్రాయాలను ప్రకటిస్తూ వచ్చింది. 2011లో లిబియాలో సైనిక జోక్యాన్ని వ్యతిరేకించింది, ఐక్యరాజ్య సమితి భద్రతా మండలిలో లిబియాను 'నో–ఫ్లై జోన్'గా ప్రకటించే తీర్మానంపై ఓటింగ్‌లో పాల్గొనలేదు. సిరియాలో పశ్చిమ దేశాల సైనిక జోక్యాన్ని వ్యతిరేకించింది, పాలస్తీనా సమస్యకు న్యాయమైన పరిష్కారం కావాలని డిమాండ్ చేసింది. వైద్యం – ఔషధాల విషయంలో పశ్చిమ దేశాల మేధో సంపత్తి హక్కుల గుత్తాధిపత్యాన్ని నిరాకరించింది. ఇటీవలి సంవత్సరాలలోనే బ్రిక్స్ కూటమి తన స్వంత కొత్త ద్రవ్య సంస్థలను ఏర్పాటు చేసుకునే ప్రయత్నాలు

---

1998లో కావేరి రివర్ అథారిటీ (సిఆర్ఎ) ప్రధానమంత్రి ఛైర్‌పర్సన్‌గా, నాలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులను మెంబర్లుగా ఏర్పాటు చేశారు. 16 సంవత్సరాల తర్వాత 2007లో కావేరి వాటర్ డిస్‌ప్యూట్స్ ట్రిబ్యునల్ (సిడబ్ల్యుడిటి) తన చివరి తీర్పుని వెలువరించింది. 1892, 1924 ఒప్పందాల ప్రకారం నాలుగు రాష్ట్రాలు నడుచుకోవాలని తీర్పునిచ్చింది. ఈ అవార్డు ప్రకారం తమిళనాడుకు 419 టిఎంసిలు, కర్ణాటకకు 270 టిఎంసిలు, కేరళకు 30 టిఎంసిలు, పాండిచ్చేరికి 7 టిఎంసిలు ఇవ్వాలని చెప్పింది. నిజానికి తమిళనాడు 512 టిఎంసిలను, కర్ణాటక 465 టిఎంసిలను డిమాండ్ చేస్తున్నాయి. 2013లో కేంద్ర ప్రభుత్వం సిడబ్ల్యుడిటి తీర్పును ఇరు రాష్ట్రాలు పాటించాలని విజ్ఞప్తి చేసింది. కావేరి మేనేజ్‌మెంట్ బోర్డు (సిఎంబి) ద్వారా నీటి విడుదలలను పర్యవేక్షించాలని కేంద్రప్రభుత్వం నోటిఫికేషన్ జారీ చేసింది. జయలలిత కావేరి మేనేజ్‌మెంట్ బోర్డును, కావేరి వాటర్ అథారిటీని వెంటనే ఏర్పాటు చేయాలని సుప్రీంకోర్టును కోరింది. వీటన్నిటిని కర్ణాటక రైతులు తీవ్రంగా వ్యతిరేకించారు. చివరికి సెప్టెంబర్ 2016లో సుప్రీంకోర్టు తాజా తీర్పునిచ్చింది. దీన్ని సైతం కర్ణాటక రైతులు వ్యతిరేకించారు. తాజా తీర్పులో తమిళనాడు పుదుచ్చేరిలకు తగినంత కావేరి నీటిని ఇవ్వాలని, కర్ణాటక 35 టిఎంసిఎఫ్‌టి ఇవ్వలేకపోతే సూపర్‌వైజర్ కమిటీ దృష్టికి సమస్యను తీసుకెళ్లాలని ఆదేశించింది.

కేంద్రంలో ఉన్న బిజెపి పార్టీ తన ఓటు బ్యాంకు రాజకీయాలను పక్కనపెట్టి సమస్యను పరిష్కరించాల్సిన అవసరముంది. శాస్త్రీయమైన, శాశ్వత పరిష్కారాన్ని సూచించాల్సిన అవసరముంది. నాలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులతోటి, వివిధ పార్టీల, ప్రజాసంఘాల, నీటి నిపుణులతోటి పలుదఫాలు చర్చలు జరపాలి. వర్షాభావ పరిస్థితులను, రిజర్వాయర్లు ఎండిపోతున్న అంశాల్ని, భూగర్భ జలమట్టాలు అడుగంటుతున్న తీరును, వ్యవసాయంలో ప్రకృతి సేద్యాన్ని ప్రవేశపెట్టే అంశాల్ని, త్రాగు, సాగు నీటి అవసరాల్ని, కావేరి నదికి ఎగువ, దిగువ నున్న పంట పొలాలను దృష్టిలో పెట్టుకుని సమస్యను హేతుబద్ధంగా పరిష్కారించాల్సివుంది . వర్షాభావ పరిస్థితుల వల్ల కావేరి నీటిపై ఆధారపడ్డ రిజర్వాయర్లు కెఆర్ఎస్, కబిని, హేమావతి, హారంగిలలో నీటి మట్టం అడుగంటి పోయిన విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

మొదలుపెట్టింది. ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్, ఆసియా అభివృద్ధి బ్యాంకులకు ప్రత్యామ్నాయంగా బ్రిక్స్ కూటమి వరుసగా న్యూ డెవలప్‌మెంట్ బ్యాంక్ (నూతన అభివృద్ధి బ్యాంకు)ను, కంటిజెంట్ రిజర్వ్ అరేంజ్మెంట్ (ఐఎంఎఫ్ తరహా రిజర్వ్ నిధి)ని నెలకొల్పింది. చైనా చొరవతో 57 దేశాలు సభ్యులుగా 2016లో ఏషియన్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంక్ (ఆసియా మౌలిక సదుపాయాల పెట్టుబడుల బ్యాంక్) స్థాపించబడింది, దీనిలో బ్రిక్స్ దేశాలకు 43.29 శాతం వోటింగ్ హక్కు ఉంది. షాంఘై నగరం కేంద్రంగా ఉన్న న్యూ డెవలప్‌మెంట్ బ్యాంకులో ఐదు సభ్య దేశాలు సమాన పెట్టుబడి పెట్టాయి, ఐదు దేశాలకు సమాన గొంతుక, విధానాలపై నిర్ణయాలలో సమాన హక్కు కలిగి ఉంటాయి. ఈ బ్యాంకు ప్రపంచ బ్యాంకు తరహా షరతులను పెట్టకుండా, డాలర్లలో కాకుండా ఐదు దేశాల కరెన్సీలో సుస్థిరమైన, పర్యావరణ అనుకూలమైన ప్రాజెక్టులకు రుణాలు ఇస్తుందని ఇతర బహుళపక్ష అభివృద్ధి బ్యాంకుల లాగా కాకుండా తక్కువ నిరంకుశాధికార స్వభావం కలిగి ఉంటుందనీ బ్రిక్స్ ప్రకటించుకుంది. 100 కోట్ల రుణ వితరణతో ఈ బ్యాంకు తన ప్రస్తానాన్ని ప్రారంభించింది.

బ్రిక్స్ కూటమి సభ్య దేశాలు దక్షిణాది ప్రపంచంలో ఎదుగుతున్న అతి పెద్ద ఆర్థిక వ్యవస్థలు, అవి తమ తమ ప్రాంతాలలో ప్రాభవంగల ప్రాంతీయ రాజకీయ శక్తులు. ప్రపంచ జనాభాలో సగం ఈ ఐదు దేశాలలో ఉంది. ఇవి ప్రపంచంలోనే అతి పెద్ద మార్కెట్లు, పెట్టుబడికి చౌక శ్రమను అందించే దేశాలు. బ్రిక్స్ దేశాలకు వలస వాదానికి వ్యతిరేకంగా వెనుకబాటుతనానికి వ్యతిరేకంగా పోరాడిన ఉమ్మడి చరిత్ర ఉన్నట్లు చెప్పుకుంటున్నాయి. ఉమ్మడి సవాళ్లను ఎదుర్కుంటూ భవిష్యత్ అభివృద్ధి పట్ల ఒక ఉమ్మడి దృష్టికోణం కలిగి ఉన్నట్లు కూడా చెప్పుకుంటున్నాయి. అదే సమయంలో ఈ దేశాలు భిన్న స్వభావాలు, భిన్న ప్రయోజనాలు విపరీతమైన భిన్నత్వం గల ఆర్థిక సామాజిక వ్యవస్థలు గల దేశాలు.

అయితే బ్రిక్స్ కూటమి సభ్య దేశాల ప్రభుత్వాలు తమ దేశంలోపల పొరుగు దేశాల పట్ల అనుసరిస్తున్న విధానాలను పరిశీలిస్తే అవి దక్షిణాది దేశాల, వాటి ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించవు అనేది స్పష్టమవుతుంది. బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా, దక్షిణాఫ్రికా దేశాల ప్రభుత్వాలను వాటి పొరుగు దేశాలు తమ మిత్ర దేశాలుగానో, అంతర్జాతీయ రంగం పై తమకు ప్రాతినిధ్యం వహించే దేశాలుగానో పరిగణించటం లేదు. తమ తమ ప్రాంతాలలో ఆర్థిక, రాజకీయ, సైనిక ఆధిపత్యం చెలాయిస్తుండటాన్ని తీవ్రంగా విమర్శిస్తున్నాయి. అంతర్గతంగా ఈ దేశాలన్నీ ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలను అనుసరిస్తూ ప్రజా ప్రయోజనాలను కార్పొరేట్ కంపెనీలకు బలి చేస్తున్నాయి.

బ్రెజిల్ ప్రస్తుతం తీవ్రమైన ఆర్థిక రాజకీయ సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. ప్రభుత్వ చమురు కంపెనీలో అవినీతి ఆరోపణలతో మొదలై అధ్యక్షుడు దిల్మారౌసెఫ్ ( వామపక్ష వర్కర్స్ పార్టీ) ను ఓటింగ్ ద్వారా తొలగించి ఆ స్థానంలో ప్రజామోదంలేని మితవాద శక్తులు అధికారాన్ని చేపట్టాయి. 5 నెలల క్రితం అధికారంలోకి వచ్చిన కొత్త ప్రభుత్వం గత 15 ఏళ్లుగా బ్రెజిల్ సామాజిక రంగంలో సాధించిన ప్రగతిని ఒక్క వేటుతో కూలదోసింది, ఆర్థిక సంక్షోభానికి పరిష్కారంగా సంక్షేమ పథకాల వ్యయంపై కోత విధించింది, పోరాడి సాధించుకున్న కార్మిక చట్టాలను సవరిస్తున్నది, మానవ హక్కులను అణచివేస్తున్నది. ప్రజా నిరసన ఉద్యమాలను తీవ్రంగా అణచివేస్తున్నది.

రష్యా కూడా తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది – ఇందుకు చమురు ధరలు పడిపోవడం ఒక కారణమైతే క్రిమియాపై సైనికదాడి ఫలితంగా పశ్చిమ దేశాలు విధించిన ఆంక్షలు మరొక ప్రాధాన కారణం. అధ్యక్షుడు పుతిన్ దేశ ప్రజల దృష్టిని ఆర్థిక సంక్షోభం నుండి పక్కకు మళ్లించడానికి ఉక్రెయిన్, సిరియాలలో సైనిక జోక్యం ద్వారా 'రష్యాను తిరిగి గొప్ప దేశంగా' చేసే జాతీయవాద కార్యక్రమంలో మునిగి ఉన్నాడు. అక్కడ ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించే వారిని 'దేశ ద్రోహులు గా ముద్రవేసి పౌర సమాజం గొంతుకను అణచివేయడం జరుగుతున్నది.

ఇండియా విషయానికి వస్తే బయటి ప్రపంచం రాజకీయ ఆర్థిక సంక్షోభం లేని, బలమైన పెరుగుదల రేటు గల స్థిరమైన దేశంగా పరిగణిస్తున్నది. కాని అంతర్గతంగా ఆశ్రిత పెట్టుబడిదారీ విధానాలను అవలంబిస్తూ కార్పొరేట్ కంపెనీలకు భూములను అప్పగించటం, పెద్ద ఎత్తున నిర్వాసితాన్ని పర్యావరణ విధ్వంసాన్ని సాగుస్తున్నది. రైతులు, కార్మికులు, పట్టణ పేదలకు బతుకు దుర్భరం చేస్తున్నది. మరొకవైపు లౌకికవాదానికి పూర్తిగా తిలోదకాలిచ్చి దేశాన్ని హిందూ రాజ్యంగా స్థాపించడానికి హిందుత్వ శక్తులను ప్రోత్సహిస్తున్నది. దళితులు, మైనారిటీలపై మతపరమైన హింస పెచ్చరిల్లుతోంది. కశ్మీర్ విషయంలో గత ప్రభుత్వాల మార్గంలోనే తీవ్రమైన అణచివేత అమలుచేస్తున్నది, అక్కడ పెచ్చుపెరిగిన మారణకాండను ప్రశ్నిస్తున్న వారినీ, ప్రజాస్వామ్య గొంతుకలను దేశ ద్రోహులుగా ముద్ర వేస్తున్నది.

చైనా నేడు ప్రపంచంలోనే అతి పెద్ద వస్తు ఎగుమతిదారుగా, అతిపెద్ద ఎదుగుతున్న ఆసియా ఆర్థిక శక్తిగా, పారిశ్రామికంగా ప్రపంచాన్ని శాసిస్తున్న దేశంగా పేరుపొందింది. ప్రపంచ మార్కెట్లన్నీ చైనా చౌక వస్తువులతో నిండిపోయాయి. కాని దేశంలోపల గ్రామీణ పట్టణ ప్రజల మధ్య అభివృద్ధిలో తీవ్ర అంతరాలు, పర్యావరణ విధ్వంసం, విపరీతమైన కాలుష్యం, పెద్ద ఎత్తున భూ అధిగ్రహణం, రైతు వ్యతిరేక విధానాలు, అత్యధిక శాతం జనాభా పేదరికంలో మగ్గటం ఇదే వాస్తవ చిత్రం. గని కార్మికులు పెద్ద ఎత్తున నిరసన ఉద్యమాలు చేస్తున్నప్పటికే అవి బయటికి రావడం లేదు. 2020 నాటికి చైనా కమ్యూనిస్టు పార్టీ స్థాపించి 100 ఏళ్లు నిండుతున్న సందర్భంగా అప్పటికల్లా దేశం ప్రగతిని సాధించి సుసంపన్నమవుతుందనే ప్రచారం మాత్రం పెద్దఎత్తున జరుగుతోంది.

దక్షిణాఫ్రికా జాత్యహంకారానికి వ్యతిరేకంగా దశాబ్దాల పాటు పోరాడి స్వాతంత్ర్యం సాధించి 20 ఏళ్లు గడుస్తున్నా, అధికారికంగా అది ప్రజాస్వామిక దేశంగా చెప్పబడుతున్నా అక్కడ ఇంకా నల్లజాతీయులపై సంస్థాగత వివక్ష కొనసాగుతూనే ఉంది. పేద వర్గాలు, కార్మిక వర్గం తీవ్ర దోపిడీ అణచివేతలకు గురవుతున్నాయి. 40 శాతం మంది నిరుద్యోగులుగా ఉన్నారు. నల్లజాతీయులలో కొద్ది శాతంగా ఉన్న ఉన్నత మధ్యతరగతి వర్గం మాత్రం సంపద కూడగట్టుకోగలిగింది. అత్యధిక శాతం ప్రజలకి తిండి, గృహ సౌకర్యం అందుబాటులో లేదు. విద్యార్థులు ఉచిత విద్య కోసం దశాబ్దాలుగా ఉద్యమిస్తూనే ఉన్నారు. దక్షిణాఫ్రికా ఆర్థిక వ్యవస్థ ఐరోపా దేశాలపై ఆధారపడి ఉంది.

ఒక వైపు తమ తమ దేశాలలో ప్రజలపై దోపిడీ అణచివేతలను అమలు చేస్తూ అసమానతలను పెంచి పోషిస్తూ నయా ఉదారవాద విధానాలతో విదేశీ పెట్టుబడికి ఊడిగం చేస్తూ వస్తున్న బ్రిక్స్ కూటమి దేశాలు ప్రపంచ బ్యాంకు ఆధిపత్యాన్ని ఎదిరించడం ఎవరి ప్రయోజనాల కోసమో లోతుగా ఆలోచించాలి. బ్రిక్స్ దేశాలు పశ్చిమ దేశాల అభివృద్ధి నమూనాను తిరస్కరించినట్లు ప్రకటించుకున్నప్పటికీ నిజానికి బ్రిక్స్ కూటమి అభివృద్ధి నమూనా దానికి మౌలికంగా భిన్నమైనదేమీ కాదు. ఈ దేశాలు ప్రైవేటు రంగంపై, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులపై కేంద్రీకరించి మార్కెట్ అవసరాలకు అనుగుణమైన విధానాలు చేపడుతున్నాయి. బృహత్తర స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలు, పెద్ద పెద్ద మౌలిక సదుపాయాల ప్రాజెక్టులు, సుస్థిరం కాని ఇంధన ప్రాజెక్టుల పై పరస్పరం ఒప్పందాలు కుదుర్చుకుంటున్నాయి. ఈ దేశాల బహుళజాతి కంపెనీలు అమెరికా బహుళజాతి కంపెనీల మాదిరిగానే అవి పనిచేసే దేశాలలో కార్మికులను దోపిడీ చేస్తున్నాయి, సహజ వనరులను కొల్లగొడుతున్నాయి, రైతులను భూముల నుండి నిర్వాసితులను చేస్తున్నాయి, తీవ్రమైన సామాజిక పర్యావరణ విధ్వంసాన్ని కలుగచేస్తున్నాయి. ఈ దేశాల మధ్య కుదుర్చు కుంటున్న స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాల వల్ల ఆహార సార్వభౌమత్వం, వ్యవసాయ రంగం, రైతుల హక్కులు, సేవారంగం, వైద్య ఆరోగ్య రంగం మొదలైన వాటిలో సామాన్య ప్రజల ప్రయోజనాలకు తీవ్ర ప్రమాదం ఏర్పడనున్నది.

బ్రిక్స్ కూటమిపైకి ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌ల ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ ముందుకొచ్చినదిగా చెప్పబడుతున్నప్పటికీ వాస్తవానికి వాటికి పోటీగా కాక వాటికి పూరకంగా, వాటితో కుమ్మక్కైన కూటమి. ఉదాహరణకు చెల్లింపుల మిగులు సంక్షోభం ఎదురైనప్పుడు బ్రిక్స్ కూటమి ఏర్పరచిన కంటిజెన్సీ రిజర్వ్ అరేంజ్‌మెంట్ (సిఆర్ఎ) నుండి రుణం పొందే దేశాలు తమ కోటాలో 30 శాతం పొందిన తర్వాత ఐఎంఎఫ్ (వ్యవస్థాగత సర్దుబాట్లకై) వద్దకు వెళ్లాలనే నియమం పెట్టుకుంది.

ప్రపంచ వాణిజ్య సంస్థలోనూ, స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాల విషయంలోనూ, ఐక్యరాజ్యసమితి వాతావరణ చర్చల సందర్భంగానూ కూడా బ్రిక్స్ కూటమి వాటిని ఎదిరించే విధంగా కాక వాటితో సర్దుకుపోయే విధానాలనే అవలంబించింది. బ్రిక్స్ కూటమికి చెందిన బహుళజాతి కంపెనీలు కూడా ఉత్తరాది బహుళజాతి కంపెనీల మాదిరి గానే పేద ప్రపంచంలోని నిరుపేద దేశాలలో ప్రజలను, సహజ వనరులను కొల్లగొడుతూ పెట్టుబడిని పోగు చేసుకుంటున్నాయి.

అటువంటప్పుడు ఈ కొత్త వేషం ఎందుకు అనే ప్రశ్న తలెత్తుతుంది. 21వ శతాబ్దంలో బలమైన ఆర్థిక శక్తులుగా ఎదుగుతున్న తమకు ప్రపంచ బ్యాంకు – ఐఎంఎఫ్ సంస్థలలో తగిన స్థానాన్ని ఇవ్వలేదనీ, తమకు పెద్దపీట వెయ్యలేదనీ, ఓటు వాటాను పెంచలేదనే (ఇప్పటికే అమెరికాకు వీటో చేసే హక్కు ఉంది) నిస్పృహ ఇందుకు ప్రధాన కారణం . దక్షిణాది దేశాల మధ్య సహకారం అనే పదజాలాన్ని పదే పదే వాడుతున్నప్పటికీ ఆ దేశాల అసలు ఉద్దేశం మౌలిక ఆర్థిక పరివర్తన కాదు, ఒక కొత్త ప్రపంచ ఆర్థిక ఆధిపత్య శక్తిగా తమను తాము స్థాపించుకోవటమే నిజమైన ఉద్దేశం. పశ్చిమ దేశాల ఆర్థిక శక్తులు ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై వహిస్తూ వచ్చిన నియంత్రణ మాదిరిగానే తామూ ఆధిపత్యం నియంత్రణ పొందాలనేదే ఈ కూటమి లక్ష్యం. సోవియట్ యూనియన్ పతనమైన తర్వాత అమెరికా ఏకైక ఆధిపత్య శక్తిగా ఏకధృవ ప్రపంచం అవతరించింది.

21వ శతాబ్దంలో అమెరికా ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ ప్రధానంగా దక్షిణాదిన అనేక ప్రాంతీయ భౌగోళిక – రాజకీయ కూటములు తలెత్తుతున్నాయి. రష్యా చైనా భారత్ వంటి దేశాలు రాజకీయ ఆర్థిక ఆధిపత్యం కోసం ఉవ్విళ్లూరుతూ ముందుకు తెచ్చిన బ్రిక్స్ కూటమి కూడా అటువంటిదే. (గోవా శిఖరాగ్ర సదస్సులో నరేంద్ర మోడీ ఉగ్రవాదంపై పోరును ప్రధాన అంశంగా చేసి పాకిస్తాన్‌ను ఉగ్రవాద దేశంగా ఇతర దేశాల నేతలతో ప్రకటింప చేయడానికి చేసిన ప్రయత్నాలను కూడా దీనిలో భాగంగానే చూడాలి.)

ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌లు అభివృద్ధి చెందుతున్న దేశాలకు రుణాలు ఇస్తూ వాటితో పాటు అనేక షరతులను పెట్టాయి ? ఆ దేశాలు తమ ఆర్థిక వ్యవస్థలను సరళీకరించాలని, ప్రభుత్వ సేవలను ప్రైవేటీకరించాలని, మార్కెట్లను బార్లా తెరవాలనీ, వ్యవసాయ, విద్య, వైద్య రంగాలకు ప్రభుత్వ సహాయాన్ని, వ్యయాన్ని తగ్గించాలనేవి ఆ షరతులలో ప్రధానమైనవి. ఈ రుణాలతో పెద్ద ఎత్తున విధ్వంసాన్ని, నిర్వాసితాన్ని కలిగించే బృహత్తర ఆనకట్టల నిర్మాణం, విద్యుత్ ప్రాజెక్టులు, మౌలిక సదుపాయాల నిర్మాణ ప్రాజెక్టులు చేపట్టారు. దీనితో ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌ల దోపిడీ స్వభావం పూర్తిగా బహిర్గతమయింది, వాటి పట్ల తీవ్ర విమర్శలు, పెద్ద పెట్టున ప్రజాందోళనలు చెలరేగాయి. ఇప్పుడు బ్రిక్స్ కూటమి వాటి నుండి గుణపాఠం తీసుకుని సహకారం, సుస్థిరత, అభివృద్ధి అనే ప్రజలకు ఆమోదమైన పదజాలాన్నే ఉపయోగిస్తున్నది. అందుకే బ్రిక్స్ కూటమి సభ్య దేశాల ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, బుద్ధిజీవులు తమ ప్రభుత్వాలు కుదుర్చుకుంటున్న ఒప్పందాలను నిశితంగా పరిశీలించాలి. వాటివల్ల సామాన్య ప్రజలపై ఎటువంటి ప్రభావం పడుతుందో విశ్లేషించ గలగాలి. ముందుగా ఆ ఒప్పందాలు, రుణాలు, వాటితో చేపట్టే అభివృద్ధి ప్రాజెక్టుల వివరాలను బహిర్గతం చేయమని ప్రభుత్వాన్ని డిమాండ్ చెయ్యాలి. ప్రపంచ బ్యాంకు విధానాలను ఏ విధంగా నైతే ఎండగట్టి వ్యతిరేకించారో అదే స్థాయిలో అప్రమత్తతతో ఉండాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# అగ్రరాజ్యాలతో భారత్ ఆయుధ బంధం

***భారత పాలకులు ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించకుండా ఇతర దేశాలపై ఆధిపత్యం కోసం సామ్రాజ్యవాద దేశాలతో ఆయుధ బంధాలను నెలకొల్పుకొంటున్నారని అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

ప్రపంచాన్ని ఆర్థిక సంక్షోభం పట్టి పీడిస్తున్నా, ఆర్థిక సంస్థలు నిట్టనిలువుగా కుప్పకూలుతున్నా, ప్రపంచ వ్యాప్తంగా నిరుద్యోగం, పేదరికం పెరిగిపోతున్నా, అమెరికా ఆయుధ వ్యాపారం మాత్రం మూడు పూలు ఆరు కాయలుగా సాగుతోంది. అందుకే అమెరికా సామ్రాజ్యవాదం యుద్ధాన్ని కోరుకుంటుంది. ప్రపంచంలోకెల్లా అత్యధిక ఆయుధాలను విక్రయిస్తున్న దేశంగా పేరు తెచ్చుకుంది. వాటిలో చిన్నాచితకా ఆయుధాల నుంచి యుద్ధ విమానాలు, ట్యాంకుల వరకు ఉంటాయి. 94 దేశాలకు ఆయుధాలను అమెరికా ఎగుమతి చేస్తోంది. దాయాది దేశాలైన భారత్ – పాకిస్తాన్ రక్షణ అవసరాల కోసం, ఒకరిని ఒకరు నిలువరించడం కోసం పోటీపడి మరీ ఆయుధాలను పోగేసుకుంటున్నాయి. ఇటీవలి కాలంలో ఆయుధాలను పెద్ద ఎత్తున దిగుమతి చేసుకుంటున్న దేశాలలో భారత్ అగ్రభాగాన నిలుస్తుంది. మరింత స్పష్టంగా చెప్పాలంటే ప్రపంచంలోని 14 శాతం ఆయుధాలను కొనుగోలు చేస్తుంది. ఆయుధాల కొనుగోళ్లలో భారత్ రెండవ స్థానంలో ఉండగా పాకిస్తాన్ పదవ స్థానంలో ఉంది. భారత్ రక్షణ వ్యయం కోసం జిడిపిలో రు. 3,32,000 (2.4 శాతం), పాకిస్తాన్ రు. 2,30,000 (2.6 శాతం) ఖర్చు చేస్తున్నాయి.

ఉడీ ఘటన తర్వాత భారత్–పాక్ నడుమ వాగ్యుద్ధం తీవ్ర స్థాయికి చేరి, అది యుద్ధ సన్నాహాల దిశగా పోతున్నదని అందరూ భావిస్తున్న సమయంలో, భారత పర్యటనకు వచ్చిన ఫ్రాన్స్ రక్షణ మంత్రి జీన్ వైస్ లీ డ్రీయాన్‌తో రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు ఒప్పందం సెప్టెంబర్ 23న కుదిరింది. బ్రిక్స్ సదస్సులో పాల్గొనేందుకు గోవా వచ్చిన రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్, మోడీ మధ్య అక్టోబర్ 15న రు. 43 వేల కోట్ల విలువ గల రక్షణ ఒప్పందాలు కుదిరాయి. ఇందులో అధునాతన గగనతల క్షిపణి రక్షణ వ్యవస్థల సరఫరా, ఫ్రిగేట్ యుద్ధనౌకలు, హెలికాప్టర్ల సంయుక్త ఉత్పత్తి వంటివి ఇందులో ఉన్నాయి. ఈ ఒప్పందాలతో భారత్‌కు అతి పెద్ద ఆయుధ సరఫరాదారుగా తన స్థానాన్ని రష్యా పదిలపరచుకుంది. 2016 జూన్ 7న భారత ప్రధాని నరేంద్ర మోడీ, అమెరికా అధ్యక్షులు బరాక్ ఒబామా మధ్య సైనిక సహకార ఒప్పందం కుదిరింది. దీనిలో భాగంగానే అమెరికాతో భారత్ నాలుగు నిఘా విమానాల కొనుగోలు కోసం వంద కోట్ల డాలర్ల (దాదాపు రు. 6,700 కోట్లు) ఒప్పందం కుదుర్చుకుంది. దీర్ఘశ్రేణి సముద్ర నిఘా వ్యవస్థ కలిగిన, జలాంతర్గామి విధ్వంసక యుద్ధ విమానాలు 'పోసిడాన్–8ఐ' (పీ–8ఐ)లను కొనేందుకు అమెరికా రక్షణ శాఖ, విమానాల తయారీ సంస్థ బోయింగ్‌తో దీన్ని కుదుర్చుకుంది. ఇప్పటికే ఎనిమిది పీ–8ఐలను భారత్ కొనుగోలు చేసిందని, తాజాగా మరో నాల్గింటిని కొనుగోలు చేస్తోందని రక్షణ శాఖ అధికారులు వెల్లడించారు. రక్షణ రంగానికి సంబంధించి గత పదేళ్లలో మొత్తం 15 బిలియన్ డాలర్ల (రు. 1,00,500 కోట్లు) ఒప్పందాలను అమెరికాతో భారత్ కుదుర్చుకుంది.

7.8 బిలియన్ యూరోల (దాదాపు రు. 59,000 కోట్లు)తో భారత్ తన రక్షణ పాటవాన్ని పెంచుకునే దిశలో 36 రాఫెల్ జెట్‌ల కొనుగోలు ఒప్పందంపై ఢిల్లీలో భారత్, ఫ్రాన్స్ రక్షణ మంత్రులు మనోహర్ పరీకర్, జీన్ వైస్ లీ డ్రీయాన్‌లు సంతకాలు చేశారు. ఒప్పందంలో భాగంగా ఫ్రాన్స్‌కు మొత్తం విలువలో 15 శాతం అడ్వాన్స్‌గా భారత్ చెల్లించాలి. భారత్ రక్షణ మంత్రి విలేకరులతో మాట్లాడుతూ 'పూర్తి ఆయుధ వ్యవస్థతో కూడిన 36 రాఫెల్ విమానాల కోసం ఫ్రాన్స్‌తో ఒప్పందం చేసుకున్నాం. ఐదేళ్లపాటు వాటి నిర్వహణ, విడిభాగాల సరఫరా బాధ్యత ఫ్రాన్స్‌దే. ఈ ఒప్పందంతో భారత వాయుసేన సామర్థ్యం మరింత పెరుగుతుంది' అని వ్యాఖ్యానించారు. ఈ రాఫెల్ ఫైటర్ జెట్‌ల సరఫరా 36 నెలల తర్వాత మొదలవుతుంది. 66 నెలల్లో పూర్తవుతుంది. ఒకరు కూర్చునే రాఫెల్ యుద్ధ విమానం ఖరీదు రు. 680 కోట్లు కాగా, ఇద్దరు కూర్చునే యుద్ధ విమానం ఖరీదు రు. 702 కోట్లు ఉంటుంది. భారత్ ఫ్రాన్స్‌తో యుద్ధ విమానాల కొనుగోలుకు రు. 25,588 కోట్లు, విమానానికి అమర్చే ఆయుధాల కోసం రు. 5,312 కోట్లు, ఎలక్ట్రానిక్ స్కానింగ్ రాడార్లకు రు. 12,719 కోట్లు, సహాయ సామాగ్రికి రు. 13,427 కోట్లు, నిర్వహణ సేవల కోసం రు. 2641 కోట్లు వెచ్చిస్తున్నది.

ఎన్నో ఏళ్లుగా మన వైమానిక దళం యుద్ధ విమానాల కొరతను ఎదుర్కొంటుందని, మన దేశం గొప్పగా చెప్పుకునే మిగ్–21, మిగ్–27 యుద్ధ విమానాలకు కాలం చెల్లిందని వాయు దళపతులు అంటున్నారు. అదే సమయంలో పాకిస్తాన్ కొన్నేళ్లుగా రక్షణ కొనుగోళ్లలో మనకంటే ముందుందన్న వాదన ఉంది. ఈ నేపథ్యంలో వైమానిక సైనికదళపతుల వినతులపై ప్రభుత్వం దృష్టి సారించింది. 2000 సంవత్సరంలో వాజ్‌పేయి ప్రభుత్వం యుద్ధ విమానాల కొనుగోలుకు నిర్ణయించింది. 2007లో రక్షణ మంత్రి ఎకె అంథోని 126 యుద్ధ విమానాల కొనుగోలుకు అనుమతించడంతో ప్రపంచవ్యాప్తంగా ఉన్న పలు సంస్థలు వాటిని అమ్ముతామంటూ పోటీపడటం మొదలెట్టాయి. పోటీదారు ఉత్పత్తి చేసే యుద్ధ విమానాలతో పోలిస్తే తమ యుద్ధ విమానాలు అన్నివిధాలా మెరుగైనవని ఒప్పించే ప్రయత్నం చేశాయి. ప్రధానంగా అమెరికాకు చెందిన లాక్‌హిడ్, బోయింగ్, యూరప్‌కు చెందిన యూరో ఫైటర్ టైఫూన్, డసాల్ట్, రష్యా, స్వీడన్‌కు చెందిన కంపెనీలు ఉన్నాయి. అంతిమంగా మన్మోహన్ ప్రభుత్వం 2012లో రాఫెల్ యుద్ధ విమానాల కోసం వాటిని ఉత్పత్తి చేసే డసాల్ట్ సంస్థతో ఒప్పందం కుదుర్చుకుంది.

డసాల్ట్‌తో కుదిరిన ఒప్పందం ప్రకారం రు. 1.34 లక్షల కోట్ల

వ్యయంతో 126 యుద్ధ విమానాలు కొనాలని నిర్ణయించారు. 2015కల్లా 18 విమానాలను సమకూరుస్తామని ఆ సందర్భంగా డసాల్ట్ సంస్థ పూచీపడింది. కానీ అందుకు సంబంధించిన తదుపరి చర్చల్లో ప్రతిష్టంభన ఏర్పడింది. నేరుగా 18 విమానాలు అందజేసి, మిగిలిన 108 విమానాలకు సంబంధించి సాంకేతిక పరిజ్ఞానాన్ని బదిలీచేసి బెంగళూరులోని హిందూస్థాన్ ఏరోనాటిక్స్ (ఎచ్ఎఎల్)లో వాటిని ఉత్పత్తి చేసేలా లైసెన్స్ ఇస్తామన్న డసాల్ట్ సంస్థ వెనక్కు తగ్గింది. డసాల్ట్‌తో చర్చలు జరుగుతున్న క్రమంలో తమ దేశానికి చెందిన సంస్థను ప్రాథమిక దశలోనే తొలగించారని తెలుసుకున్నాక అమెరికా తీవ్ర నిరాశకు గురైంది. భారత్‌ను ఒప్పించడంలో విఫలమయ్యారన్న అభిప్రాయం అమెరికా ప్రభుత్వానికి కలగడంలో భారత్‌లో తమ రాయబారిగా ఉన్న తిమోతి రోమెర్‌ను పదవినుంచి తప్పించారన్న కథనాలు వచ్చాయి. ఫ్రాన్స్ సంస్థ డసాల్ట్‌ను ఎంపిక చేశారని తెలిశాక బ్రిటన్, జర్మనీ, స్పెయిన్, ఇటలీ, రష్యా దేశాలకు చెందిన కన్సార్టియానికి కూడా తీవ్ర అసంతృప్తి కలిగింది. తాము ఉత్పత్తి చేసే యుద్ధ విమానాలతో పోలిస్తే రాఫెల్ ఏమంత మెరుగైంది కాదన్న ప్రచారాన్ని ప్రారంభించాయి.

2015 ఏప్రిల్‌లో మోడీ ఫ్రాన్స్ పర్యటించినప్పుడు కదలిక వచ్చింది. పాత ఒప్పందం స్థానంలో కొత్త ఒప్పందం కుదుర్చుకోవాలని ఇరు దేశాలూ నిర్ణయించుకున్నాయి. జనవరిలో ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ హోలాండ్ భారత పర్యటన సమయంలో రాఫెల్ విమానాల కోసం ఒప్పందం కుదిరింది. గతంలో యుపిఎ ప్రభుత్వం నేరుగా డసాల్ట్‌తో ఒప్పందం కుదుర్చుకోగా, అందుకు భిన్నంగా మోడీ ఫ్రాన్స్ ప్రభుత్వంతో దీన్ని ముడిపెట్టారు. 36 విమానాలు తక్షణమే అందజేయడం ఆ ఒప్పందం సారాంశం. వాటి విలువ రు. 64,000 కోట్లుగా లెక్కేశారు. అయినా తుది ఒప్పందానికి ఇన్ని రోజుల సమయం పట్టింది. ఈ 17 నెలల బేరసారాల్లో ఇది ప్రస్తుతం రు. 59,000 కోట్లకు చేరిందని రక్షణ మంత్రి మనోహర్ పరీకర్ ప్రకటించారు. అయితే తొలి విమానం మరో మూడేళ్లకు గానీ అందదు. రెండు దశాబ్దాల కాలంలో భారత్ యుద్ధ విమానాలు కొనడం ఇదే మొదటిసారి. ఇంత పెద్ద మొత్తంలో రక్షణ వ్యయం కూడ ఇదే మొదటిసారి.

రాఫెల్ యుద్ధ విమానాల ద్వారా భారత వైమానిక దళానికి బలం చేకూరుతుందని రక్షణ నిపుణులు అంచనా వేస్తున్నారు. కంటికి కనిపించనంత వేగంతో దూసుకువెళ్లే మిటిమోర్ మిస్సైల్‌ను కలిగి ఉండే ఈ జెట్ విమానం అణ్వాయుధాలను మోసుకెళ్లడంలో అగ్రగామిగా ఉంటుందని రక్షణ నిపుణులు అంటున్నారు. వీటి ద్వారా ప్రయోగించే మిటిమోర్ క్షిపణులు అత్యంత అధునాతనమైన బియాండ్ విజువల్ రేంజ్ (బివిఆర్) రకం 150 కి.మీ. దూరంలోని దృష్టి గోచర ఆవలి (గగనతలం నుంచి గగనతలంలోని) లక్ష్యాలను ఛేదించగల సామర్థ్యం కలిగి ఉన్నాయి. రాఫెల్ విమానాల ద్వారా ప్రయోగించే అణు స్కాల్ప్ క్షిపణులు 300 కి.మీ. దూరంలోని (గగన తలం నుంచి భూమిపై) లక్ష్యాలను ఛేదించగలవు. ఇజ్రాయెల్ తరహా హెల్మెట్ డిస్‌ప్లే వంటి ఎలక్ట్రానిక్ స్కానింగ్ రాడర్లను (ఎఇఎస్ఎ) కూడా ఈ విమానాలతో పాటు ఫ్రాన్స్ నుంచి భారత్ పొందనున్నది. ఈ రాడర్ల ద్వారా 130 కి.మీ. దూరంలోని శత్రు విమానాలు, క్షిపణులను గుర్తించే వీలుంది. భారత్ అవసరాలకు తగిన విధంగా విమానం డిజైన్‌లో మార్పులు చేసేందుకూ... ముఖ్యంగా లేహ్‌వంటి గడ్డకట్టే చలి ప్రాంతాల్లో కూడా అవి సమర్థవంతంగా పనిచేసేందుకూ, అలాగే పలు ఇతర సదుపాయాల కల్పనకు కూడా అంగీకరించింది.

ప్రపంచవ్యాప్తంగా ఇటీవలి కాలంలో రాఫెల్ జెట్‌ఫైటర్లను ప్రయోగించడం పెరిగింది. రాఫెల్ యుద్ధ విమానాలను సౌదీ అరేబియా, కతార్, ఈజిప్ట్ దేశాలు కొనుగోలు చేశాయి. అఫ్ఘన్, సిరియా దేశాలపై ఫ్రాన్స్ రాఫెల్ జెట్‌ఫైటర్స్ ప్రయోగించి మారణహోమం సృష్టించింది. పేదరికం, నిరుద్యోగంతో దేశాలు సతమతమవుతున్నా ఇవాళ ప్రతిదేశం రక్షణ అవసరాలపై వ్యయాన్ని బాగా పెంచడం ఆందోళనకరం. దేశాలు రుణగ్రస్థమై ప్రజల సంక్షేమాన్ని అటకెక్కించాయి. సామ్రాజ్యవాద దేశాలు ప్రజల మధ్య జాతుల పేరుతో, మతాల పేరుతో, ప్రాంతాల పేరుతో, వలసల పేరుతో యుద్ధ వాతావరణాన్ని పెంచి పోషిస్తున్నాయి.

నాలుగోతరం అధునాతన రకానికి (4 ప్లస్) చెందిన రాఫెల్.. గగన తలంలో ఎలాంటి విధులనైనా నిర్వహించగల బహుళ ప్రయోజన యుద్ధ విమానం. గగనతల రక్షణ, భూతలం, సముద్రంపై దాడులు వంటివి చేపట్టగలదు. నిఘా విధులకూ ఉపయోగ పడుతుంది. ఎక్కువదూరం ప్రయాణించే సామర్థ్యం, ఇతర ఏర్పాట్ల వల్ల అణ్వస్త్ర ప్రయోగానికీ దోహదపడుతుంది. ఈ యుద్ధ విమానాన్ని కర్బన పదార్థాలతో రూపొందించినందువల్ల రాడార్‌కు దొరికే అవకాశం తక్కువే. ఈ యుద్ధవిమాన కాక్‌పిట్ అధునాతనమైనది. పైలట్‌కు శ్రమ తగ్గించే హెడ్స్-అప్, విస్తృత హోల్‌గ్రాఫిక్ డిస్‌ప్లే వ్యవస్థలు దీని సొంతం. టచ్‌స్క్రీన్‌ల ద్వారా సమాచారాన్ని అందిస్తుంది. వివిధ సెన్సర్ల ద్వారా ఎప్పటికప్పుడు పరిసరాలకు సంబంధించిన పరిస్థితులను పైలట్‌కు తెలియజేస్తుంది. అతడి హెల్మెట్‌కూ డిస్‌ప్లే వ్యవస్థ ఉంటుంది. వీటన్నింటి వల్ల పైలట్ పనిభారం తగ్గుతుంది. రాఫెల్ విమానాలు దేశ సరిహద్దుల్లోనే ఉండి పాకిస్తాన్, చైనా టార్గెట్స్‌ను ఛేదిస్తాయి. వీటిని పాకిస్తాన్ చైనాను లక్ష్యంగా చేసుకొని హర్యానాలోని సరసావా, పశ్చిమ బెంగాల్‌లోని హసిమరా వైమానిక స్థావరాల్లో మోహరించబోతున్నారు.

ఫ్రాన్స్‌తో కుదిరిన రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు ఒప్పందాన్ని ప్రభుత్వం, రక్షణ వర్గాలు హర్షిస్తుండగా, పదవీ విరమణ చేసిన వాయుసేన అధికారులు విమర్శిస్తున్నారు. మోడీ 36 యుద్ధ విమానాలు రక్షణ అమ్ములపొదిలోకి వచ్చి చేరుతాయని చెబితే, రక్షణశాఖ మంత్రి పారికర్ చెబుతున్న ప్రకారం తొలి విమానం రావడానికే మరో మూడేళ్లు పడుతుంది. వాస్తవానికి 36 యుద్ధ విమానాలూ మన వైమానిక దళ అవసరాలకు ఏమాత్రం సరిపోవని, కనీసం వంద విమానాల అవసరం ఉన్నదని వైమానిక దళనేతలు అంటున్నారు. గత 17 నెలలుగా ఫ్రాన్స్ ఎటూ తేల్చకుండా నాన్చింది. బహుళజాతి సంస్థలు యుద్ధ విమానాలను విక్రయించినంత సులభంగా సాంకేతిక పరిజ్ఞానాన్ని విక్రయించవు. ఎందుకంటే తమ ఆధిపత్యానికి, లాభాలకు నష్టం వాటిల్లుతుందని సంకోచిస్తాయి.

రెండవ ప్రపంచ యుద్ధం ముగియక ముందే 1944లో అమెరికా జపాన్‌లోని హిరోషిమా, నాగసాకీలపై అణుబాంబులు విసిరి మారణ హోమం సృష్టించింది. ఆ తర్వాత రష్యా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, చైనా, ఇజ్రాయెల్, పాకిస్తాన్, భారత్‌లు అణు బాంబులను తయారు చేసుకున్నాయి. ఉ.కొరియా, ఇరాన్ దేశాలు ఆ ప్రయత్నంలో ఉన్నాయి.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా, సోవియట్ రష్యాలు అగ్ర రాజ్యాలుగా అవతరించాయి. ప్రపంచంలో పలు దేశాలు వలసల

నుండి స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నా, నయా వలస దోపిడీని నివారించలేక పోయాయి. గత ఏడు దశాబ్దాలుగా జరుగుతున్న దేశాల మధ్య యుద్ధాలు, పలు దేశాలలో జరుగుతున్న అంతర్యుద్ధాలు సామ్రాజ్యవాద దేశాల పుణ్యమే. 1970లో భారత్-సోవియట్ రష్యా మధ్య శాంతి సహకార ఒప్పందం కుదిరింది. 1970-90ల మధ్య భారత్‌కు అత్యధికంగా ఆయుధాలు రష్యా సరఫరా చేసింది. 1990 దశకంలో రష్యా నుంచి భారత్ 140 సుఖోయి ఎస్-30 ఎంకె ఫైటర్ జెట్‌లను కొనుగోలు చేసింది. 2000 తర్వాత ఇజ్రాయెల్ పెద్ద మొత్తంలో ఆయుధాలను భారత్‌కు విక్రయించింది.

బ్రిక్స్ దేశాల సమావేశంలో పాల్గొనడానికి గోవా వచ్చిన రష్యా అధ్యక్షులు వ్లాదిమిర్ పుతిన్‌తో అక్టోబర్ 15న జరిగిన రష్యా-భారత్ నేతల ద్వైపాక్షిక చర్చల్లో రష్యా నుంచి రు. 43 వేల కోట్ల విలువ చేసే ఐదు ఎస్-400 క్షిపణి నిరోధక రక్షణ వ్యవస్థలను కొనుగోలు చేసే ఒప్పందం కుదిరింది. 400 కి.మీ. పరిధి వరకూ దూసుకొస్తున్న క్షిపణులు, డ్రోన్లతో పాటు రహస్య విమానాలతో సహా శత్రు విమానాలనూ ధ్వంసం చేసే సామర్థ్యం గల ఈ వ్యవస్థ భద్రతకు మంచి భరోసానిస్తుందని రక్షణ నిపుణులు చెప్తున్నారు. ఎస్-400 యాంటీ మిస్సైల్ సిస్టమ్‌లో మూడు రకాల క్షిపణులుంటాయి. ఒక్కొక్క క్షిపణి వ్యవస్థ ఒక్కో రకమైన సామర్థ్యాన్ని కలిగి ఉంటుంది. ఈ మిస్సైళ్లు సూపర్‌సానిక్, హైపర్ సానిక్ వేగాలతో పయనించి 120 నుంచి 400 కిలోమీటర్ల దూరంలోని లక్ష్యాలను మార్గమధ్యంలోనే అడ్డుకుని తునాతునకలు చేస్తాయి. ఉదాహరణకు.. ఎస్400 నుంచి ప్రయోగించే 48ఎన్6డిఎం మిస్సైల్.. 250 కిలోమీటర్ల పరిధిలోని లక్ష్యాలను ఛేదించగలదు. 40ఎన్ఆర్ మిస్సైల్... 400 కిలోమీటర్ల పరిధిలోని లక్ష్యాలను ఛేదించగలదు. భూమిపై నుంచి గగనతలంలోకి ప్రయోగించగల 9ఎం96ఇ, 9ఎం96ఇ2 మధ్య శ్రేణి క్షిపణులు.. వేగంగా దూసుకొచ్చే ఫైటర్‌జెట్ ఎయిర్‌క్రాఫ్ట్‌ల వంటి వాటిని అత్యంత ఖచ్చితత్వంతో ఢీకొట్టగలవు. వీటి పరిధి 120 కిలోమీటర్లు.

ఎస్-400 ఇప్పటిదాకా ప్రపంచానికి తెలిసిన క్షిపణి నిరోధక రక్షణ వ్యవస్థలన్నింటిలోకి అత్యంత అధునాతనమైనది. దీంట్లో 8 లాంచర్లు, ఒక కంట్రోల్ స్టేషన్ ఉంటాయి. దీంట్లోని రాడార్లు 600 కిలోమీటర్ల పరిధిలో 300 లక్ష్యాలను గుర్తించగలవు. క్షిపణి వ్యవస్థలు ఏకకాలంలో 36 లక్ష్యాలను గురిపెట్టి ఛేదించగలవు. అమెరికాకు చెందిన ఎఫ్-35 వంటి ఐదో తరం స్టెల్త్ విమానాలను సైతం ఎస్400లోని 'సర్ఫేస్ టు ఎయిర్ మిస్సైల్ వ్యవస్థ రాడార్ లాక్ చేసి కుప్పకూల్చగలదని రక్షణ నిపుణులు చెబుతున్నారు. 2001 తర్వాత రష్యాతో కుదిరిన అతిపెద్ద ఒప్పందం ఇదే. వీటిలో మూడింటిని పాకిస్తాన్ సరిహద్దు వెంట, రెండింటిని చైనా సరిహద్దు వెంట మోహరించాలన్నది భారత్ వ్యూహం. అలాగే క్లిష్ట పరిస్థితుల్లోనూ దూసుకెళ్లే 200 కమోవ్ 226 టీ హెలికాప్టర్లను భారత్‌లో తయారీకి ఒప్పందం కుదిరింది.

యుద్ధాలు ప్రకృతి వైపరిత్యం కాదు. అవి మానవ దుర్బుద్ధి నుండి, ఆయుధ బేహారుల లాభాపేక్ష నుండి వస్తాయి. యుద్ధం కొందరికి వినాశనాన్ని మోసుకొస్తే మరికొందరికి లాభాలు పండిస్తోంది. అందుకే లాభం పొందే పెద్దన్నలు పోరు కోరుకుంటారు. అవసరమనుకుంటే రెచ్చగొట్టి మరీ సొమ్ము చేసుకుంటున్నారు. అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇజ్రాయెల్‌లను ఆయుధ బేహారులు అనవచ్చు. ఈ నేపథ్యంలోనే ప్రపంచ దేశాలు సైనిక పాటవం పెంచుకునే పేరుతో ఆయుధాలు కొంటున్నారు. యుద్ధాలు ఉంటేనే ఆయుధ బేహారులకు లాభాల పంట పండుతుంది. వారికి ఆయుధాలు అమ్ముకునేందుకు మార్కెట్ కావాలి. అందుకే "సామ్రాజ్యవాదం అంటే యుద్ధం" అన్నాడు లెనిన్. పాలకులు యుద్ధాన్ని కోరుకుంటారు, ప్రజలు శాంతిని కోరుకుంటారు. ఏ యుద్ధంలోనైనా ప్రజలు నిమిత్తమాత్రులే, ప్రభుత్వాలు గెలుస్తాయి. ప్రజలు ఓడిపోతారు. సామ్రాజ్యవాద దేశాలకు మార్కెట్లు కావాలి, సహజ వనరులు కావాలి, చౌకగా దొరికే శ్రామికులు కావాలి. అందుకు పలు దేశాధినేతలను తమకు అనుకూలంగా లొంగదీసు కుంటారు. వినని దేశాధినేతలను (అలెండీ, సద్దాం హుస్సేన్, గఢాఫీ) హత్య చేస్తారు. లొంగని దేశాలలో అంతర్యుద్ధాలు సృష్టిస్తారు. ప్రజాస్వామ్యం, మానవ హక్కుల పరిరక్షణ పేరుతో నేరుగా యుద్ధానికి (ఆఫ్ఘన్, ఇరాక్, లిబియా, సిరియా) దిగడం మనం చూస్తునే ఉన్నాం.

ఆసియా, పసిఫిక్ ప్రాంతంపై చైనా విశృంఖల అధిపత్యాన్ని అనుమతించబోమన్న సంకేతాన్ని అమెరికా భారత్‌లు చైనాకు ఇచ్చాయి. భారత్ అభివృద్ధి, తన ప్రయోజనాల రక్షణేకాదు. ఆసియా, పసిఫిక్ ప్రాంత విస్తృత ప్రయోజనాలు, ప్రత్యేకించి హిందు మహా సముద్ర ప్రాంతంలో అమెరికా ప్రయోజనాలని, దాని భద్రతకు భారత దేశ సైనిక శక్తిని పటిష్టం చేయడం మోడీ, ఒబామా చర్చల సారాంశమని అమెరికా ప్రతినిధి పిటిఐకి తెలుపడం గమనార్హం. అంటే భారత్ అమెరికా ప్రయోజనాలకు ఉపగ్రహంగా మారింది. దీంతో అమెరికా భాగస్వామ్య దేశంగా భారత్‌కు గుర్తింపు లభించింది. చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను జూనియర్ భాగస్వామిగా వాడుకోవాలని అమెరికా చూస్తోంది. ఆసియాలో ప్రాంతీయ ఆధిపత్య శక్తిగా, హిందుమహాసముద్రంలో ముఖ్యమైన శక్తిగా ఉండాలని భారత్ ఉబలాటపడుతోంది. అగ్రరాజ్యం కావాలన్న భారత్ ఆకాంక్ష, అందుకు ఎగదోస్తున్న అమెరికాపై అనురక్తి, అమెరికా సరసన ఉండి చైనా ఆధిక్యానికి గండి కొట్టాలన్న ఆకాంక్ష మోడీది. నిజానికి పాక్‌తో పోల్చితే భారత్ ఆయుధ సంపత్తి చాల ఎక్కువ. అయినా భారత ప్రభుత్వ నేతల యుద్ధ సన్నాహం ఫ్రాన్స్ నుంచి 59 వేల కోట్ల రూపాయలు, రష్యా నుంచి 43వేల కోట్ల రూపాయల విలువ గల అధునాతన రక్షణ కొనుగోళ్లు చేయడానికి పురికొల్పింది. మానవాభివృద్ధిలో 180 దేశాలల్లో 130 స్థానంలో ఉన్న భారత్ రక్షణ వ్యయం ఇంతగా చేయాల్సిన అవసరముందా? ఇరుగు పొరుగు దేశాలతో శాంతి, సహకారం, పరస్పర గౌరవం వంటి పంచశీల విలువలు పాటించకుండా దక్షిణాసియాలో ఉద్రిక్తతకు తావియ్యడం అనుచితం.

యుద్ధం ఎక్కడ జరిగినా అక్కడ నష్టపోయేది ప్రజానీకమే. గత కొన్ని దశాబ్దాలుగా యుద్ధాలతో అట్టుడికిపోయిన దేశాలే (అఫ్ఘన్, ఇరాక్, లిబియా, సిరియా) అందుకు ఉదాహరణ. అయినా భారత్ పాకిస్తాన్‌లు సైనిక బడ్జెట్‌ను అంతకంతకు పెంచుకుంటూ పోవడంవల్ల ఇరు దేశాల్లోని ప్రజానీకం అత్యంత అమానవీయ పరిస్థితుల్లో, పేదరికంలో జీవించాల్సి వస్తోందని అమెరికాకు చెందిన 'అట్లాంటిక్ కౌన్సిల్' చెప్తోంది. పాకిస్తాన్‌లో 19 కోట్ల జనాభా ఉండగా 21 శాతం మంది రోజుకి కేవలం 83 రూపాయలతో బతుకులీడుస్తున్నారు. భారత్‌లో 126 కోట్ల మంది ఉండగా వారిలో 23 శాతం మంది అదే ఆదాయంతో బతుకుతున్నారని 'కౌన్సిల్' వెల్లడించింది. 2015లో ప్రపంచవ్యాప్తంగా ఆయుధాల కొనుగోలులో 10 శాతం వెచ్చిస్తే ప్రపంచంలోని ఆకలి బాధను 15

# విధ్వంసకర దోపిడీకి తెరతీసిన జియో

***ఉచిత కాల్స్, ఇంటర్నెట్ సేవల పేరుతో ముందుకు వచ్చిన రిలయన్స్ జియో అన్ని మొబైల్ సేవలకు డాటాను లింక్ చేస్తూ వినియోగదారుడికి తెలియకుండానే దోచుకుంటుందని అంటున్నారు ఎ. పున్నయ్య***

ఆశ్చర్యకరంగా చాలాకాలంగా సమాచార వ్యవస్థ ప్రకటనల్లో ఒక మాట వినపడుతుంది. 'అపరిమితంగా, ఫ్రీగా మాట్లాడుకోండి' అని. దీని అర్థం మనుషులు పరస్పరం సరిగ్గా మాట్లాడుకోవడం లేదని, ఈ విషయం తెలిసిన మేధావి ఎవరో మీరు అపరిమితంగా ఫ్రీగా మాట్లాడుకోండి అని మానవ సంబంధాలు పునరుద్ధరించే మహాత్కార్యానికి పూనుకున్నాడంటే పొరపాటే. మరొక అడుగు ముందుకేసి ఆలోచిస్తే మనుషులెవరు ఇప్పుడు మాట్లాడుకునే స్థితిలో లేరని, పాపం మనోగతాలెరిగిన మనం ఐనా చెప్పకపోతే ఎలా? అని చెప్పినట్లు ఆ ప్రకటనలోని లక్ష్యార్థం బాధిస్తుంది. ఇట్లాంటి మాటలన్నీ కార్పొరేట్, సామ్రాజ్యవాద మల్టీనేషన్స్ కంపనీల దోపిడీ ఆలోచనల నుంచి పుట్టిన అత్యల్ప స్థాయి వినియోగదారుల వినిమయశక్తిని పెంచి, 'ముంచే' పద్మవ్యూహం తప్ప మరొకటి కాదు.

**సమాచార వ్యవస్థ పూర్వాపరాలు**

పూర్వం సమాచార మాధ్యమంగా మనుషులు, లేఖలు అందుబాటులో ఉండేవి. సాంకేతిక విప్లవం పురుడు పోసుకున్న తొలినాళ్లలో దూర ప్రాంతాల మనుషులకు సమాచారాన్ని చేరవేయడానికి టెలిగ్రాఫ్ (1844), టెలిస్కోప్ (1876) యంత్రాలు అందుబాటులోకి వచ్చాయి. టెలిగ్రాఫ్ లిఖితపూర్వక సమాచారాన్ని మాత్రమే అందిస్తే, గ్రహంబెల్ తంతి ద్వారా సమాచారాన్ని పంపే వ్యవస్థకు రూపకల్పన చేసినాడు. దాదాపుగా శతాబ్దకాలం తర్వాత 1973 నుండి వైర్‌లెస్, విల్‌ఫోన్, సెల్‌ఫోన్‌లు సామాజిక ఆర్థిక రంగాల్లో ముందున్న వారి చేతికి అందాయి. దాదాపుగా మూడు దశాబ్దాల తర్వాత (2003) సెల్‌ఫోన్ ద్వారా సమాచార సేవలు సామాన్యులకు అందుబాటులోకి వచ్చాయి. 120 సంవత్సరాల సమాచార వ్యవస్థ చరిత్రలో లేని అసాధారణ ప్రగతి 2003 నుండి ఒక దశాబ్ద కాలంలోనే పెను సంచలనాన్ని సృష్టించింది. సామాచార వినిమయానికి ఈ సెల్‌ఫోన్‌ల వాడకం ఎంతదూరం వెళ్లిందంటే, సెల్‌ఫోన్ వినిమయ ఒరవడిలో పడి పాత కొత్తతరంతో పాటు అక్షరాస్యతతో సంబంధం లేకుండా ఇంటిలో మరుగుదొడ్డి లేకున్నా ఇంట్లో మనిషికి రెండు సిమ్‌కార్డులతో సెల్‌ఫోన్ వినియోగస్థాయికి చేరింది. బతుకుతెరవు లేని సంచారజీవుల జోలెలో సైతం సెల్‌ఫోన్ మోగేలా సెల్‌ఫోన్ వ్యవస్థ మార్కెటీకరించబడింది.

ఈ మార్కెట్‌లో వినియోగదారుల సేవల పేరిట సమాచార రంగంలోని వివిధ కార్పొరేట్, పెట్టుబడిదారి బహుళజాతి సంస్థల పరస్పరం లాభాల వేటలో పోటీపడ్డాయి. ఈ సమాచార మార్కెట్లో తనకంటూ స్థిరమైన వినియోగదారులను సంపాదించుకునే దిశలో ఫ్రీకాల్స్, అదనపు టాక్‌టైమ్ పేరుతో ఆకట్టుకునే ప్రయత్నం ముమ్మరం చేశాయి. ఈ క్రమంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, సమాచార సాంకేతిక విప్లవం మరింత అందుబాటులోకి రావడంతో సెల్‌ఫోన్ నెట్‌వర్క్ సిగ్నల్స్ ప్రసారం చేసే జిఎస్‌ఎమ్ (గ్లోబల్ సిస్టమ్ ఫర్ మొబైల్ కమ్యూనికేషన్స్), సిడిఎంఎ (కోడ్ డివిజన్ మల్టిపుల్ ఎక్సెస్) అనే రెండు ఒకే వేగంతో పని చేసే వేరువేరు టెక్నాలజీలు అందుబాటులోకి వచ్చాయి. ఈ టెక్నాలజీతో 3జి సేవలు అప్పటికే అందుబాటులో ఉన్న రేడియో సిగ్నెల్స్ ఆధారంగా వాయిస్ కాల్స్ మాత్రమే అందించాయి. 1జి సేవలలో ఎస్ఎంఎస్ సౌకర్యం కూడ లేదు. దీని స్థానంలో వచ్చిన 2జి ప్రపంచవ్యాప్తంగా సెల్‌ఫోన్ నాణ్యమైన, వేగవంతమైన సేవలతో అందుబాటులోకి వచ్చింది 3జి నెట్‌వర్క్. ఈ 3జి నెట్‌వర్క్ మొబైల్ ఫోన్లలో ఇంటర్‌నెట్ వినియోగానికి తెరదీసింది. దీనితో ప్రపంచవ్యాప్తంగా స్మార్ట్‌ఫోన్‌లు వినియోగంలోకి రావడానికి 3జి టెక్నాలజీ కారణమైంది. దీనికి కొనసాగింపుగా ఫేస్‌బుక్, ట్విట్టర్, వాట్సప్ వంటి సామాజిక మీడియాతో పాటు ఎన్నోరకాల ఆన్‌లైన్ సేవలు మొబైల్ ఫోన్‌లోకి వచ్చినాయి. స్మార్ట్‌ఫోన్‌ల వినియోగం పెరిగిన తర్వాత మరింత వేగవంతమైన టెక్నాలజీ అవసరం మేరకు 3జి వచ్చిన అతి స్వల్ప కాలంలోనే 4జి ఎల్‌టిఇ టెక్నాలజీతో ముందుకు వచ్చింది. ఈ ఎల్‌టిఇలో

---

ఏళ్ల పాటు తీర్చవచ్చున్నది స్వీడన్‌కు చెందిన స్టాక్‌హోమ్ ఇంటర్నేషనల్ పీస్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (సిప్రి) ఆవేదన వెలిబుచ్చింది. ఆయుధాలు ఉన్నంత మాత్రాన భద్రత చేకూరుతుందన్నది కేవలం భ్రమ. సామరస్యం తో కూడిన చర్చలు, స్నేహపూరిత వాతావరణంలోనే అది సాధ్యం!

మోడీకీ, సంఘ్‌పరివార్ విస్తరణ వాదానికి (అఖండ్ భారత్ నినాదానికి) ఇటీవలి ఉడీ సంఘటన ఒక సాకుగా దొరికింది. హిందుత్వ వాదులు పాకిస్తాన్‌పై యుద్ధానికి కాలు దువ్వుతున్నారు. ఇదే సమయంలో ఆసియా యవనికపై భౌగోళిక రాజకీయాల పరంగా మౌలికమైన మార్పు చోటు చేసుకుంది. ఇంతకాలం పాకిస్తాన్‌ను పావుగా వాడుకున్న అమెరికా దాన్ని పక్కనపెట్టి భారత్‌ను పావుగా వాడుకోజూస్తున్నది. ఫలితంగా రష్యా, చైనాలకు సన్నిహితంగా పాకిస్తాన్ మారనుంది. అమెరికా చైనాకు వ్యతిరేకంగా పావులు కదుపుతుంటే, భారత్ పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా పావులు కదుపుతుంది. రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలుతో భారత్ సైనికంగా పాకిస్తాన్ సైనిక శక్తిని అధిగమించవచ్చుగాని, చైనా సైనిక శక్తిని అధిగమించగలదా? ఆసియాలో యుద్ధం సంభవిస్తే పరిస్థితులు ఎంత భయంకరంగా ఉంటాయోనన్న ఆందోళన సర్వత్రా వ్యక్తమవుతుంది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

(లాంగ్ టర్మ్ ఎవల్యూషన్) కేబుల్ ద్వారా అందే బ్రాడ్‌బ్యాండ్ వేగం కన్నా మరింత వేగంగా ఇంటర్‌నెట్‌ను అందించగలగడం మెరుగైన విషయమైతే వాయిస్ కాలింగ్ మాత్రమే ఉండడం ఎల్‌టిఇ టెక్నాలజీ పరిమితి. ఈ పరిమితిని అధిగమించి విఒఎల్‌టిఇ (వాయిస్ ఓవర్ లాంగ్ టర్మ్ ఎవల్యూషన్) అనే నూతన టెక్నాలజీని అభివృద్ధి చేశారు. ఈ టెక్నాలజీతో వాయిస్ కాల్స్‌తో పాటు అత్యంత వేగవంతమైన ఇంటర్‌నెట్‌ను నాణ్యంగా అందించడం దీని ప్రత్యేకత. ఈ 4జి విఒఎల్‌టిఇ టెక్నాలజీతో వాయిస్ కాల్స్, ఇంటర్‌నెట్ బ్రాడ్‌బ్యాండ్ సేవలతో కొనసాగుతున్న క్రమంలో 'డేటా'ను ఉపయోగించి వాయిస్ కాల్స్‌తో పాటు ఇంటర్‌నెట్, ఫేస్‌బుక్, ట్విట్టర్, వాట్సప్ తదితర సేవలను అందించే టెక్నాలజీని రిలయన్స్ 'జియో' పేరుతో మార్కెట్‌లోకి దూసుకొచ్చింది.

**రిలయన్స్ జియో సృష్టి**

సమాచార వ్యాపార రంగంలో ల్యాండ్‌లైన్ నుండి మొదలుకొని భారత ఎయిర్‌టెల్, ఐడియా, ఒడాఫోన్ వంటి సంస్థలకు ప్రాథమిక, ప్రధాన వనరులైన వాయిస్‌కాల్స్‌పై సంపాదించే కోట్లాది రూపాయల లాభాలను కనీస ఆదాయమే కాదని డేటా ఉపయోగంతోనే లక్షల కోట్లు అర్జించాలనే వ్యూహంలో భాగంగా విఒఎల్‌టిఇ టెక్నాలజీని కోట్ల రూపాయలతో అభివృద్ధి పరిచి, సమాచార మార్కెట్లో ప్రస్తుతం ఉన్న సంస్థలను అణగదొక్కడానికి పోటీని ఆహ్వానిస్తూనే, పోటీ పడలేని స్థితికి నెట్టివేస్తూ టెలికం వ్యవస్థను శాసించే దిశగా ఆవిర్భవించిందే 'రిలయన్స్ జియో' తన వ్యూహాన్ని అమలు పరచడానికి ప్రధాని నరేంద్ర మోడీ ప్రకటించిన స్టార్ట్ అప్‌ను ఉపయోగించుకొని దేశంలో టెలికం సేవల కొరకు మూడు నెలల అత్యల్పకాలంలో సుమారు 100 మిలియన్‌ల వినియోగదారుల లక్ష్యంతో రు. 1,50,000 కోట్ల పెట్టుబడితో డిజిటల్ ఇండియా సృష్టికి భారీ వ్యూహాత్మక పునాదిని నిర్మించుకోవడం టెలికం రంగంలోనే 'పెను విప్లవాన్ని' సృష్టించింది. అత్యంతవేగంగా వినియోగదారులను తాను పన్నిన నెట్‌లోకి ఆకర్షించడానికి సిమ్‌కార్డుతో పాటు జీవిత కాలం వాయిస్ కాల్స్ ఉచితం అంటూ అత్యంత వేగంగా ప్రసారమయ్యే ఇంటర్‌నెట్ రకరకాల డౌన్‌లోడ్స్ 2016 డిసెంబర్ 31 వరకు డేటా ఆధారంగా ఉచితంగా అందివ్వనున్నట్లు 42వ రిలయన్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ (ఆర్ఐఎల్) వార్షిక సర్వసభ్య సమావేశంలో సెప్టెంబర్ 5న ముఖేశ్ అంబాని ప్రకటనతో రిలయన్స్ జియో ఇన్ఫోకం తన వాణిజ్య కార్యకలాపాలను ప్రారంభించింది. ఈ సందర్భంగా అంబానీ ప్రారంభ ప్రసంగంలో జియో ప్రయోజనాలను ప్రస్తావిస్తూ అపరిమిత అంతర్జాల వినియోగాన్ని పండుగ దినాల్లో ఎటువంటి అదనపు ఛార్జీలు లేని సౌకర్యాన్ని విద్యాసంస్థలకు, తదితరాలకు ఉచితంగా అందిస్తామని ప్రకటించాడు. మొత్తం భారతదేశ జనాభా 1.2 బిలియన్‌లు. ఒక బిలియన్ వినియోగదారులను చేజిక్కించుకునే లక్ష్యంతో ప్రారంభించిన వ్యూహానికి సంస్థ ఊహించని స్పందన వెల్లువలా ఉప్పొంగింది. సామాన్యులతో పాటు, విద్యావంతులు, టెక్నాలజీ ఉపయోగించడంలో నైపుణ్యం కలిగిన మేధావి వర్గం వరకు. దేశ రాజధాని నగరం ఢిల్లీతో పాటు ఐటి రంగానికి పెద్దపీట వేసిన బెంగుళూర్ వంటి మెట్రోపాలిటన్ నగరాల్లో రిలయన్స్ అవుట్‌లెట్స్ ముందు బారులు కట్టి రు. 1000 వరకు పెట్టి ఉచిత సిమ్‌ను పొందడానికి ఎగబడ్డారు. రిలయన్స్ జియో కేవలం 'డేటా' ప్రధానంగా టెలికం సేవలు అందించడానికి జనవరి 1, 2017 నుండి ఒక ఎంబి (మెగాబైట్స్)కి 5 పైసలు మాత్రమేనని, 1 జిబి (గీగాబైట్స్) డేటా రు. 50కి అందించనున్నట్లు, పైగా విద్యాలయాల్లో 25 శాతం అధిక డేటాను అందించనున్నట్లు వినియోగదారులను 'డేటా'గిరికి మార్చుకునే ప్రయత్నం మొదలు పెట్టింది.

**జియో ప్రకటనతో జరిగే పరిణామాలు**

ఇటీవల దేశంలో జరిపిన ఒక సర్వే ప్రకారం టెలికం సేవల వినియోగంలో కేవలం 15 శాతం మాత్రమే అవసరానికి డేటాను వినియోగిస్తున్నారు. మిగిలిన 85 శాతం ప్రజలు వినోదానికి, కాలక్షేపానికి, దుర్వ్యసనాలకు వినియోగిస్తున్నారు. జియో పరిణామంతో 85 శాతం ప్రజలు ఆకర్షణకు లోనయ్యే అవకాశం మెండుగా ఉంది. తాత్కాలిక ప్రయోజనాలను ఆశించే సామాన్యుల మస్తిష్కాలలో జియో అందించే ఉచిత వాయిస్ కాల్స్ మాత్రమే ఉంటాయి. ఈ ఉచిత వాయిస్ కాల్స్ డేటా అందుబాటులో ఉంటే తప్ప సెల్‌ఫోన్ కూడా వినియోగించ లేమని ఇన్‌కమింగ్, ఎస్ఎంఎస్, వాట్సాప్, ట్విట్టర్ లాంటి సౌకర్యాలేవి పొందలేమనే సంగతి గ్రహించలేరు. కాని ఈ మూడు నెలలకాలంలో జియో అందించే డేటా ప్రయోజనాలతో నెట్, లైవ్ న్యూస్, స్కైప్, వీడియో కాల్స్, గేమ్స్, స్పోర్ట్స్, సినిమాలు, పాటలు, అశ్లీలతలను ఆస్వాదించిన వినియోగదారులు జియోకు బానిసలుగా మారే అవకాశముంది. ఈ సేవలను అందుకోవడానికి 2జి, 3జిలలో ఉన్న వినియోగదారులు 4జి లోకి రావడానికి విధిగా స్మార్ట్‌ఫోన్ కొనుగోలుకు అనివార్యంగా నెట్టబడుతున్నారు. జియో అందించే డేటా బేస్‌డ్ 4జి సేవలు కేవలం విఒఎల్‌టిఇ టెక్నాలజీతో స్మార్ట్‌ఫోన్‌లో మాత్రమే పొందే అవకాశం ఉన్నందున కేవలం వాయిస్ కాల్స్‌తో సెల్‌ఫోన్ సేవలను అనుభవిస్తున్న సామాన్యులు సహితం పై అలవాట్లతో స్మార్ట్‌ఫోన్‌లు కొనాల్సిన దుస్థితి దాపురించింది. ఇక్కడే జియో బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడి విధానం బట్టబయలవుతుంది. లేని, అవసరంకాని ఒక అలవాటును సృష్టించి దానిని తదనంతరం అవసరంగా, వ్యసనంగా పరిణామం చెందించి దానిని సొమ్ము చేసుకునే కుట్రే ఈ సామ్రాజ్యవాదుల బహుళజాతి సంస్థల లక్ష్యం. ఈ ఉచ్చులో చిక్కుకున్న వినియోగదారులు, బయటకు రాలేక అందులో ఉండలేక ఒకవైపు ఆర్థికంగా, మరోవైపు మానసికంగా తీవ్ర సంఘర్షణకు గురి అయ్యే ప్రమాదం ఉంది.

**జియో ద్వారా ఉత్పన్నమయ్యే సమస్యలు**

జియో ధాటికి అలవాటు పడుట వలన ఉన్న సెల్‌ఫోన్‌లను ప్రక్కకు పెట్టి స్మార్ట్‌ఫోన్‌లను కొనుగోలు చేయడం వినియోగదారుని నెత్తిన అదనపు ఆర్థికభారం కాగా ఇప్పటికే గుట్టలుగా పేరుకున్న ఇ-వేస్ట్ (ఎలక్ట్రానిక్ వేస్ట్) మరింత పెరిగే అవకాశం ఉంది. పూర్తి కార్యకలాపాలు డేటాతో స్మార్ట్‌ఫోన్‌ల వినియోగం వల్ల ఆరోగ్యాలపై తీవ్ర రేడియేషన్ సమస్య ఉత్పన్నమయ్యే అవకాశముంది. ఇప్పటికే గృహ అవసరమై కూర్చున్న టివిలు కుటుంబ సంబంధాలను దెబ్బతీస్తున్న క్రమంలో నెట్ సౌకర్యం, ఇ – డేటా వినియోగం తీవ్రతరం కావడం వల్ల కుటుంబంలోని వ్యక్తులు పిల్లలు పరస్పరం ఒకే గూటిపక్షులైనా ఏకాకి జీవితానికి దిగజారుతుంది. ఇదే సందర్భంలో దెబ్బతిన్న మానవ సంబంధాలతో పాటు విడాకుల సమస్యలు కూడ ఉత్పన్నమౌతున్నాయి. చివరకు మనిషి మనుగడలో లేకుండాపోతాడు. డేటాకు అలవాటు పడిన 85 శాతం మందిలో యువత పెడధోరణి పట్టే అవకాశం అధికంగా ఉంది. దీని

ప్రభావంతో మానవ సంబంధాలు దెబ్బతింటున్నాయి. సెల్‌ఫోన్ అడిక్ట్ కావడం వల్ల రోడ్డు ప్రమాదాలు తీవ్రమౌతున్నాయి. జియో చూపిన ఆకర్షణలో సంస్థకు లాభాలు తప్ప దీర్ఘకాలికంగా వినియోగదారుల ప్రయోజనాలేవి కనబడవు. సాధారణంగా సెల్‌ఫోన్ వినియోగదారునికి వాయిస్ కాల్స్ ఉచితం అయినప్పటికీ, వినియోగించే డేటా ఖర్చు సగటున 7 నుండి 8 పైసలకు ఒక కాల్ పల్స్ ఖర్చు ఉంటుంది. ఇక్కడ గమనించాల్సింది ఉచిత వాయిస్ కాల్స్ కూడా డేటా నుండి పరోక్షంగా డబ్బులు ఖర్చు అవుతూనే ఉన్నాయి. ఇన్‌కమింగ్ కాల్స్‌కు, ఎస్ఎంఎస్, వాట్సాప్ తదితరాలంటే డేటా ఆన్‌లో ఉండాలి. లేనిచో కనీసం ఈ సౌకర్యాన్ని పొందలేని సమస్య ఉత్పన్నమౌతుంది. వినియోగదారుడు ఎదుర్కొనే మరొక సమస్య స్మార్ట్‌ఫోన్ కొనుగోలు. జియో అందించే 4జి నెట్‌వర్క్ కొరకు ఒక వినియోగదారుడు ఒక 4జి స్మార్ట్‌ఫోన్ కొనుగోలు చేయాల్సి వస్తుంది. ఇందుకోసం కనీసంగా 3 వేల నుండి ఖర్చు చేయాల్సి వస్తుంది. ఈ కొనుగోలు కోసం అంతర్గత ఒప్పందంలో భాగంగా సంగీత్, సామ్‌సాంగ్, నోకియా, బిగ్‌సి లాంటి కంపెనీల ద్వారా 4జి జియో సిమ్‌ను అనుసంధానం చేస్తూ విక్రయించుకునేలా చేసుకొని తద్వారా ఈ వినియోగాల నుంచి వచ్చే లాభాల్లో ఆ సెల్‌ఫోన్ కంపనీల నుండి కొంత మొత్తాన్ని తానుకూడా పొందేలా ఒప్పందం చేసుకొని ఉచితంగా ఇస్తున్నామని చెప్పి 'జియో' సిమ్ తయారి ఖర్చును కూడా పరోక్షంగా రాబట్టుకుంటుంది. జియో సిమ్ స్మార్ట్ ఫోన్‌ల వ్యాపారంలో దాదాపుగా 3 లక్షల కోట్ల రూపాయలు వినియోగదారుల నుండి సెల్‌ఫోన్ కంపెనీలకు చేరుతాయి. ముందు చేసుకున్న ఒప్పందం ప్రకారం ఈ కంపనీలు 'రిలయన్స్ జియో' వాటాను చెల్లించాల్సిందే. దానితో రిలయన్స్ ప్రాథమిక పెట్టుబడిని పూడ్చుకునే అవకాశం ఉంది. జియో పోటీని తట్టుకోలేక ప్రస్తుతం ఉనికిలో ఉన్న ఎయిర్‌టెల్, ఐడియా లాంటి టెలికం సంస్థలు మార్కెట్ నుండి నిష్క్రమిస్తే రిలయన్స్ జియో ఏకస్వామ్యంగా మారి ధరలను పెంచుకుంటుంది. ప్రస్తుతం జియో ప్రకటించిన పది డేటా ప్లాన్‌లను పరిశీలిస్తే ఈ విషయం అర్థమౌతుంది.

**టెలికం రంగంపై నియంత్రణ కోల్పోతున్న ప్రభుత్వాలు**

ఈ జియో సృష్టించిన సునామిలో పడ్డ మిగిలిన టెలికం సంస్థలు జియోను అడ్డుకునే ప్రయత్నం చేసినాయి. ఏ రంగంలోనైనా వ్యాపార ప్రారంభానికి దాని విస్తృతి కోసం అనారోగ్యకర పోటీని పెట్టుబడుల పరిమితిని నియంత్రించడానికి, లైసెన్సింగ్ ఇవ్వడానికి దేశంలో ఎంఆర్‌టిపి వంటి చట్టాలు రూపొందించబడ్డాయి. సామాన్య ప్రజలకు నష్టదాయకమైన సందర్భంలోను ఒక రంగంలోని విభిన్న సంస్థలు తమ మధ్యపోటీతో ఉనికి కోల్పోయే ప్రమాదం ఉన్నప్పుడు ఈ ఎంఆర్‌టిపి ద్వారా ఆయా కంపెనీలను నియంత్రించేది. కాని 1980లో ఇందిరాగాంధీ ఈ చట్టంలో కొన్ని సడలింపులను చేర్చింది. అనంతరం రాజీవ్ గాంధీ మరికొన్ని నిబంధనలను ఎత్తివేయగా 1991లో పి.వి. నరసింహారావు సరళీకరణ విధానాలతో ఈ చట్టం మట్టికొట్టుకుపోయింది. దీనితో సేవా రంగాలలో ఏకస్వామ్య విధానం మరింతగా పెరిగి పోయింది. ఈ క్రమంలో జియో సృష్టించిన అనారోగ్యకర పోటీని నియంత్రించాలని సెల్యులర్ ఆపరేటర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా (సిఒఎఐ) వారు అమల్లో ఉన్న నిబంధన ప్రకారంగా ఏ సంస్థ అయినా ఉన్న ధరలను తగ్గించరాదని, నూతనంగా మార్కెట్ కోసం ధరలు తగ్గించుట నేరమని డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికమ్యునికేషన్స్ (డిఓటి)కు ఫిర్యాదు చేసింది. దీని ప్రకారం దీర్ఘకాలంలో ధరలు వినియోగదారులను నష్టపరుస్తాయని పేర్కొన్నారు. నేడు అమెరికాలో ఉన్న షెర్మన్ చట్టం ప్రకారం ఇతర ప్రత్యామ్నాయ కంపెనీలను నష్టపరిచే సంస్థలు కొద్దికాలంలోనే వినియోగదారులను దోచుకుంటాయని ఆ సంస్థలను నియంత్రిస్తుంది. కాని మనదేశంలో 2002 కాంపిటిషన్ యాక్టు ప్రకారం ఉత్పత్తి వ్యయం కన్నా తక్కువ ధరకు వస్తుసేవలను అందించి పోటీ సంస్థలను మార్కెట్ నుండి నిష్క్రమింప జేయవచ్చునని చెపుతుంది. ఈ చట్టం నేరుగా వినియోగదారులను దీర్ఘకాలంలో దోపిడి చేయడానికి వీలు కల్పిస్తుంది. డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెలికమ్యునికేషన్స్ తన అధికారంతో నిబంధనలను పాటించని సంస్థలను కట్టడి చేయడంలో విఫలమయిందని మే 8, 2015న కాగ్ తన తుది నివేదికను పార్లమెంట్‌కు సమర్పించింది. ఇటీవల టెలికామ్ రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా (టిఆర్ఎఐ) కూడా నిబంధనల ప్రకారం జియో నడుచుకోలేదని తెలిపింది. చట్టంలో లోపాలను ఆసరాగా చేసుకొని టెలికం రంగంలో డేటా వినియోగంతో బహుముఖంగా వినియోగదారులను దోచుకుంటుంది. ప్రభుత్వం వినియోగదారుల ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోకుండా స్టార్ట్‌అప్‌ల పేరుతో ముందుకొచ్చిన రిలయన్స్ దోపిడీని నియంత్రించలేక చేతులెత్తేసింది.

**ముగింపు**

పోటీ ప్రపంచంలో ఏ సంస్థ కూడా దీర్ఘకాలిక లాభాలను వినియోగదారులకు అందించలేదు. పైగా దీర్ఘకాలికంగా నష్టపోవడానికి సిద్ధంగా ఉండదు. ఉదా.. పత్రికారంగంలో ఒక రూపాయికే కలర్ ఫోటోలతో దినపత్రిక అందిస్తామని మార్కెట్‌లోకి వచ్చిన సాక్షి తర్వాత కాలంలో అదే పత్రిక అందరి కంటే ముందే రు. 5కు పెంచి అందరిని పెంచుకునేలా చేసింది. అదే విధంగా 'డేటా' వినియోగంలో ఉచితకాల్స్ అంటూ ముందుకు వచ్చిన జియో అన్ని సేవలకు డేటాను లింకు చేస్తూ వినియోగదారునికి తెలియకుండానే దోచుకోవడం మొదలు పెడుతుంది. అతి కొద్ది కాలంలోనే అన్ని సంస్థలు ఒకే రేటు డేటా వినియోగం అందుబాటులోకి రాక తప్పదు. ఆ ఉమ్మడి దోపిడీకి రిలయన్స్ మార్గదర్శకత్వం వహిస్తుంది. తన దోపిడీ విధానాలకు ఈ కార్పొరేటు శక్తులు ప్రభుత్వాలను శాసించే స్థాయికి ఎదగడం మరింత విచారకరం. ఈ దేశ అత్యున్నత బ్యాంకింగ్ వ్యవస్థ రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్‌గా తన బావమరిదిని కూర్చోబెట్టగలిగిన రిలయన్స్ తన వ్యాపార రంగానికి అనుకూలమైన విధానాల రూపకల్పనకు కూడా నిర్దేశిస్తుంది. తన ఆర్థిక బలంతో ప్రభుత్వాలను కీలుబొమ్మలుగా చేసుకొనే చాణక్య నీతిలో రిలయన్స్ ఇప్పటికే ఆరితేరింది. అన్ని రంగాలలో తనదైన ముద్రను సంపాదించుకున్న రిలయన్స్ వినియోగదారులకు సంస్థపై ఉన్న విశ్వాసాన్ని సొమ్ము చేసుకోవడానికి టెలికం రంగాన్ని ఎంచుకుంది. అంతే తప్ప భారతదేశంలో ఉన్న కోట్లకొలది వినియోగదారుల మీద ప్రేమతో కాదన్న సత్యాన్ని ప్రజలు గ్రహించాల్సి ఉంది. ఉచితం మాటున సాగే విధ్వంసకర దోపిడీని అర్థం చేసుకోవాల్సిన తక్షణ అవసరం వినియోగదారునిదే.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం)*

వీ

# ద్వంద్వ విలువలు - రాజ్యం

***కశ్మీర్ సమస్యను బూచిగా చూపి పాలకులు తమ రాజకీయ అవసరాల కోసం యుద్ధాన్ని కోరుకుంటుంటే ప్రజలు శాశ్వత పరిష్కారం కోసం పోరాడుతున్నారని అంటున్నారు*** **రాజేంద్రబాబు అర్విణి**

దేశ చరిత్రలో కొన్ని సంఘటనలు యాదృచ్ఛికంగా జరిగి ఉంటే బాగుండుననిపిస్తుంది. ఒకదాని వెంట ఒకటి జరిగిన కొన్ని సంఘటనలు వేటికవి జరిగాయని, వాటి మధ్య సంబంధం ఉండే అవకాశం లేకుంటే బాగుండుననిపిస్తుంది. అలాంటిదే ఒకటి పఠాన్‌కోట్ సంఘటన. క్రితం సంవత్సరం డిసెంబర్ 25న పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్‌కు జన్మదిన శుభాకాంక్షలు తెలపడానికి భారత ప్రధాని నరేంద్రమోడీ అకస్మాత్తుగా లాహోర్ వెళ్లడం, ఆ తర్వాత వారం రోజులకే పఠాన్‌కోట్ పరిణామం జరగడం సహజంగానే కొన్ని అనుమానాలకు దారితీసింది. భారత పాకిస్తాన్ దేశాల మధ్య సామరస్య పూర్వక ధోరణికి సానుకూల వాతావరణం ఏర్పడినప్పుడల్లా ఇలాంటిది ఏదో ఒక సంఘటన జరగడం పరిపాటిగా వస్తున్నది. అయితే ఈసారి నరేంద్రమోడీ తనకుతానే స్నేహ హస్తం చాచడం అంతర్గతంగా కొన్ని శక్తులకు గిట్టలేదని, ఆ సానుకూల వాతావరణాన్ని కలుషితం చెయ్యడానికి పఠాన్‌కోట్ పన్నాగం పన్నారని కొన్ని వదంతులు వినిపించాయి. అందుకు తగ్గట్టుగానే సల్విందర్ సింగ్ అనే పంజాబ్ పోలీసు అధికారిని తీవ్రవాదులు కిడ్నాప్ చేసి ఆయన వాహనాన్ని వాడుకొని తదుపరి ఆయనకు ఎలాంటి హాని తలపెట్టకుండా వదిలిపెట్టారని కథనాలు వెలువడ్డాయి. ఇలాంటి కథనాల వల్ల ప్రజలలో అనుమానాలు రేకెత్తడం సహజం. జాతీయ పరిశోధనా సంస్థ ఆయనను నిర్దోషిగా ప్రకటించినా, ఆయన నిర్దోషిత్వం భారత పాకిస్తాన్ సరిహద్దుల్లో మాదక ద్రవ్యాల సరఫరాకు సంబంధించిందే కానీ, అందులో అసలు ఉగ్రవాద దాడి ఉసేలేదు. ఈ విషయంలో ప్రజలకు సమాధానం దొరకని కొన్ని ప్రశ్నలు అలానే మిగిలిపోయాయి.

అలానే, 2016 సెప్టెంబర్ 18న జరిగిన ఉడీ సంఘటన. జమ్ము-కశ్మీర్ రాష్ట్రంలోని ఉడీ పట్టణ సమీపంలోని సైనిక స్థావరంపై జైష్-ఎ-మహమ్మద్ అన్న తీవ్రవాద సంస్థ సభ్యులుగా భావిస్తున్న నలుగురు దాడిచేసి, 17 మంది భారత సైనికుల మరణానికి కారకులయ్యారు. ఆ తర్వాత మరి ఇద్దరు సైనికులు తీవ్ర గాయాలతో హాస్పిటల్లో మరణించారు. ఆ విధంగా మొత్తం 19 మంది భారత సైనికులు ఊచకోతకు గురయ్యారు. ఇది సెప్టెంబర్ 18న జరిగింది. సెప్టెంబర్ 21న ఐక్యరాజ్య సమితి సభ్యదేశాల 71వ సమావేశంలో సాధారణ చర్చ సందర్భంగా పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ ప్రసంగించబోతున్నాడు. (ఈ ప్రసంగం గురించే ప్రధాని నరేంద్ర మోడీ కోజీకోడ్లో జరిగిన బిజెపి సమావేశంలో మాట్లాడుతూ "ఉగ్రవాదులు రాసి ఇచ్చిన ఉపన్యాస పాఠాన్ని నవాజ్ షరీఫ్ ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో చదివాడ"ని ఎద్దేవ చేశాడు) ఆయన కశ్మీరు సమస్య గురించి, కశ్మీరులో జరుగుతున్న మానవహక్కుల హననం గురించి ప్రస్తావించడం తథ్యం. ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో 193 దేశాలకు చెందిన అధినేతలు లేదా ఆయా దేశాల విదేశాంగ మంత్రులు ఆ ప్రసంగానికి శ్రోతలుగా ఉంటారు. ప్రధానమైన ఒక ప్రపంచ వేదికపై కశ్మీర్లో జరుగుతున్న ఉద్యమం అశాంతి గురించి చర్చకు రావడం, ప్రపంచ దేశాల నేతల దృష్టి కశ్మీరు వైపు మళ్లడం సహజంగానే భారత ప్రభుత్వానికి ఇష్టం ఉండదు. ఈ నేపథ్యంలో నవాజ్ షరీఫ్ ప్రసంగానికి మూడు రోజుల ముందు ఉడీ సంఘటన జరగడం యాదృచ్ఛికమేనా? యాదృచ్ఛికమే అయితే బాగుండును. కాని, నిర్భేద్యమైన సరిహద్దు నియంత్రణ రేఖ దగ్గర నిరంతరం అప్రమత్తంగా ఉండే సైనిక పటాలం కళ్లల్లో పడకుండా నలుగురు టెర్రరిస్టులు ఎలా ఉడీ సైనిక శిబిరంపై దాడి చేశారని ప్రశ్నించిన ఒక మాజీ మిలిటరీ జనరల్ సందేహాన్ని మనం సంశయాత్మకంగానయినా పరిశీలించాలి. ఉడీ దాడులకు ప్రతీకారంగా జరిగినట్లు చెప్పబడుతున్న సర్జికల్స్ యుద్ధ వ్యూహంపై రెండు ప్రధాన రాజకీయ పార్టీలు కూడా అనుమానాలు వ్యక్తం చేయడం గమనంలోకి తీసుకోవాలి.

ఇవన్నీ యాదృచ్ఛిక సంఘటనలే అయితే బాగుండునని దేశ సరిహద్దులను కాక దేశ ప్రజలను ప్రేమించే నిజమయిన పౌర సమాజం సభ్యులు అభిప్రాయపడవచ్చు. కాని పాలకులు, పాలక వర్గ ప్రయోజనాలు కాపాడే మేధావి వర్గం "ఇది రాజనీతి" అని సమర్థించవచ్చు. అందుకు మద్దతుగా' చాణక్య నీతిని ఉదహరించవచ్చు. ఇది ప్రజాస్వామిక యుగం. ప్రజాస్వామిక యుగంలో రాజరికపు పన్నాగాలు, చాణుక్య నీతులు అవసరమా? ప్రజల బాగోగులు, ప్రజల ఆకాంక్షలకే పెద్దపీట వెయ్యాలి గాని పాలకవర్గ అవసరాలు గడుపుకోవడానికి వేసే ఎత్తుగడలు చివరికి వారికే వీడ్కోలు గీతాలు పాడుతాయి.

ఈ ఎత్తుగడలు, 'రాజనీతు'లూ ఒక్క మన దేశ పాలకులే కాదు పాకిస్తాన్ దేశాధినేతలదీ ఇదే పద్ధతి. భారతదేశం పట్ల శత్రుత్వం కలకాలం వర్ధిల్లేలా అన్ని జాగ్రత్తలూ వారూ తీసుకుంటున్నారు.

అసలు పాలకులకు ఈ యుక్తులు, పన్నాగాలు, 'రాజనీతి ఎందుకు అవసరమవుతాయి. ప్రధానమయిన సమస్యల నుండి దేశ ప్రజల దృష్టి, ప్రపంచ ప్రజల దృష్టి మరల్చడానికి. ఇప్పుడు కశ్మీరు సమస్య వల్ల భారత ప్రభుత్వానికి ఈ 'దృష్టి మళ్లించే' కార్యక్రమం అవసరమైంది. కశ్మీరం మండుతుంది. అక్కడ కర్ఫ్యూ కొన్ని నెలలుగా కరాళ నృత్యం చేస్తుంది. గత నాలుగు నెలలుగా కశ్మీరులో స్కూళ్లు లేవు. కాలేజీలు లేవు. సంపన్నులు తమ పిల్లలను బయటి రాష్ట్రాలకు పంపి చదివించు కుంటున్నారు. సెల్ ఫోన్లు నిషేధించబడ్డాయి. కశ్మీరులోయలో కొన్ని ప్రాంతాలలో 98 రోజుల తర్వాత సెల్ఫోన్లు అనుమతించబడ్డాయి. అదీ పోస్ట్ పెయిడ్ కనెక్షన్లు మాత్రమే! ఇంటర్నెట్ లేదు. సాధారణ జీవితం కకావికలమైంది.

# నల్లధనం నల్లపూసంతైనా రాలేదు!

**స్విస్ బ్యాంకుల్లో ఉన్న అక్రమ ధనాన్ని దేశానికి రప్పిస్తానని చెప్పి అధికారంలోకి వచ్చిన నరేంద్ర మోడీ ఇప్పుడు దానిపై రోజుకో మాట మారుస్తూ, అప్పు కోసం రోజుకో దేశం తిరుగుతున్నాడని అంటున్నారు వి. హనుమంతరావు**

పదిహేను లక్షల రూపాయల చెక్ మీకందిందా? మీకు, మీకు అందిందా? అరే తనను ఎన్నికల్లో గెలిపిస్తే దేశంలో, విదేశాల్లో ఉన్న అక్రమ సంపదనంతా వసూలు చేసి 125 కోట్ల మందికి పంపిణీ చేస్తానని మోడీ హామీ ఇచ్చారే? దేశంలో, విదేశాల్లో దాచుకున్న నల్లధనాన్నంతా రప్పిస్తానని చెప్పారే? మీరంతా ప్రతి ఒక్కరూ ఓ కార్డు ముక్క రాసేయండి. ఎందుచేతనంటే కొత్తగా అధికారంలోకి వచ్చారు. సవాలక్ష సమస్యలున్నాయి. దేశ దేశాలు తిరగడానికే టైం చాలడం లేదు. పదిహేను లక్షల కోట్ల బడ్జెట్ ఏ దేశం అప్పు ఇస్తుంది అని దుర్భిణీ వేసి చూస్తున్నారు. తాజాగా పాకిస్తాన్‌తో లడాయి వచ్చి పడింది. తన ఎన్నికకు కోట్లు కుమ్మరించి గెలిపించిన కార్పొరేట్లు బ్యాంకుల నుంచి కోటాను కోట్లు అప్పుతీసుకుని అసలు మాట అటుంచి వడ్డీలు చెల్లించకుండా ఉంటే ఆ సమస్యనెలా పరిష్కరించాలి. తిరిగి చెల్లించనవసరం లేకుండా ఏం చేయాలి – ఇలా సవాలక్ష సమస్యలనెలా పరిష్కరించాలి అని ఆయన, ఆర్థిక మంత్రి జుట్టు పీక్కుంటుంటే, నాకిస్తానన్న పదిహేను లక్షలు పంపించండి అని ప్రధానిని వేపుకొని తింటారేమిటి? ఇందిరాగాంధీ పాలనా కాలంలో ఇలాగే అనేక సమస్యల్లో చిక్కుకుపోయిన సమయంలో తూర్పు పాకిస్తాన్ మీద దాడిచేసి, ప్రజల దృష్టిని మరలించి శబాష్ అనిపించుకుంది. మోడీజీ ఇందిరను కాపీ కొట్టడం లేదుకదా? సరిహద్దు పొడవునా కొన్ని చోట్ల కరెంటు ప్రవహించే తీగలు లేవని కొంతమంది రిటైరైన అధికారులంటున్నారు. అయినా, పాకిస్తాన్‌తో లడాయి నిన్న మొన్నటి విషయమా? 1947 నుంచి సాగుతూ వస్తూనే ఉంది. కాగా పాత ఆక్రమిత కశ్మీర్ మీద మన సేనలు కొత్త విషయమేమీ కాదు. అయ్యో నల్లధనంతో ప్రారంభించి దారి తప్పాను.

దేశంలో నల్లధనం ఉంది. విదేశాలకు తరలిస్తున్నారని, స్విస్ బ్యాంకుల్లో దాచుకుంటున్నారని ప్రభుత్వానికి తెలుసు. అలా నల్లధనం దాచుకున్న సంపన్న నగరాల్లో కెసిఆర్ పాలించే హైదరాబాద్ నాల్గవ స్థానంలో ఉందని పరిశోధకులంటున్నారు. ఆ పరిశోధకుల ప్రకారం అదే నగరంలో 1476 మురికి వాడల్లో నగరంలో నివసించే పురజనులు ప్రతి నలుగురిలో ఒకరు మురికి వాడల్లో నివసిస్తున్నారు. రేపో మాపో పరిశ్రమలు స్థాపిస్తామని సంతకాలు పెట్టిన విదేశీ సంస్థలు నిజంగా వస్తే అంతరాలు పెరగడం ఖాయం. అప్పుడు నవతెలంగాణ బంగారు తెలంగాణ అవుతుందో, నకిలి బంగారు తెలంగాణ అవుతుందో తెలియదు. కాని నల్లధనం మేటలు వేసి ఒక పనామాయే కాదు ప్రపంచంలో 90 పనామాలున్నాయని ఒక లెక్క. లండల్‌లో ఆ మధ్య జరిగిన ఆర్థిక వేత్తల సదస్సు తేల్చి చెప్పిందేమంటే ప్రపంచ వ్యాపితంగా రు. 506.24 లక్షల కోట్ల నుంచి రు. 1398.81 లక్షల కోట్ల అక్రమ సొమ్ము పోగుపడింది. ప్రపంచంలో నల్లధనం గురించి అనేక సంస్థలు అనేక రకాల లెక్కలున్నాయి. ఆంబిట్ కాపిటల్ రీసెర్చ్ సంస్థ ప్రకారం

---

మానవ హక్కుల పోరాట యోధుడు గౌతం నవ్‌లఖ కశ్మీరు సమస్యను విశ్లేషిస్తూ అపరిష్కృతంగా ఉన్న కశ్మీరు సమస్య ప్రపంచ శాంతికే విఘాతం కలిగిస్తుందని, ఈ సమస్య ఓ కొలిక్కి రావడంలో ఇక ఎంత మాత్రం ఆలస్యం జరిగినా దాని విష పరిణామాలు ప్రపంచం యావత్తు చవిచూడాల్సి వస్తుందని చాలా ఆవేదనతో హెచ్చరించారు. తమ అస్తిత్వం కోసం కశ్మీరీ ప్రజలు కొన్ని దశాబ్దాలుగా కొనసాగిస్తున్న పోరాటాన్ని భారత ప్రభుత్వం బల ప్రయోగం ద్వారా అణచివేతకు పూనుకుంటే ప్రపంచంలోని సభ్య దేశాలు చూస్తూ మిన్నకున్నాయి. ఇది సరి అయినది కాదు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా లాంటి ఆయుధ వ్యాపారులు ఈ రెండు దేశాల మధ్య యుద్ధ వాతవరణం సదా నెలకొనడానికి తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నాయి. యుద్ధమో, యుద్ధ వాతావరణమో ఉంటేనే కదా వారి వ్యాపారం బాగాసాగేది.

గౌతం నవలోక రశ్మీర్లోని న్యూస్ ఏజెన్సీ సిఎన్ఎస్‌తో మాట్లాడుతూ, 'నరేంద్ర మోడీ ప్రభుత్వం కల్లోలిత నదీ జలాలలో చేపలు పట్టే పనిచేస్తోంది. కశ్మీరులో భయానక వాతావరణం సృష్టించడానికి న్యూఢిల్లీ పెద్దలు హద్దులు మీరి ప్రయత్నిస్తున్నారు. అయితే అది మొత్తం ఉపఖండానికే ప్రమాదకరంగా పరిణమిస్తుంది. కశ్మీరు సమస్యను ఎలా పరిష్కరించాలో ఆలోచించకుండా పాకిస్తాననే బూచిగా చూపిస్తూ పరిష్కారం దాటవేస్తున్నారు. కశ్మీరు పోరాటం బయట నుండి దిగుమతి అయింది కాదు. అది అంతర్గతంగానే ఉన్నది. ఆ పోరాటానికి వేళ్లు, మూలాలు కశ్మీర్లోనే బలంగా పాతుకొని ఉన్నాయి. స్థానికులే ఆ పోరాటానికి నాయకత్వం వహిస్తున్నారు' అని అన్నారు. కశ్మీరు లోయలోని కొన్ని ప్రాంతాలలో రోడ్లమీద ట్రక్కులు తిరుగుతుంటేనో, సెల్‌ఫోన్లు మోగుతుంటేనో ప్రశాంత పరిస్థితి నెలకొన్నదనుకుంటే అది పిచ్చివాళ్ల ప్రేలాపనే అవుతుంది. కశ్మీర్ ప్రజలు పోరాడి పోరాడి అలిసిపోతారని, అలిసిపోయి తమ దైనందిన కార్యక్రమాలలో మునిగిపోతారని భారత ప్రభుత్వం భావిస్తే అది వాస్తవ విరుద్ధం. ఈ రకంగా ఆలోచిస్తూనే ఇన్నేళ్లుగా కశ్మీరును ఒక అగ్నిగోళంగా తయారు చేశారు. కశ్మీరు ప్రజలు గత ఏడు దశాబ్దాలుగా ఎందుకు పోరాడుతున్నారు? పోలీసుల, సైనికుల తూటాలకు, పెల్లెట్లకు ఎదురు నిల్చి ప్రాణాలు అర్పించడానికి ఎందుకు వెనుకాడడంలేదు? మేధావులు, పౌర సమాజం ఆలోచించాలి.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్)* వీ

భారతీయ కుబేరులు విదేశాల్లో దాచుకున్న నల్లడబ్బు రు. 30 లక్షల కోట్లు. ఇది జిడిపిలో 20 శాతం. 2016 ఫిబ్రవరి 13న పత్రికల్లో వచ్చిన వార్త ప్రకారం ఆదాయపు పన్ను శాఖ చేసిన సర్వేల ప్రకారం గత రెండు సంవత్సరాల్లో అంటే మోడీ పరిపాలనలో నల్లధనం చాలా వేగంగా పెరిగింది. ఆంబిట్ కాపిటల్ రీసెర్చ్ లెక్కల ప్రకారం విదేశాలకు తరలిన నల్లధనం రు. 30 లక్షల కోట్లు. ఆదాయపు పన్ను (ఇంటెలిజెన్స్ అండ్ క్రిమినల్ ఇన్వెస్ట్‌మెంట్ డైరెక్టర్ జనరల్) ప్రకారం గత అయిదు సంవత్సరాల్లో అధికారులకు తెలియకుండా దాచిన సొమ్ము 15.5 రెట్లు పెరిగింది. దేశంలో సంబంధిత అధికారిక లెక్కల ప్రకారం నల్లధనం 2011లో రు. 5589 కోట్ల నుంచి 2014లో రు. 90391 కోట్లకు పెరిగి, 2015 మొదటి రెండు నెలల్లో రు. 1900 కోట్లు. ప్రభుత్వం నల్లధనం వేట ప్రారంభించిందని గమనించిన ధన మదాందులు విదేశాలకు తరలిస్తున్న సొమ్ము రెట్టింపైందని గణాంకాలు తెలియజేస్తున్నాయి. ఈ సంవత్సరం మే నెల ప్రభుత్వ లెక్కల ప్రకారమే గత రెండేళ్లలో పరోక్ష పన్ను ఎగ్గొట్టినవి రు. 50,000 కోట్లు. ఇది చీమ తలకాయంత మాత్రమే. ఇలా దేశ సరిహద్దులు దాటి వెళ్లిపోయిన బిలియన్ల డాలర్ల డబ్బును తిరిగి దేశానికి రప్పించడం అసాధ్యమని అంటున్నారు పారిశ్రామిక వేత్త రాహుల్ బజాజ్. పిటిఐ వార్త సంస్థ ప్రకారం స్విస్ బ్యాంకుల్లో భారతీయులు దాచుకున్న డబ్బు లెక్కలిలా ఉన్నాయి. (కోట్ల రూపాయలు) 2006 – 41400, 2007 – 27500, 2008 – 15400, 2009 – 12600, 2010 – 12450, 2011 – 14000, 2012 – 9000, 2013 – 14000. ఇలా దాచిన డబ్బు గురించి మన ప్రభుత్వం స్విస్ బ్యాంకులలో ఆ దేశ ప్రభుత్వంతో చర్చలు జరిగాయి. ఈ పరిణామాన్ని గమనించిన కోటీశ్వరులు ప్రపంచంలో ఉన్న 90 దేశాల్లోకి గప్‌చుప్‌గా తరలించేశారు. ఇలా తరలించిన దేశాల్లో ఉత్తర, దక్షిణ అమెరికాల మధ్య కేవలం 40 లక్షల జనాభా నివసించే అతి చిన్న దేశం పనామా. అంతర్జాతీయ పరిశోధనాత్మక విలేకరుల కూటమి కలిసి ప్రపంచంలో పరిశోధించగా మనదేశం నుంచి 37 వేల ఇండియా ఫైల్స్ ఉన్నాయని తేల్చారు. పన్నుల ఎగవేత (ప్రపంచ వ్యాప్తంగా) పేద దేశాలు 4 లక్షల కోట్లు నష్టపోతున్నాయని ప్రకటించింది. ఈ పనామా వ్యవహారం గురించి ఇటీవలనే పత్రికల్లో వివరాలు, విశ్లేషణలు వచ్చాయి కాబట్టి పనామాను పక్కన పెట్టేస్తున్నా.

విదేశాలకు తరలించిన నల్లధనం అంతిమంగా మారిషస్‌కు చేరి, విదేశీ పెట్టుబడులుగా మారి తాజాగా దేశంలోకి వస్తుంది. ప్రభుత్వానికి ఈ విషయం చాలా కాలం నుంచి తెలుసు. ఇటీవలనే కొంత మార్పు వచ్చింది.

2004 సంవత్సరం వరకూ రిజర్వు బ్యాంకు అనుమతి లేనిదే విదేశాలకు పంపడం నిషేధం. అనుమతి లభిస్తే 25 వేల డాలర్లకు మించి పంపడం నిషేధం. ఇప్పుడా పరిమితిని రెండున్నర లక్షల డాలర్లకు పెంచారు. పాలకులది ఎంత విశాల హృదయమో! ప్రపంచ బ్యాంకు ప్రకారమే మనదేశంలో వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, రియల్ ఎస్టేట్, మౌలిక సౌకర్యాలు కల్పించే పరిశ్రమలు, వ్యాపారులు వారికి ప్రభుత్వ అనుమతులు సాధించుకోవడానికి సగటున ప్రాజెక్టు నిర్మాణానికి చేసే ఖర్చులో 50 శాతం సొమ్ము రాజకీయ నాయకుల, ఉన్నతాధికారుల చేతులు తడపాల్సిందేనని పేర్కొంది.

నల్లధనం దేశ సంపద. ఈ సంపద విదేశాలకు తరలిపోయిందంటే ఆ మేరకు దేశంలో పెట్టాల్సిన పెట్టుబడులు ఆ మేరకు తగ్గుతాయి. రెండోపక్క మా దేశంలో పెట్టుబడులు పెట్టండహో అని విదేశాల్లోని బహుళజాతి సంస్థల చుట్టూ ప్రదక్షిణలు చేయడం – ఇదేమి పరిపాలన, ఇదేమి ప్రభుత్వం? దేశ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దడం ఇలాగేనా? నల్లడబ్బు ఇలా బయటకు తరలిపోతుంటే హద్దు, అదుపు లేకుండా అప్పుచేయడం, వడ్డీలు చెల్లించడం, అలా అప్పులు ఇచ్చిన ప్రపంచ బ్యాంకు లాంటి సంస్థలు పెట్టిన షరతులకు తలొగ్గడం – ఎంత సిగ్గుచేటు? విదేశాలకు తరలిస్తే ఈ నల్లధనం మీద పన్ను చెల్లించడం ఎగవేయవచ్చు. ఇలా దేశ సంపద విదేశాలకు తరలిపోతుంటే, దేశంలో మౌలిక సౌకర్యాలకు నిధులు లేకపోవడం జరుగుతుంది. ఈ సౌకర్యాల కల్పన కోసం నియమించాల్సిన పనివారిని నియమించలేక నిరుద్యోగం పెరుగుతుంది, పేదరికం పెరుగుతుంది. ఆ డబ్బు దేశంలోనే పెట్టుబడి పెడితే మరిన్ని పరిశ్రమలు, ఉపాధి కల్పన, ఉత్పత్తుల అమ్మకాలు సాధ్యమవుతాయి. ఉత్పత్తి పెరిగితే, మార్కెట్ పుంజుకుంటుంది, ధరలు పెరగవు.

ఈ నల్లధనం ఎలా పుట్టుకొచ్చింది? మనమంతా బజారుకు వెళ్లి కావాల్సిన సరుకులు దుకాణదారుడు చెప్పిన ధర చెల్లించి తెచ్చుకుంటాం. మనం చెల్లించిన ధరలో ఉత్పత్తిదారుడు తన లాభాలు కలుపుకుని ధర నిర్ణయిస్తాడు. ఆ ఉత్పత్తిని మనకు అమ్మే వ్యాపారస్తుడు తన లాభం కలుపుకుని, ఆ ధరకు మనకమ్ముతాడు. పారిశ్రామిక వేత్త పన్ను చెల్లించి ఆ పన్నును తాను అమ్మే ధరలో చేరుస్తాడు. ఆ ఉత్పత్తిని అమ్మే చిల్లర దుకాణదారుడు స్థానిక మునిసిపల్ పన్ను, అమ్మకం పన్ను కలుపుతాడు. ఇలా వివిధ స్థాయిల్లో టోకు, చిల్లర వ్యాపారస్తుల లాభాలన్నీ మనం చెల్లిస్తున్నాం. ఏ సరుకైనా ఉత్పత్తి తగ్గితే ధరలు పెంచాల్సిన మేరకన్నా మరింతగా పెంచుతాడు. ఇలా కృత్రిమంగా పెంచిన సొమ్మే నల్లధనం. మా వార్షిక సంపాదన ఇంతని పారిశ్రామిక వేత్తలు, వ్యాపారులు ప్రభుత్వ ఆదాయపు పన్ను శాఖకు చెబితే, ప్రభుత్వం నిర్ణయించిన మేరకు ఆదాయపు పన్ను చెల్లించాలి. అలా చెల్లించాల్సిన పన్ను చెల్లించకుండా, ఆ ఆదనపు అక్రమ సంపదను పన్నును విదేశీ బ్యాంకుల్లో, స్విస్ బ్యాంకుల్లో దాచుకోవడాన్ని ప్రభుత్వం, ప్రభుత్వంలో ఉండే పార్టీ నాయకులు, ఉన్నతాధికారులు ఈ అవినీతిని పరోక్షంగా విదేశాల్లో దాచుకోవడాన్ని చూసీచూడనట్లు ఊరుకుంటారు. ఇలా కంచే చేనుమేస్తే?

ఈ నేపథ్యంలో దేశ ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఏదో పెద్ద ఘనకార్యం చేసినట్లు 64,275 మంది నల్ల కుబేరులు రు. 64,275 కోట్లు తమ అక్రమ సంపాదనను వెల్లడించినట్లు ప్రకటించి, డబ్బా కొట్టుకున్నారు. పై లెక్కల ప్రకారం సగటున ఒక్కొక్క నల్ల కుబేరుడు ఒక్క కోటి రూపాయల నల్లధనం ఉన్నట్లు వెల్లడించారు. అంటే నల్లధనం బొట్టుబొట్టుగా రాలుతుందన్నమాట. ఈ మాత్రం దానికేనా జబ్బలు చరచుకునేది? ఇది పాలకులు తమవీపు తామే చరుచుకోవడమే. ఈ నల్లధనం వ్యవహారం ఎలా పరిష్కరించాలి? మూడు లక్షల రూపాయలు పైబడితే చేతులు మారడాన్ని నిషేధించాలి. ఏ వ్యక్తీ 15 లక్షలకు మించి ద్రవ్య రూపంలో తనవద్ద ఉంచుకోకూడదు. ఇది పత్రికల్లో స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీం ఇచ్చిన సలహా. ఇలాంటి 'విప్లవ కరమైన' సలహా మోడీ ప్రభుత్వం అంగీకరించడమే? పగటి కలలు కనకండి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# కలబోత పరివేత రాజకీయాలు

***పేద, దళిత విద్యార్థులు వివిధ దశల్లో ఎదుర్కొంటున్న అవమానాలు, వివక్ష వారి మనోధైర్యాన్ని ఎలా నీరుగారుస్తాయో వివరిస్తూ, ఈ విషయంపై వచ్చిన వ్యాస సంకలనాన్ని పరిచయం చేస్తున్నారు డా. నళిని***

ఇటీవల ఉన్నత విద్యా సంస్థల్లో కుల వివక్షపై చర్చ జరుగుతోంది. వేముల రోహిత్ చూపిన నిరసనతో మరెన్నో ఉదంతాలు వెలుగు చూస్తున్నాయి. హైదరాబాద్ సెంట్రల్ యూనిర్శిటీలో సెంథిల్ కుమార్ స్కాలర్‌షిప్‌ని తొక్కిపెట్టి, అతన్ని పదేపదే ఫెయిల్ చేశారు. 'నీకెందుకు పరిశోధనలు? మీ అమ్మ నాన్నలతో పాటు పందులు కాసుకో. మరో ఐదు వేలు సంపాదించుకోవచ్చు' అని అధికారులు ఎద్దేవా చేసినందుకు క్షోభపడి అతను ఆత్మహత్య చేసుకున్నాడు. అది సెంట్రల్ యూనివర్శిటీలో మొదటి దళిత ఆత్మహత్య. రోహిత్ చివరివాడు కావాలని కోరుకుందాం.

ఈ విషయాలపై ఎన్నో వ్యాసాలు వస్తూనే ఉన్నాయి. అయితే, 2013లో వచ్చిన ఒక వ్యాస సంకలనంలో చాలా ఆసక్తికరమైన విషయాలున్నాయి. ఆ పుస్తకంలోని కొన్ని అధ్యాయాలని ఇక్కడ సమీక్షించుకుందాం. 'బియాండ్ ఇన్‌క్లూషన్ – ది ప్రాక్టీస్ ఆఫ్ ఈక్వల్ యాక్సెస్ ఇన్ ఇండియన్ హైయ్యర్ ఎడ్యుకేషన్' అనే పుస్తకానికి సతీష్ దేశ్‌పాండే, ఉషా జచరియాలు ఎడిటర్లుగా వ్యవహరించారు. ఉన్నత విద్యా సంస్థల్లో కుల వివక్షపై వివిధ కోణాల నుంచి రాసిన పది అధ్యాయాలు ఇందులో ఉన్నాయి. అనూప్ కుమార్ సింగ్, ఎన్. సుకుమార్‌ల వ్యాసాలని ఇక్కడ చూద్దాం.

అననుకూల పరిస్థితులని అధిగమిస్తూ, ఉన్నత విద్యా సంస్థల్లో దళిత, ఆదివాసి విద్యార్థులు సాధించిన విజయాలని, ఎదుర్కొన్న విషాదాలని అనూప్‌కుమార్ సింగ్ విశ్లేషించాడు. మన దేశంలో ఉన్నత విద్యని అభ్యసించగల జనాభా 12.4 శాతం ఉంటారు. దాన్ని గ్రాస్ ఎన్‌రోల్ మెంట్ రేషియో అంటారు. అంటే, సగటు భారతీయుడు కళాశాలలో గాని, విశ్వవిద్యాలయంలో గాని చేరే అవకాశం 12 శాతంగా ఉంటుందని అర్థం. అయితే, కులాల వారీగా చూస్తే, ఉన్నత కులాలకి చెందిన వారికి ఈ అవకాశం దళితుల కంటే, ఆదివాసుల కంటే మూడు రెట్లుగా ఉంటుంది. వెనకబడిన కులాల కంటే రెట్టింపు అవకాశం ఉంటుంది. మరోలా చెప్పాలంటే, సగటు భారతీయుడితో పోలిస్తే, దళితులు, ఆదివాసులు కళాశాలకి వెళ్లే అవకాశం తక్కువగా ఉంటుంది. ఉన్నత కులాలతో పోలిస్తే అది మూడవ వంతు మాత్రమే. అంటే, కళాశాలల్లో చదివే అవకాశాన్ని కోల్పోయే పరిస్థితి 94 శాతంగా ఉంటుంది.

ఉన్నత విద్యని అభ్యసించాలంటే దళిత, ఆదివాసి విద్యార్థులు ఎన్నో అననుకూల పరిస్థితుల్ని ఎదుర్కోవాలి. వాళ్లు విజయం సాధించాలంటే తమ మీద తమకి అపారమైన విశ్వాసం ఉండాలి. మొక్కవోని పోరాటం చేయాలి. అన్నిటినీ మించి, అననుకూలతలని అధిగమించడం కోసం మరింతగా కష్టపడి చదవాలి. ఎంతో కష్టపడి పైకొచ్చి, ఉన్నత విద్యని అభ్యసించడం కోసం విశ్వవిద్యాలయాల్లో చేరితే, తమ ఆశలని నీరుకారుస్తున్న అధ్వాన్న పరిస్థితుల్లో వారు పోరాడక తప్పడం లేదు. తమ ఉనికిని నిలుపుకోవడం కోసం గొంతెత్తక తప్పడం లేదు.

జరుగుతున్న ఎన్నో పరిశోధనల ఫలితాల్లో దళిత, ఆదివాసీ విద్యార్థుల కథనాలను పరిశీలిస్తే, మూడు రకాల గాథలు బయటపడతాయి. కొన్ని విజయ గాథలున్నాయి. అన్ని కష్టాలని గట్టెక్కి, మంచి వృత్తుల్లో నిపుణులుగా నిలదొక్కుకున్నవారు కొందరు. మరికొందరు సామాజిక కార్యకర్తలుగా పనిచేస్తున్నారు. రెండవరకం వివక్షకి వ్యతిరేకంగా నిరంతరం పోరాడేవారు. చివరగా మూడవరకం వారివి విషాదభరిత గాథలు. అననుకూలతలని ఎదిరిస్తూ అలిసిపోయి, తమ నిరసనకి అంతిమ రూపంగా ప్రాణాలు తీసుకుంటున్న ఘటనలు, వారికి ఎదురయ్యే వివక్ష నాలుగు రకాలుగా ఉంటుంది. ఉన్నత విద్య అభ్యసించడానికి ముందు దళిత ఆదివాసులు సామాజిక ఆర్థిక వివక్షని ఎదుర్కొంటారు. ఉన్నత విద్యా సంస్థల్లో అధ్యాపకుల ప్రవర్తన, వారి ఆచరణ వివక్షనే చూపుతాయి, తోటి విద్యార్థులు కూడా వీరి పట్ల శత్రుత్వ భావంతో దూరంగా ఉంచుతారు. విద్యా సంస్థల పాలనాధికారులు సైతం నిర్లిప్తంగా ఉంటారు, లేదా వీరిని తీవ్రంగా వ్యతిరేకిస్తారు.

ఎక్కడైనా పేదలని నికృష్టంగానే చూస్తారు. కానీ ఇక్కడ మరో కోణం ఉంది. ఆ పేదవాడు దళితుడో, ఆదివాసినో అయితే వారు మరింత అసహ్యాన్ని, అవమానాలని ఎదుర్కోవలసి వస్తుందంటాడు అనూప్ కూమార్ సింగ్. ఆర్థిక పరిస్థితి హీనంగా ఉండడం, భూమిపై ఏ హక్కు లేకపోవడం, నిరుపేద సామాజిక వర్గాలని సహజంగానే దూరంగా ఉంచడం, చదువు మధ్యలోనే ఆపేసే డ్రాపవుట్ల సంఖ్య అధికంగా ఉండడం – ఇవన్నీ ఈ వివక్ష తీవ్రతని పెంచుతాయి. ఎన్నో ఉదాహరణలు చెప్తూ అనూప్ సింగ్ ఈ సత్యాన్ని చాటుతాడు.

అమెరికాలో ప్రస్తుతం ఒక జాతీయ పరిశోధనాలయంలో పరిశోధన చేస్తున్న పోస్ట్ డాక్టరల్ ఫెలో తన చీకటి జీవితాన్ని గుర్తు చేసుకుంటాడు. 'మా సమస్యలన్నింటికీ మా పేదరికమే కారణం. మా నాన్న ఒక పరిశ్రమలో కార్మికుడు. ఆయన తరచుగా జబ్బుపడడంతో ఆయన్ని జీతం లేకుండా సెలవు మీద పంపేసేవారు. పాత దినపత్రికల కాగితాలే నా పుస్తకాలకి అట్టలు. ఎప్పుడైనా చుట్టాలింటికో, పెళ్లిళ్లకో వెళ్లాలంటే స్కూలు యూనిఫారమే గతి. ఎందుకంటే, నాకున్న శుభ్రమైన బట్టలు అవి మాత్రమే.'

ఒక సంస్కృతం ప్రొఫెసర్ అనుభవం మరోలా ఉంది. తాము వర్గం, కులం, జెండర్ అనే అవరోధాలని దాటితే తప్ప ఎలాంటి విజయం సాధించలేం అంటుంది ఆమె. ఏడవ తరగతిలో సంస్కృతం క్లాసుకి వెళితే ఆమెను టీచర్ వెళ్లగొట్టారు. 'బతకాలంటే చెత్త ఎత్తుకు బతకవే. నీకెందుకు సంస్కృతం?' అంటూ హేళన చేశాడు. అతని బ్రాహ్మణ వాదం, పురుషాహంకారమే తనని ప్రేరేపించాయంటూ ఆమె సంస్కృతం చదివి ప్రొఫెసర్‌గా ఎదిగింది.

రాజస్థాన్‌కి చెందిన ఒక వ్యవసాయాధికారి పదవ తరగతిలో ఒక

సమస్య ఎదుర్కొన్నాడు. ఆ స్కూలుకి నూరు శాతం ఉత్తీర్ణత కావాలి కాబట్టి, ఈ దళితుడు ఆ ఉత్తీర్ణత శాతానికి అడ్డవుతాడని, ఫెయిలవు తాడని భావించి, అతన్ని వచ్చే సంవత్సరం పరీక్ష రాయమన్నారు. కానీ అతని తండ్రి గట్టిగా ఎదిరించడంతో అతన్ని పరీక్ష రాయనిచ్చారు. అతను ఆ సంవత్సరం స్కూలు మొత్తానికి టాపరుగా నిలిచేసరికి, పరీక్ష రాయకుండా ఆపాలని చూసిన వారిని వెక్కిరించినట్టయింది. పైగా, అతను ఇంగ్లిష్‌లో సాధించిన 89 మార్కులు ఆ సంవత్సరం రాష్ట్రంలోనే అత్యధికం!

యూనిసెఫ్‌లో అభివృద్ధి నిపుణురాలిగా పని చేస్తున్న ఒక ఆదివాసి మహిళ తన అనుభవాన్ని మూడు ముక్కల్లో చెప్పింది. ఆమె పాఠశాలలో, కళాశాలలో వెలివేత వాతావరణాన్ని చవి చూసింది. ప్రధాన జీవన స్రవంతిలో తాము ఎన్నటికీ భాగస్వాములు కాలేమని ఆమె నమ్మకం. విద్య, ఉద్యోగ అవకాశాలపై తమకి ఎప్పుడూ సరైన సమాచారం అందదని ఆమె వాపోయింది.

రాజకీయ అర్థశాస్త్రంలో డాక్టరేట్ కోసం కృషి చేస్తున్న ఒక విద్యార్థి కుటుంబం తోళ్లు తయారు చేస్తుంది. అందుకని అతను పాఠశాలలో చదివినన్నాళ్లు అవమానాలు, మనసుని మెలిపెట్టే మాటలు నిరంతరం సహించవలసి వచ్చింది. హర్యానాలో ఒక సంస్కృతం టీచర్ తన చదువు కొనసాగడం కోసం నిర్మాణ కూలీగా పనిచేశాడు. తన కాలేజీ ముందు నుంచి వేస్తున్న రోడ్డుపనిలో కూడా అతను కూలీగా పని చేశాడు.

రాజస్థాన్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు తమ వివక్ష ధోరణిని బహిరంగంగానే ప్రదర్శిస్తారు. వారు దళితులకి తక్కువ గ్రేడులిచ్చి, లాబ్ మార్కులు తగ్గించి, వారిని ఎప్పుడూ హీనంగానే చూస్తారని అక్కడ చదివే విద్యార్థి చెప్పాడు.

మధ్యప్రదేశ్‌లో వెటర్నరీ సైన్స్ విద్యార్థికి థియరీ పేపరులో అత్యుత్తమ మార్కులు వచ్చాయి. ఆ పేపరుని బయట నుంచి వచ్చిన ఎక్స్‌టర్నల్ అధ్యాపకుడు దిద్దాడు. కానీ తన కళాశాలకి చెందిన ఇంటర్నల్ ఎగ్జామినర్ అతనికి ప్రాక్టికల్స్‌లో సగటు మార్కులు మాత్రమే వేశారు.

తమిళనాడులో ఒక విద్యార్థిని డిగ్రీ రెండవ సంవత్సరంలో తన స్నేహితురాలి ఊరికి ఒక ఫంక్షన్ కోసం వెళ్లింది. స్నేహితురాలి తండ్రి ఆమె తల్లిదండ్రుల వివరాలు అడిగి ఆమె కులాన్ని కనిపెట్టాడు. వెంటనే అతని ముఖకవళికలు మారిపోయాయి. 'ఒక అంటరానిదాన్ని ఉత్సవానికి తీసుకువస్తావా?' అంటూ కూతురిని కోప్పడ్డాడు. ఈ స్నేహితురాలు తను చేయని నేరానికి అవమానంతో ముడుచుకు పోయింది.

హర్యానాలో ఒక పల్లె నుంచి వచ్చిన ఒక వాల్మీకి యువతి తాను వివక్షని ఎదిరించడమే కాక, ఇతరులు కూడా ఎంత ధైర్యంగా ఉండాలో ఇలా బోధపరుస్తుంది. 'నేను నా ఉనికిని ఎప్పుడూ దాయలేదు. స్కూలు రోజుల నుంచే నేనెవరో అందరికీ తెలుసు. నేను నా తోటి విద్యార్థుల ఇళ్లలో కూడా కూలి పని చేశాను. పశువుల పేడ ఎత్తడం వంటి పనులు చేసి, తర్వాత అదే విద్యార్థులతో కలిసి కూర్చుని చదువుకున్నాను. నన్ను క్లాసులో 'చూరీ' (పాకీదానా) అని పిలిచేవారు. కానీ మా నాన్న నన్ను బాధపడనివ్వలేదు. ఏ పనీ తక్కువ కాదని, ఏ పనీ ఎక్కువ కాదని, పనంటే పనే అని ధైర్యం చెప్పాడు. నేను నాతోటి విద్యార్థులకి అదే చెప్తాను. వారు తమ ఉనికిని దాచుకోకూడదు. ఎంతో కష్టపడి పనిచేసే వర్గాల నుంచి వచ్చినందుకు వారు గర్వపడాలి. తాము ఉన్నత విద్యని సాధించడం తమకే కాక తమ సమూహానికే ఎంతో గర్వకారణమని వారు గ్రహించగలగాలి.'

విద్యాలయాల్లో కుల ప్రాతిపదిక మీద హాస్టళ్లు నడపడాన్ని ఆమె నిరసిస్తుంది. జాట్ హాస్టల్, ఠాకూర్ హాస్టల్ అంటూ వేరువేరు మెస్సులు నిర్వహించడాన్ని ఆమె ప్రశ్నిస్తుంది.

విద్యార్థులు సంఘాలుగా ఏర్పడడాన్ని తమ విద్యాలయాధికారులు అడ్డుకున్నారని ఆమె చెప్తుంది. కొన్ని విద్యేతర కార్యకలాపాల కోసం మాత్రమే వారిని గ్రూపులుగా ఏర్పడనిస్తారు. 'ఎక్కువగా మేము డినయల్ మోడ్‌లో ఉంటూ మమ్మల్ని మేము విస్మరిస్తాం. సమస్యని గుర్తించడానికి నిరాకరిస్తూ, ఆ సమస్యకి కారణం తామే అనుకుంటూ నెపాన్నంతా మా నెత్తిన మోస్తూ బతుకుతున్నాం.'

రాంచీ బిట్స్‌లో ఒక బి.బి.ఎ విద్యార్థి తరగతి గదిలో రెండవ వరసలో కూర్చోబోతే, ఉన్నత కులానికి చెందిన క్లాస్‌మేట్ అతన్ని ఆపాడు. 'రిజర్వేషన్ కోటాలో వచ్చావు. అసలు నువ్వు ఈ కోర్సుకి తగవు. తగుదునమ్మా అంటూ రెండవ వరసలో కూర్చోబోతావా, వెళ్లి ఆఖరి వరసలో కూర్చో' అంటూ గదిమాడు.

రాజస్థాన్‌లో ఉన్నత విద్యా సంస్థల్లో వివక్షకి వ్యతిరేకంగా అన్ని దళిత వర్గాలు కలిసికట్టుగా ప్రతిఘటించవలసి వచ్చింది. వేరువేరు కులాలుగా మిగిలిపోతే వారి ప్రతిఘటన నీరుగారిపోతుందని అర్థమై అణగారిన కులాలన్నీ ఒకటయ్యాయి. సౌభ్రాతృత్వాన్ని ప్రకటించు కున్నాయి. అందరూ ఒకే రకమైన వివక్షని, అవమానాలని ఎదుర్కొంటున్నామని వారికి అర్థమయింది. ఒక్కతాటి మీద ఎలా నిలబడాలో తెలిసింది. మొదటగా వారు తమ మీద జరిగే భౌతిక దాడులని ఎదుర్కొన్నారు. తర్వాత విద్యార్థులకి, అధ్యాపకులకి రిజర్వేషన్ సరిగ్గా అమలయ్యేలా చూశారు. విద్యార్థి సంఘం ఎన్నికల్లో తాము ఒక గ్రూపుగా నిలబడడం చాలా ప్రభావాన్ని చూపింది. తమకి ప్రత్యేక హాస్టళ్లు, మెస్‌లు ఏర్పరచుకున్నారు. రస్టికేషన్లని వ్యతిరేకించారు. విశ్వవిద్యాలయ అధికారులు నిమ్మకి నీరెత్తినట్టు ఉంటారు కాబట్టి వారి నుంచి ఎలాంటి అభివృద్ధిని ఆశించలేమని వారు నమ్ముతారు. దళితులకి మద్దతునిచ్చే విధానాన్ని పెంపొందించే దిశగా వారు 'మెంటర్‌షిప్ ప్రోగ్రాములు' నిర్వహించారు.

వివక్షకి గురై, మనస్తాపం చెంది మధ్యలోనే చదువు మానేసిన దళిత 'డ్రాప్ అవుట్'లు ఎందరో ఉన్నారు. అయితే, అన్నిటికంటే తీవ్రమైన, బాధాకరమైన డ్రాప్ అవుట్ విధానం ఆత్మహత్య అంటాడు రచయిత. చండీగఢ్ ప్రభుత్వ మెడికల్ కాలేజీలో జస్‌ప్రీత్ సింగ్, ఆల్ ఇండియా మెడికల్ సైన్సెస్ (ఎయిమ్స్)లో బాలముకుంద్ భార్తీలు కమ్యూనిటీ మెడిసిన్ ప్రొఫెసర్లు చూపిన వివక్షకి గురై, భవిష్యత్తు అంధకారమై పోయి నిస్పృహతో ఆత్మహత్య చేసుకున్నారు. రూర్కి ఐఐటిలో బిటెక్ చదువుతున్న మనీష్ కుమార్ తోటి విద్యార్థులు చూపిన వివక్ష వల్ల చనిపోయాడు. థోరట్ కమిటీ రిపోర్ట్ ప్రకారం, విద్యార్థులు అధ్యాపకుల వేధింపులకే కాక తోటి విద్యార్థుల హేళనకి కూడా గురవుతున్నారు. ప్రాక్టికల్స్‌లో తప్పించడం, తక్కువ మార్కులు వేసి వేధించడం అధ్యాపకుల వేధింపులో సర్వసాధారణం.

రిజర్వేషన్ విధానం గాని, కలబోత (ఇన్‌క్లూజన్) విధానం గాని కంటితుడుపు చర్యలుగా ఉన్నంతకాలం అవి విజయవంతం కాలేవు అని, ఈ విధానాలతో ప్రత్యక్ష సంబంధం ఉన్నవారు మాత్రమే తమ అనుభవాలు వివరించగలరనీ అనూప్ కుమార్ సింగ్ నొక్కి చెప్పాడు.

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్ర విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న ఎన్. సుకుమార్ కూడా తన వ్యాసంలో కుల

# గురజాడ రాతప్రతుల ప్రస్థానం

*అనేక చేతులు మారి చివరికి కనబడకుండా పోయిన గురజాడ అప్పారావు రాత ప్రతుల ప్రయాణాన్ని వివరిస్తున్నారు* **పి.పి.సి. జోషి**

ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం తొలి మహాసభ తెనాలిలో 1943లో జరిగింది. కందుకూరి, గురజాడ, కొమర్రాజు, కాశీనాథుని నాగేశ్వరరావులు తెలుగు భాషా సాహిత్యాలనూ సమాజాన్నీ ఆధునికీకరించడంలో చేసిన కృషిని ప్రచారం చేయాలని, ఆ దిశగా వారి జయంతులు, వర్ధంతులు జరపాలని, వారి రచనలను ప్రచురించి జనంలోకి చేర్చాలని రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ప్రజాసంఘాలన్నిటికీ పిలుపునిచ్చింది.

అప్పటికి సెట్టి ఈశ్వరరావుగారు రాజమండ్రిలో, బహుశా ప్రజాశక్తి విలేకరిగా ఉన్నారు. గురజాడ రామదాసు పంతులుగారు విజయనగరాన్ని విడిచి తండ్రి అప్పారావుగారి అముద్రిత రచనలున్న ట్రంకుపెట్టెతో బాటు రాజమండ్రి చేరి ఉన్నారు. అప్పారావుగారి జీవిత చరిత్ర రాసే ప్రయత్నంలో ఈశ్వరరావు రామదాసు గారిని కలుస్తూ వచ్చారు. అప్పటికే కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ వారితో కన్యాశుల్కం ప్రచురణ విషయమై రామదాసుగారు ఒప్పందం చేసుకొన్నారు.

కాబట్టి, కన్యాశుల్కం మినహా, మిగతా రచనలు ప్రచురించేందుకు పారితోషికం ఇచ్చి అరసం తరఫున ఈశ్వరరావుగారు ఒప్పందం చేసుకొని గురజాడ రచనలున్న ట్రంకుపెట్టె (ఒకటో, రెండో గుర్తులేదు) లని బెజవాడ చేర్చారు. 1944–48 కాలంలో. వాటిలో కొన్ని రచనలు ఆనాటి ప్రజాశక్తి ప్రచురణాలయం తరఫునో, అరసం తరఫునో ప్రచురణయ్యాయి. సంపాదకులెవరో నాకు తెలియదు కాని భవిష్యత్తు కోసం ఆ కాపీలని ట్రంకుపెట్టెల్లో దాచి ఉంటారని, ఎవరో వాటిని స్వాయత్తం చేసుకుని ఉంటారని నా అనుమానం. వాటికోసం ఎపి స్టేట్ ఆర్కైవ్స్‌లో ప్రయత్నిస్తే దొరుకుతాయేమో! అప్పటి నుంచి అవి 1948లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వచ్చేవరకు బెజవాడలోనే ఉన్నాయి. నిషేధపు రోజుల్లో పోలీసుల చేతుల్లో ఇవి ధ్వంసం కాకుండా మదరాసులో రక్షణ స్థావరానికి (డెన్) (బహుశా తాపీ ధర్మారావుగారి నివాసం) తరలించారు. 1952లో మళ్లీ బెజవాడ చేరి విశాలాంధ్ర విజ్ఞాన సమితి (వివిస) సంరక్షణలోకి వచ్చాయి.

---

దురహంకారాన్ని విశ్లేషించారు. 'కోటా పిల్లలు – చదువుకుంటే ప్రమాదాలు' అనే వ్యాసంలో ఆయన పేదరికానికి మరొక నిర్వచనం చెప్తాడు. పేదరికం అంటే పేదగా బతకడమే కాదని, సామాజిక సంబంధాల్లో వెలివేత కూడా బతికే అవకాశాలని నియంత్రిస్తుందని ఆయన అభిప్రాయం. అలా వారు సామూహికతకి దూరమవుతున్నారని, పది మందిలో స్వేచ్ఛగా తిరిగే అవకాశాన్ని కోల్పోతున్నారనీ చెప్తాడు. ఉన్నత విద్యని అభ్యసించాలనుకునే దళితులకి ఎన్నో అడ్డంకులు ఎదురవుతాయని, వాళ్ల నిచ్చెన మెట్లకి అవరోధాలు కోకొల్లలని, మెరిట్ లేదనే నింద వారిని ఎప్పటికీ వెన్నాడుతుందని ఆయన బాధపడతారు. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ పూర్వ విద్యార్థి అయిన సుకుమార్‌ని అక్కడ ఏ సబ్జెక్టులో ఫెయిల్ చేశారో, ఢిల్లీలో అదే సబ్జెక్టుని ఆయన బోధిస్తున్నారు. ఇప్పటికీ ఎచ్‌సియు అదే వివక్షని కొనసాగించడాన్ని ఆయన ఖండిస్తారు.

మూడేళ్ల క్రితం వచ్చిన పుస్తకంలోని విషయాలు ఇప్పటికీ హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ వంటి ప్రతిష్ఠాత్మకమైన విద్యాలయాల్లో పునరావృతమవుతున్నాయంటే ఉన్నత విద్యా సంస్థల్లో వివక్ష ఎంతగా ఉంటుందో ప్రస్ఫుటమవుతుంది. దేశం కోసం శక్తినంతా ఒడ్డి ఆడుతున్న సింధు కులం ఏమిటో కనుక్కోవాలనే ఆరాటం కులరక్కసి కోరల పదునుని తెలియజెప్తుంది. డిగ్రీ కాలేజీల్లో దళిత విద్యార్థులతో పాటు దళిత అధ్యాపకులు కూడా ఎక్కువగానే ఉండడం వల్ల ఇబ్బంది ఉండదని, కానీ ఎచ్‌సియు వంటి చోటకి వచ్చాక తమని భయం, న్యూనత ముంచెత్తుతాయని విద్యార్థులు వాపోతారు. స్కాలర్‌షిప్ శాంక్షన్ అయ్యాక పరీక్ష పెట్టి వేధించి, పందులు కాసుకొమ్మని హేళన చేసి సెంథిల్ కుమార్ ఆత్మహత్యకి కారణమైన ప్రొఫెసర్, రోహిత్ ఆత్మహత్య తర్వాత అప్పారావు స్థానంలో విసిగా కొంత కాలం ఉన్నాడు. ఏ తప్పు చేయని విద్యార్థులు ఆత్మహత్యకు పాల్పడితే, ఆ ఆత్మహత్యల్ని ప్రేరేపించిన అధ్యాపకులు పదోన్నతులు పొందుతుంటే, ఇదెక్కడి న్యాయం అని అడిగినవారంతా దేశ ద్రోహులైపోయారు.

'గనుల్లో, కార్ఖానాల్లో, కూలి పనుల్లో ఒంటికి మట్టి, సున్నం, బొగ్గు పూసుకుని వెలివేతకి గురయ్యే పిల్లలు పెద్దయ్యాక హోటళ్లలో, స్కూళ్లలో, హాస్టళ్లలో కుల మత ఛాందసాలకి, తిట్లకి బలవుతారు. బాధ, దుర్భర పరిస్థితులు, రక్షణ లేకపోవడంవల్ల వాళ్లు ఓర్పుగా ఉండడం నేర్చుకుంటారేమో గాని, వారి ప్రతి ఊపిరిలో నిట్టూర్పులే, మెలిపెట్టే బాధలే' అన్నాడు కేశర్ శివం. అలాంటి మెలిపెట్టే బాధనే మనందరికీ మిగిల్చాడు రోహిత్ వేముల. కళ్లు తెరిచినా మూసినా చిరునవ్వుతో ప్రశ్నిస్తున్న అతని ముఖమే కనిపిస్తుంది. 'నాలాంటి వారికి మీరు ఏమి న్యాయం చేస్తా'రనే సవాల్ వినిపిస్తుంది. తప్పులు చేస్తున్నవారు విర్రవీగడమేమిటి, బలైపోయేవారు ఒదిగి ఉండడమేమిటని నిలదీస్తున్నట్లు ఉంటుంది. రకరకాల భావాల కలబోతగా, చర్చకి ఆస్కారమిచ్చే కేంద్రాలుగా, జ్ఞానాన్ని వికసింప చేయవలసిన ఉన్నత పీఠాలుగా ఉండవలసిన విద్యాలయాలు వెలివాడలుగా ఉండడాన్ని ప్రశ్నించే ఈ పుస్తకం మనల్ని ఆలోచింప చేస్తుంది. లోలోతుల్లో జరిగే అమానుషాలని వెలికి తీస్తుంది.

*(రచయిత పిల్లల డాక్టర్)* వీ

విశాలాంధ్ర దిన పత్రికలో ఉప సంపాదకుడుగా ఉన్న కామ్రేడ్ అవసరాల సూర్యారావు సైకిలు మీద బందరు కాలువ గట్టున ఇంటికి వెళ్తూ పడ్డారు. ఎముకలు విరిగాయి. కొన్నాళ్లపాటు ఇంటిపట్టున ఉండవలసి వస్తుంది. మరి ఇల్లు గడిచేదెలా? అప్పుడు సూర్యారావుకి గురజాడ రచనలు గుర్తొచ్చాయి. విజయనగరం ప్రాంతంవాడు కావడం వల్ల ఆ మాండలికాలతో పరిచయం ఉంది. గురజాడ రచనలు విశాలాంధ్ర ప్రచురణాలయం (వి.పి.ఎచ్.) ప్రచురించేందుకు వీలుగా ఇంటి పట్టున ఉండి పరిష్కరించే అవకాశం ఇవ్వమని అడిగారు. వి.వి.స. కార్యదర్శి కాట్రగడ్డ రాజగోపాలరావు అంగీకరించారు. ముత్యాల సరాలతో (1953) మొదలు పెట్టి ఒక్కొక్క సంపుటాన్ని సూర్యారావు పరిష్కరించగా విపిఎచ్ ఏడు సంపుటాలు ప్రచురించింది. తర్వాత ఎనిమిదవ సంపుటంగా 'అసమ్మతి పత్రం' వెలువడింది. అవసరాల సూర్యారావు 'ఆణిముత్యాలు'లో సంస్కర్త హృదయం కథని కాబోలు అనువదించారు. బహుశా అలాగే డైరీలు, లేఖలు మొదలైనవీ అనువదించారు.

1962 ప్రాంతాల్లో కాబోలు హైదరాబాద్‌లో తాపీ ధర్మారావు, సినారె, ఏటుకూరి ప్రసాద్, పోరంకి దక్షిణమూర్తి, అబ్బూరి గోపాలకృష్ణ, పోతుకూచి సాంబశివరావు మొదలగువారు గురజాడ పరిశోధన కేంద్రంగా ఏర్పడి వాటిని తెచ్చుకొని పనిచేశారు. నాకు తెలిసిన ఫలితాలు :- పోతుకూచి యునిలిట్ గురజాడ ప్రత్యేక సంచిక ప్రచురణ.

గోపాలకృష్ణ విజయనగరం ప్రాంతం పర్యటించి గురజాడ సమకాలీనులని కలుసుకొని ఆ ముచ్చట్లు రాశారు. దక్షిణమూర్తి అనువాదం 'డిసెంటు పత్రం' ప్రచురణతో 'అసమ్మతి పత్రం' వెనుకబడింది. ప్రజాశక్తి 1944 - 48 కాలంలో ప్రచురించినవి అవసరాల సంపాదకుడిగా ఉన్నవి వచ్చాక వెనుకబట్టాయి.

ఆ ట్రంకుపెట్టెలో ఏమున్నాయో జాబితా ఏమీలేదుకాని పెట్టెలు మాత్రం ప్రయాణం చేశాయి. తుమ్మల వెంకట్రామయ్యగారి జ్ఞాపకం ప్రకారం 'మహోదయం' రచన కోసం ఆ పెట్టెల్ని కెవి. రమణారెడ్డి కావలి తీసుకొని వెళ్లారు. ఆ తర్వాత కేంద్ర సాహిత్య అకాడమికి గురజాడ జీవితం, కృషి మోనోగ్రాఫ్ కోసం రాజగోపాలరావుగారిని అడిగి విఆర్. నార్ల తీసుకున్నారు. నార్ల రచన సాగలేదు. సాహిత్య అకాడమిని మళ్లీమళ్లీ గడువు పొడిగింపులడుగుతూ వచ్చారు. అవసరాల అనువాదాలు తప్పులనీ, ఆయన ఆంగ్ల మూలాన్ని సరిగా చదివి అర్థం చేసుకోలేకపోయారనీ, కాబట్టి అవసరాల పరిష్కరించిన గురజాడ రచనలకి ప్రామాణికత లేదని అందరికీ చెప్పడం పునర్ముద్రించవద్దని అనడం మొదలు పెట్టారు. ఫలితంగా గురజాడ రచనల పునర్ముద్రణకి విపి హెచ్ ఆలోచనలో పడింది.

పురాణం సుబ్రహ్మణ్యశర్మ, గొల్లపూడి మారుతీరావు సహకారంతో ఆంగ్ల మూలాన్ని పరిష్కరించే కార్యక్రమం తలపెట్టారు నార్ల. 'మహోదయం' వెలువడ్డాక కెవి రమణారెడ్డిని కూడా ఈ కమిటీలోకి ఆహ్వానించారు. కెవిఆర్ తుమ్మలకి జాబు రాశారు. తన హోటల్ ఖర్చులు వగైరా విపిఎచ్ భరిస్తే ఆ కమిటీలో చేరడానికి అంగీకరించుతానని, 15 - 20 రోజులు హోటల్లో ఉండవలసి రావచ్చునని. తుమ్మల, నేను సంప్రదించుకుని సరేనన్నాం. నాకు తెలిసినంతలో అప్పటికి నార్లకి గురజాడ గురించి సదభిప్రాయం లేదు. కాబట్టి రమణారెడ్డి ఆ కమిటీలో ఉండడం మంచిదనుకున్నాను.

ఒకరోజు తుమ్మల నేనెరుగని కొన్ని పై విషయాలు చెప్పి గురజాడ రాతప్రతులు నార్లగారి దగ్గరున్నాయి, ఆయన నేను రాజగోపాలరావు గారి దగ్గర తీసుకున్నాను కాబట్టి నా పని అయ్యాక వాటిని ఆయనకే తిరిగి ఇస్తానంటున్నారట, పైగా హైదరాబాదుకి వెళ్లిపోతారట అంటే మనకి తిరిగి వచ్చే అవకాశం లేదు. కాబట్టి నార్లని మీరడిగితే మనకి వాపసు ఇస్తారేమో ప్రయత్నించమన్నారు.

అప్పట్లో విజయవాడ ఏలూరు రోడ్డులో విపిఎచ్ ఆఫీసు వెనుక భాగంలోను, షోరూము (అప్పటికది విపిఎచ్ కాదు) ముందు భాగంలోనూ ఉండేది. నార్ల తరచు వచ్చి కొత్త పుస్తకాలు చూసేవారు. ఆ సందర్భంలో ఆయనతో పరిచయం ఏర్పడింది. చాలా ఆప్యాయంగా ఉండేవారు. పిచ్చాపాటి మాట్లాడేవారు. ఒకరోజు ఇంగ్లిష్‌లో టైపు చేసిన కాగితాలు కొన్ని తీసుకొని వచ్చి గురజాడ రచనల పరిష్కరణ పూర్తయిందని, టైపు చేయించానని చెప్పి, మీరు ప్రచురిస్తారా అని అడిగారు. మా సంపాదకవర్గానికి చూపించకుండా, సంప్రదించకుండా నేనేమీ చెప్పలేనన్నాను. ఆయన ఆ కాగితాలు నాకియ్యకుండా తీసుకొని వెళ్లారు. ఇటీవలి కాలంలో వాటి ఉనికి గురించి తెలుసుకొనే ప్రయత్నం చేశాను కాని జాడ తెలియలేదు.

ఈ చనువుని పురస్కరించుకొని ఆయన విజయవాడ నుంచి మకాం మారే ముందు గురజాడ రాతప్రతుల గురించి అడిగాను. అలాగేనని తిరిగి ఇచ్చారు. తర్వాత వాటిని చూస్తే చాలా శిథిలావస్థలో ఉన్నాయి. వీటిని సంరక్షించగల సమర్థత విపిఎచ్‌కి లేదు. కాని సంరక్షించే మార్గాలు వెతకాలి. ఆలోచించగా స్టేట్ ఆర్కివ్స్ సహాయం తీసుకోవచ్చు నేమోననిపించింది. వారి దగ్గర తగిన అవకాశాలున్నాయి.

హైదరాబాద్ వెళ్లి స్టేట్ ఆర్కివ్స్ డైరెక్టర్ కృష్ణ శాస్త్రిగారిని కలిశాను. ఈ రాత ప్రతులని దఫదఫాలుగా మీకు అప్పగింత పెడతాం. మీరు వాటిని మైక్రోఫిల్మ్ చేసి మాకు ఒక కాపీ ఇవ్వండి, పరిశోధకుల సౌకర్యం కోసం మీ విశాఖ, తిరుపతి కేంద్రాల్లో కూడా అందుబాటులో ఉంచండి అని కోరాను. ఆయన అంగీకారం పొందాక తిరిగి వెళ్లి సంపాదకులతో, జనరల్ మేనేజరుతో వివరాలు చెప్పగా వారు అంగీకరించారు. తర్వాత మిగతా ప్రక్రియ పూర్తయింది. గురజాడ రాతప్రతులు పదిలపరిచి విస్తృత స్థాయిలో ముందు తరాలకి అందించ వీలయింది.

'కళింగదేశ చరిత్ర'కి సంబంధించిన నోట్సు ఫైలును 1950లలో మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికి అందజేశామని, అది ప్రచురణకి అనువుగా లేదని అభిప్రాయం ఇచ్చారని, కాని ఆ ఫైలు తిరిగి రాలేదని తుమ్మల చెప్పారు. దాని జాడ అప్పట్లో తెలియలేదు కాని చనిపోక ముందు బూదరాజు రాధాకృష్ణ ఆ ఫైలు మల్లంపల్లి వారి ద్వారా ఆంధ్ర విశ్వవిద్యాలయం లైబ్రరీకి చేరిందని అప్పట్లో లైబ్రేరియనుగా ఉన్న అబ్బూరి రామకృష్ణారావుగారు దాన్ని ఫెయిర్ కాపీ చేయమని తన అసిస్టెంటుకిచ్చారని, ఆయన రిటైరయ్యేవరకు ఆపని పూర్తి చేయలేదు, ఫైలును తిరిగి ఇయ్యలేదని చెప్పారు. అనకాపల్లి కాలేజీలో ఉన్న తల్లాప్రగడ సత్యనారాయణగారి ద్వారా తను ఆ ఫైలు గురించి విఫల ప్రయత్నం చేసినట్లు చెప్పారు. విశాఖపట్నం నుంచి తను కూడా ప్రయత్నించి సాధించలేకపోయినట్లు చలసాని ప్రసాద్ చెప్పారు.

ఈ 'కళింగదేశ చరిత్ర' ఫైలు బయట పడకపోవడమూ, నార్ల నేతృత్వంలో కమిటీ పరిష్కరించిన ఫారాల ఇంగ్లిషు టైపుప్రతి కూడా బయట పడకపోవడమూ నేడు మిగిలిన లోటులు.

గురజాడ రచనల రాత ప్రతులని భద్రపరచి, అనువదించి, పరిష్కరించి, ప్రచురణకు కారకులైన గురజాడ రామదాసు, సెట్టి ఈశ్వరరావు, అవసరాల సూర్యారావుల స్మరిస్తూ, నివాళులర్పిస్తూ.

*(రచయిత అనేక దశాబ్దాలుగా ప్రచురణ రంగంలో ఉన్నారు)* వీ

# సాంకేతిక ఉగ్రవాదంపై కార్మిక ప్రతిఘటన

*శ్రమను తగ్గించి వెసులుబాటు కల్పించాల్సిన సాంకేతిక పరిజ్ఞానం పెట్టుబడిదారుల చేతుల్లో బందీ అయి శ్రామికులను ఉపాధికి దూరం చేస్తూ మానసిక ఒత్తిడికి గురిచేస్తోందంటూ, ఈ నిర్బంధాన్ని శ్రామికులు ప్రతిఘటించిన తీరును వివరిస్తున్నారు* **పి. ప్రసాద్**

**17-19** శతాబ్దాల యూరప్ చరిత్రంతా సారాంశంలో పారిశ్రామిక విప్లవాల చరిత్రే. దానికొక ఉత్ప్రేరకంగా సాగిందే శాస్త్రీయ, సాంకేతిక, వైజ్ఞానిక విప్లవం. ప్రతి నూతన వైజ్ఞానిక ఆవిష్కరణ రెండు వైపుల మొనదేలిన కత్తివంటిదే. ప్రతి నూతన యంత్రావిష్కరణ అధిక భౌతిక సంపదను సృష్టించింది. దానితోపాటు శ్రమ జీవులపై పనిభారాన్ని కూడా పెంచింది. సిద్ధాంతపరంగా శాస్త్ర సాంకేతిక పురోగతి అద్భుతమైనదే. అదే సమయంలో అది ఆచరణలో మానవ జాతికి కన్నీటిని కూడా మిగిల్చింది. అందుకు కారణం దానికి స్వాతంత్ర్యం లేకపోవడమే. అది అధికారంలో ఉన్నోళ్ల చేతుల్లో సాధనం కావడమే. దానికి స్వంత మెదడు, కళ్లు, చెవులు, కాళ్లు, చేతులు ఉండకపోవడమే. వర్గ సమాజంలో అది వర్గ దోపిడీకి సాధనంగా మారడమే. అందుకే చారిత్రకంగా కార్మికోద్యమం పురుడు పోసుకుంటున్న తొలి దశలో తమ కష్టాలకు, కన్నీళ్లకు ఆధునిక యంత్రాలే కారణమని నాటి కార్మికవర్గం భావించింది. వాటిపై సాగించిన అసంకల్పిత ప్రతీకార ప్రక్రియే యంత్ర విధ్వంస ఉద్యమం (లుడైట్ మూవ్‌మెంట్)గా చరిత్రలో పేరొందింది. అయితే అది గత చరిత్రకు జ్ఞాపక చిహ్నం మాత్రమే కాదు. వర్తమాన చరిత్రలో కూడా సజీవమైనదే. అందుకు ప్రబల సాక్ష్యంగా నిలిచే ఒక వర్తమాన కార్మిక ప్రతిఘటనానుభవం మన ఎదురుగా ఉంది.

పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు నగరానికి రెండు కిలోమీటర్ల దూరాన కొత్తూరు గ్రామ సమీపంలో శ్రీకృష్ణ హెస్సియన్ (వాడుక భాషలో కొత్తూరు జూట్ మిల్లుగా పేరొందింది) ను కల్‌కత్తాకి చెందిన ఈస్టిండియా కమర్షియల్ కంపెనీ లిమిటెడ్ స్థాపించి ఒకటిన్నర దశాబ్దం దాటింది. ఎపిలో ఏలూరు, గుంటూరు జూట్ మిల్లులతో పాటు రాయ్‌పూర్‌ల (చత్తీస్‌గడ్)లో మొత్తం నాలుగు జూట్ మిల్లులను ఇదే యాజమాన్యం కలిగి ఉంది. దేశంలోని అన్ని జూట్ మిల్లులలో సాధారణ జూట్ ఉత్పత్తులు గోనె సంచులు, పురికొస తయారవుతాయి. తద్భిన్నంగా క్రిష్ణా హెస్సియన్‌లో పట్టాలు తయారవుతాయి. ఇవి అత్యంత మన్నికగలవీ, ఖరీదైనవీ. వీటిని యుద్ధ సామాగ్రి, ఆయుధాల రవాణాలో కవచంగా (కోడిగుడ్లకు అట్టపెట్టెల వంటి) ఉపయోగిస్తారు. శీతల దేశాలలో ఇళ్ల కిటికీలకు పట్టాలుగా కూడా వేలాడదీస్తారు. ఇంకా ఇళ్లలోపల నేల మీద పరిచే అతి ఖరీదైన తివాచీలకు సపోర్టు కవర్స్‌గా కూడా వాడతారు. ముఖ్యంగా యుద్ధ పరిశ్రమ వీటికి ప్రధాన మార్కెట్. ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, లిబియా, సిరియాల పరిణామాలు వీటికి గిరాకీని సృష్టించాయి. సంచులు తయారు చేసే జూట్ మిల్లులను స్యాకింగ్ మిల్లులంటారు.

పట్టాలను ఉత్పత్తి చేసే జూట్ మిల్లులను హెస్సియన్ మిల్లులుగా పిలుస్తారు. ఒకవైపు సింథటిక్ లాబీ ఎదుట గోనె సంచుల మిల్లులు లాకౌట్‌లకు గురవుతున్నాయి. తద్భిన్నంగా యుద్ధాల వల్ల హెస్సియన్ విభాగపు మిల్లులు మూడు పువ్వులు ఆరు కాయలుగా లాభాలు గడిస్తున్నాయి. దేశంలో ఏసియన్ జూట్ మిల్లులు అరుదుగా ఉన్నాయి. అందులో క్రిష్ణా ఏసియన్స్ మిల్లు ఒకటి. పైగా దేశంలో మొత్తం హెస్సియన్ మిల్లుల్లో ఇది నెంబర్ వన్ స్థానంలో ఉంది. అందులో ఈ మధ్య సిసి కెమెరాల బిగింపు ప్రక్రియకి వ్యతిరేకంగా ఒక వినూత్న కార్మిక ప్రతిఘటన సాగింది. ఇది జీత భత్యాలు, జీవన ప్రమాణాల పెంపుదలకై సాగే సాధారణ కార్మిక పోరాటాలకు భిన్నమైనది. ఈ పోరాటాన్ని అణచివేసేందుకు జిల్లా కలెక్టర్, ఎస్‌పిలు నేరుగా రంగ ప్రవేశం చేశారు. ఆచరణలో రాజ్యం దాడిగా మారింది. దీని విశిష్టత నేడు వెలుగులోకి రావలసి ఉంది. దీని నుంచి కార్మిక వర్గం తగిన రాజకీయ గుణపాఠాలను కూడా తీసుకోవలసి ఉంది.

నేటి సమాజంలో సిసి కెమెరాలు సమాజానికి ఉపయోగపడే 'భద్రతా సాధనాలు'గా ప్రాచుర్యం పొందాయి. అవి 'ఉగ్రవాదులు' 'తీవ్రవాదులు' 'ఆటంకవాదుల' నుంచి ప్రజలకు రక్షణ కల్పిస్తాయన్న ప్రచారం నేడు బాగా వ్యాప్తిలోకి వచ్చింది. ఈ భావనే నేడు మధ్యతరగతి బుద్ధిజీవుల్లో స్థిరపడిపోయింది. సాధారణ ప్రజల మెదళ్లలో కూడా క్రమంగా ఈ భావన బలపడుతున్నది. తద్భిన్నంగా అదే సిసి కెమెరాలను తమ పాలిటి శాపంగా కార్మిక వర్గం భావిస్తే, వారిని సమాజం తొలుత వింత మనుషులుగా భావించే అవకాశం ఉంది. సిసి కెమెరాల పట్ల సమాజంలో ఏర్పడుతున్న 'దైవభావన'ను 'అపవిత్రం' చేసే, 'అప్రాచ్యులు'గా కూడా వారు పిలవబడవచ్చు. అభివృద్ధికీ, సాంకేతికతకూ, విజ్ఞానానికీ, సమాజ 'భద్రత'కు ప్రతీకగా నేడు పేరొందిన సిసి కెమెరాల మీద కొత్తూరు జూట్ మిల్లు కార్మిక వర్గం 'అపవిత్ర' యుద్ధం చేసింది. అది రాజ్యదాడికి గురయింది. అది 'అభివృద్ధి నిరోధకులు'గా; 'అజ్ఞానులు'గా, 'మూర్ఖులు'గా నిందలకు గురయింది. చివరకు 'నాగరిక' ప్రజలు కూడా కార్మిక వర్గాన్ని చిన్న చూపు చూశారు. అయినా అది నీరుగారి పోలేదు. నెలరోజుల పాటు సమ్మె చేసింది. సిసి కెమెరాల పట్ల సమాజంలో ఏర్పడ్డ 'పేద భావన'ను అది గేలిచేసింది. పెట్టుబడిదారీ వర్గ రహస్య ఎజెండా గుట్టును రట్టుచేసింది. చివరకు విజయాన్ని సాధించింది. సాధారణ సమాజ గమనం 'వాలు ఈత' దశలో కొనసాగే కాలంలో ఎదురీతకు దిగింది. తరువాత సమాజ గమన దిశను మార్చాల్సిన చోదక పాత్రను కార్మిక వర్గం చేపట్టింది.

2015 ఏప్రిల్, మే నెలల నుంచే భద్రత పేరిట సిసి కెమెరాల బిగింపుకు యాజమాన్యం పూనుకున్నది. మొదట మిల్లు గేట్ దగ్గర, పాలనా కార్యాలయాల్లో బిగించింది. అభ్యంతరం ఎదురుకాలేదు. డిసెంబర్ నుంచే మిల్లు లోపల ప్రధాన మార్గాలలో బిగించజూసింది. 2016 ఫిబ్రవరి, మార్చ్‌లలో కార్మికులు పనిచేసే ప్రదేశాలలో కూడా బిగించజూసింది. గత ఏడాది జూలైలో జరిగిన గుర్తింపు ఎన్నికలలో గెలుపొందిన ఇఫ్టూ యూనియన్ ఒక స్పష్టమైన వైఖరిని చేపట్టింది. మిల్లులోకి బయటి నుంచి వ్యాపారులు, వర్తకులు, ఇతర సందర్శకులు రావడానికి వీలుండే స్థలాల్లో (మిల్లు గేటు పాలనా కార్యాలయం వాహన పార్కింగ్, ప్రధాన రహదారి వంటివి) భద్రత కోసం బిగించుకోవడానికి అభ్యంతరం లేదన్న వైఖరిని యూనియన్ చేపట్టింది. కార్మికులు యంత్రాల మీద పనిచేసే ప్రదేశాలలో బిగించడానికి అభ్యంతరాన్ని తెలియజేసింది. ఆచరణలో ఇది పెట్టుబడిదారుడికీ, కార్మిక వర్గానికీ మధ్య తీవ్ర ఘర్షణను పెంచి సమ్మెకు దారితీసింది.

భద్రత పేరుతో కార్మికులను అభద్రతకు గురిచేసే లక్ష్యంతో సిసి కెమెరాలను యాజమాన్యం పథకం ప్రకారం బిగిస్తున్నదని యూనియన్ ప్రచారాందోళనకు దిగింది. మూత్ర విసర్జనకెళ్లినా, ఉమ్మినా, దగ్గినా, తుమ్మినా ప్రతి కదలికను ప్రత్యేక పర్యవేక్షణ పరిధిలోకి తేవడం యాజమాన్య లక్ష్యంగా యూనియన్ ఆరోపించింది. కార్మిక చట్టాల పరిధిలో మిగిలిపోయిన కనీస స్వేచ్ఛను కూడా కార్మికులకు లేకుండా హరించే చర్యగా ఆరోపించింది. ప్రతి చిన్న కదలికలను పర్యవేక్షించడం ద్వారా కార్మికుల మీద కక్ష సాధింపు చర్యలకి ఉద్దేశించిన ప్రక్రియగా విమర్శించింది. కార్మిక వర్గాన్ని ఆధునిక బానిస వర్గంగా మార్చుకొని పనిభారాన్ని పెంచుకునే రహస్య ఎజెండా ఉందని ఆరోపించింది. అందులో భాగంగా చేపట్టిన ప్రక్రియగా కూడా యూనియన్ విమర్శించింది.

అది నిజమేనని యాజమాన్యం ఒప్పుకోదు. బుకాయింపుకోసం అది 'భద్రత' కోసమేనని పునరుద్ఘాటించింది. అయితే భద్రత ఎవరి నుంచి? ఎవరి కోసం? అనే ప్రశ్నను యూనియన్ సంధించింది. బయటి వాళ్ల నుంచి కార్మికుల భద్రతకోసం బిగిస్తున్నట్టు చివరకు జవాబిచ్చింది. మిల్లులోపల పని ప్రదేశాలకు అనుమతి లేకుండా బయటి వాళ్లు రాలేదు. అయినపుడు బయటి వాళ్ల నుంచి కార్మికులకు ప్రమాదం ఎందుకుంటుందని యూనియన్ ప్రశ్నించింది. ఈ ప్రశ్నకు జవాబు దాటవేసింది. కుంటి సాకులతో మరో వివరణకి దిగింది. తమది ఎగుమతి ఆధారిత పరిశ్రమ అయినందున విదేశీ కొనుగోలు ఏజెన్సీలు మిల్లుల్లో నిర్దిష్ట భద్రతా ప్రమాణాలుండాలని షరతు విధించాయని వివరణ ఇచ్చింది. అయితే వాటిని చూపించమని యూనియన్ ప్రశ్నించింది. కొన్ని పత్రాలను ఎట్టకేలకు చూపించింది. అవి యాజమాన్య వాదనకు అనుగుణంగా లేవు. అయినా సార్వభౌమాధికారతకి లోబడని ఏ ఒక్క విదేశీ వర్తక ఏజెన్సీల షరతులు కూడా ఆమోదయోగ్యం కాదని యూనియన్ స్పష్టం చేసింది.

కార్మికుల ఆమోదంతో రూపొందే 'ఫ్యాక్టరీ స్టాండింగ్ ఆర్డర్స్'తో సంబంధం లేని ఇలాంటి ప్రక్రియకి అంగీకరించేది లేదన్న మౌలిక ప్రశ్నను కూడా యూనియన్ లేవనెత్తింది. అయినా యాజమాన్యం ఏకపక్షంగా బిగింపు ప్రక్రియను కొనసాగించింది. త్వరలో వాటి ఫంక్షనింగ్‌ను ఆపరేట్ చేయించే లక్ష్యంతో వేగంగా నిర్మాణ పనులకు దిగింది. ఈ క్రమంలో 2016 మే 4న గుర్తింపు యూనియన్ నేతృత్వంలో కార్మిక వర్గం మెరుపు సమ్మెకు దిగింది.

ఈ మిల్లులో నాలుగు వందల మంది మహిళా కార్మికులతో పాటు మొత్తం రెండున్నర వేల మంది కార్మికులు పనిచేస్తున్నారు. వీరిలో తొంభై శాతం మంది యువతీ, యువకులే. స్కూలు ఫైనల్ వరకూ చదివిన వాళ్లు సుమారు సగం మంది ఉంటారు. సాధారణ స్యాకింగ్ జూట్ మిల్లుల ఉత్పత్తుల కంటే, ఏసియన్ ఉత్పత్తుల తయారీకి ఒకింత ఎక్కువ నైపుణ్యం కావాలి. ఈ మేరకు కొత్తూరు జూట్ మిల్లు కార్మికులు ఒకింత ఎక్కువ నిపుణ కార్మికులే. వారిలో చైతన్యాన్ని ప్రేరేపించడానికి అదొక ఉత్ప్రేరకంగా ఉపయోగపడుతుంది. ఒకవైపు శ్రమ దోపిడీకి సిసి కెమెరాలను యాజమాన్యం పదునైన ఆయుధంగా ఎంచుకున్నది. మరోవైపు వాటిని ప్రతిఘటించడంలో కార్మికవర్గం కూడా పదునైన పాత్రను పోషించింది.

ఈ సమ్మె చట్ట విరుద్ధమైనదిగా రాష్ట్ర ప్రభుత్వం చేత నిషేధపు ఉత్తర్వును ఇప్పించే పథకం రూపొందింది. నిషిద్ధ సమ్మెకు సారథ్యం వహిస్తుందన్న బూచితో యూనియన్ పై ఉక్కుపాదం మోపాలనీ, తద్వారా కార్మికులను ఆధునిక బానిసలుగా మార్చుకోవాలనీ యాజమాన్యం వ్యూహం పన్నింది. ఈ భౌతిక అణచివేతకు ముందు ప్రజల 'సమ్మతి' కోసం ఒక మానసిక యుద్ధానికి దిగింది. నాలుగైదు కరపత్రాలను దిన పత్రికల ద్వారా నగర ప్రజలకు విస్తృతంగా పంపిణీ చేసింది. కార్మికులు మంచివాళ్లేననీ, వారిని కార్మిక సంఘమే తప్పుదోవ పట్టిస్తుందనీ ప్రచారం చేసింది. భద్రత కోసం తప్ప కార్మికుల మీద పనిభారం మోపే దురుద్దేశ్యం తనకు లేదని ప్రజల ఎదుట బహిరంగంగా ప్రకటించింది. (రాత పూర్వక హామీకి సిద్ధపడలేదు సుమా) కార్మిక శాఖలో ఒక రాష్ట్ర స్థాయి ఉన్నతాధికారి సంపూర్ణ వత్తాసు ఉంది. ఆయన స్వస్థలం ఏలూరే, పైగా కార్మిక శాఖలో చేరక ముందు ఏలూరు జూటు మిల్లు ఉద్యోగి. ఆయన అండతో కార్మికశాఖ అధికారి వద్ద సంప్రదింపుల ప్రక్రియను త్వరగా ముగించజూసింది. (అక్కడి ఫెయిల్యూర్ రిపోర్టు రాసి ప్రభుత్వానికి పంపించకుండా సమ్మెను నిషేధించడం చట్ట రీత్యా సాధ్యం కాదు) కానీ యూనియన్ న్యాయపరంగా మెలకువలు పాటించడంతో సంప్రదింపుల ప్రక్రియను క్లోజ్ చేయడం సాధ్యం కాలేదు. 2016 మే 16 నాటి చర్చల్లో ఈ ప్రతిష్టంభన ఏర్పడింది. దీనితో యాజమాన్యం ఆగ్రహంతో ఊగిపోయింది. ఆ నాలుగో రోజే (19వ తేదీ) జిల్లా కలెక్టర్ వద్దకు చర్చల వేదిక మారింది. పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టర్ కాటంనేని భాస్కర్‌కు ఒక ప్రత్యేకత ఉంది. ఆయనకి దళిత వ్యతిరేకిగా, ఆదివాసి వ్యతిరేకిగా, ప్రజాస్వామ్య వ్యతిరేకిగా పేరున్నది. ఆయన చంద్రబాబు కుటుంబానికి సమీప బంధువన్న సంగతిని పక్కనపెడదాం. చంద్రబాబు తలకాయలోని సరళీకరణ ఆలోచనలకు ఆయనొక జిరాక్స్ కాపీ. జిల్లా ప్రభుత్వోద్యోగులతో రెండుసార్లు తగువు పెట్టుకొని భంగపడ్డాడు. ఒకసారి జిల్లా ఎన్‌జిఓ అసోసియేషన్ ఈయన వైఖరికి నిరసనగా సమ్మెకు దిగింది. కలెక్టర్ తలవంచక తప్పలేదు. ఒకసారి పౌరహక్కుల సంఘం రాష్ట్ర కార్యదర్శి ఎన్. శ్రీమన్నారాయణపై చేయి చేసుకున్నాడు. మరోసారి కార్మికులందరితో రాస్తారోకో చేస్తున్న ఇఫ్టూ రాష్ట్ర కోశాధికారి యు. వెంకటేశ్వరరావును కారుదిగి స్వయంగా చొక్కాపట్టుకొని పోలీసులకు

అప్పగించి అరెస్టు చేయించాడు. తన కార్యాలయానికి బాధితులు తప్ప వారి పక్షాన ప్రాతినిధ్య సంఘాలు ఫిర్యాదులివ్వకూడదనే శాసనాలను అమలు చేయిస్తున్నాడు. ఆయన దగ్గరకు వేదిక మారిందంటేనే ఏం జరుగుతుందో ఊహించవచ్చు.

నాటి చర్చల్లో కలెక్టర్‌తో పాటు జిల్లా ఎస్‌పి, కార్మికశాఖ అధికారులైన జెసిఎల్, డిసిఎల్‌లు ఉన్నారు. అది చర్చల ప్రక్రియ కాదు. ఏకపక్ష శాసనాలకి అదొక వేదికగా మారింది. సిసి కెమెరాలు యాజమాని ఇష్టమని కితాబులిచ్చాడు. దాన్ని వ్యతిరేకించే హక్కు ఎవరికీ లేదని హెచ్చరించాడు. కలెక్టర్ వన్ మ్యాన్ షో వలె సాగింది. యూనియన్ నాయకులు ఏమాట చెప్పాలని ప్రయత్నించినా ఒప్పుకోలేదు. ఏ వివరణ ఇవ్వజూసినా అనుమతించలేదు. కలెక్టర్‌గారి నుంచి ఒకే జవాబు వచ్చింది. '48 గంటల్లో సమ్మె విరమించకపోతే కేసులు పెట్టి మిల్లును నడిపిస్తాం' అన్న ఏకైక హెచ్చరిక తప్ప మరో మాటలేదు. అంతటి నిరంకుశ వాతావరణంలో కూడా 'కార్మికులు సర్వసభ్య సభ జరిపి వారి అభిప్రాయాల ప్రకారం నడుచుకుంటాం' అని యూనియన్ స్పష్టం చేసింది. 'నేను కలెక్టర్‌గా చెబుతుంటే, ఇంకా కార్మికుల అభిప్రాయాలకు కట్టుబడతామనడమేమిటి?' అంటూ ఆయన మండిపడడం జరిగింది. దీని తర్వాత అంతా ఉత్కంఠత వ్యాపించింది. తొత్తు కార్మిక సంఘాలు కలెక్టర్ ఆదేశాన్ని వేదమంత్రంగా ప్రచారం చేయసాగాయి. వామపక్ష కార్మిక సంఘాలు మౌనం పాటించాయి. అవి యాజమాన్యానికి బలం చేకూర్చే క్రియాశీల వైఖరినే చేపట్టాయి. సమాజంలో సిసి కెమెరాలకు 'సమ్మతి' ఉంది. ప్రభుత్వం యంత్రాంగం ప్రత్యక్ష దాడికి దిగింది. ఇతర కార్మిక సంఘాల కార్మిక వ్యతిరేక వైఖరితోడైంది. దీనితో పరిస్థితి మారింది. ఒకట్రెండు రోజుల పాటు కార్మికులలో ఒక భయోత్పాత పరిస్థితిని కలిగించింది. అలాంటి గడ్డుపరిస్థితులలో 2016 మే 22న కార్మిక సభ జరిగింది. ఇది ఎదురీత వాతావరణంలో జరిగింది. అయినా ఈ సభ ఒక రాజకీయ దిశానిర్దేశం చేసింది. కార్మికులలో నిరాశా నిస్పృహలను తొలగించింది. ప్రభుత్వం ఉక్కుపాదంతో అణచివేయ జూసినా, చలించకుండా కార్మిక వర్గం ఉద్యమించాలని సభ సందేశమిచ్చింది. చట్టబద్ధమైన భద్రతతో కూడిన ఒప్పంధం ఉభయ పక్షాల మధ్య జరగకుండా, ఏకపక్షంగా సిసి కెమెరాల అమలుకు అంగీకరించకూడదని సభ ఏకగ్రీవంగా తీర్మానించింది. కార్మికవర్గ రాజకీయ ప్రతిష్ట, ఆత్మగౌరవం, భద్రత, రక్షణలతో కూడిన పోరాటంగా భావించింది. కలెక్టర్ అల్టిమేటమ్‌కు తలవంచకుండా సమ్మె పోరాటాన్ని కొనసాగించాలని కూడా సభ తీర్మానించింది. ఇదే విజయానికి బాట వేసింది. ఆ తర్వాత కూడా అనేక మలుపులు చోటు చేసుకున్నాయి. ఎట్టకేలకు 2016 జూన్ 2న జాయింట్ లేబర్ కమీషనర్ సమక్షంలో ఉభయ పక్షాల మధ్య చట్టబద్ధ ఒప్పందం కుదిరింది.

అంతవరకూ 400 కెమెరాలను బిగించడానికి పూనుకున్నది. ఒక్కొక్క షిఫ్టుకు సుమారు 600 నుంచి 700 మంది వరకూ కార్మికులు పనిచేసే మిల్లులో 400 కెమెరాలు బిగించజూసింది. అంటే సగటున ఒకటిన్నర తలకాయకొక కెమెరాను బిగిస్తారు. సాంకేతిక విజ్ఞానం కూడా కార్మిక వర్గానికొక శాపంగా మార్చే ప్రక్రియకు ఇదొక నిదర్శనం. ఇప్పుడు కుదిరిన ఒప్పందంలో 'సిసి కెమెరాల పుటేజీ ఆధారంగా కార్మికుల మీద ఎలాంటి క్రమశిక్షణా చర్యలు తీసుకొనబడవు' అనే ప్రధాన క్లాజు ఉంది. యాజమాన్య రహస్య ఎజెండాను తిప్పికొట్టిన అంశం ఇది. అదే విధంగా సిసి కెమెరాలు ఎక్కడెక్కడ ఎన్నెన్ని బిగించాలో ఉభయపక్షాలు చర్చల ద్వారా ఒక అంగీకారానికి రావాలనీ, అంతవరకూ వాటిని అమలులోకి తేకూడదనీ మరో క్లాజు కూడా అగ్రిమెంటులో రాసుకోవడం జరిగింది.

నిజం చెప్పాలంటే, ప్రజాదరణ లేకపోగా అనవసరంగా సమ్మెచేస్తున్నారన్న ప్రజల అపవాదుల మధ్య ఈ సమ్మె పోరాటం జరిగింది. జీత భత్యాల వంటి సమస్యల మీద పోరాటాలు చేసే సందర్భాలలో వచ్చే కనీస ప్రజాదరణ కూడా దీనికి లభించలేదు. సిసి కెమెరాలవంటి భద్రతా సాధనాల మీద అనవసరంగా చేస్తున్న తుంటరి సమ్మెగా ప్రజలలో ఒక భావన వ్యాపించింది. ఈ పరిస్థితి సమ్మె అణచివేతకు బలాన్నిస్తుంది. అయినా మరింత గుణాత్మక క్రూర అణచివేతకు దిగకుండా, చివరకు సర్దుబాటు ఒప్పందానికి యాజమాన్యం అంగీకరించింది. అందుకొక కారణం కార్మిక వర్గం సృష్టించే ఉత్పత్తులకి గల తక్షణ గిరాకీయే ఉండతం కూడా. అంతర్జాతీయ మార్కెట్ ఒత్తిడే కారణం. కార్మిక వర్గం మీద ప్రయోగించే తక్షణ దమనకాండ తమ దీర్ఘకాలిక వ్యాపార ప్రయోజనాలకు విఘాతంగా మారే పరిస్థితులున్నపుడు పెట్టుబడిదారీ వర్గాలు వెనకడుగు వేస్తాయి. ప్రధానంగా కొత్తూరు జూట్ మిల్లు కార్మికుల ఐక్యత, చైతన్యం, నైపుణ్యం, ఉత్పాదక సామార్థ్యాల ఎదుట తమ సిసి కెమెరాల రహస్య ఎజెండాను సైతం సడలించుకోక తప్పలేదు. మరోసారి తనకు అనుకూల పరిస్థితులను సృష్టించుకొని మరో దాడికి దిగదన్న గ్యారంటీలేదు. కానీ ఇప్పుడు సాధించిన విజయానికి గల రాజకీయ ప్రాధాన్యత విస్మరించరానిది.

ఇంతకూ సిసి కెమెరాలు ఉగ్రవాదం నుంచి భద్రతకోసం ఉపకరిస్తాయా? అవే ఉగ్రవాద సాధనాలుగా ఉపయోగపడుతున్నాయా? మొదటి భావన మధ్యతరగతి, బుద్ధిజీవుల్లో స్థిరపడింది. కానీ అవి కార్మిక వర్గాన్ని అభద్రతకు గురిచేసే సాధనాలుగా కొత్తూరు జూటు మిల్లులో మారాయి. ఏలూరు నగర ప్రజలకి సిసి కెమెరాలు తప్పుగా కనిపించలేదు. కానీ ఏలూరు ప్రజల బిడ్డలైన కొత్తూరు జూటు మిల్లు కార్మికులకు అవి భయపెట్టే సాధనాలుగా కనిపించాయి. సిసి కెమెరాల పట్ల ప్రజలలోని ఈనాటి 'సమ్మతి' వారి బిడ్డలను ప్రభావితం చేయదు. పైగా తమ బిడ్డల జీవిత పాఠాలు క్రమంగా ప్రజల భావనలనే ప్రభావితం చేసి తీరుతాయి. ఈ మార్పు ఎంత నిదానంగానైనా కొనసాగవచ్చు. కానీ మార్పు క్రమం అదే దిశలో కొనసాగుతుంది. అందుకే సిసి కెమెరాల వంటి నూతన వైజ్ఞానిక, సాంకేతిక ఆవిష్కరణలను పెట్టుబడిదారీ వ్యవస్థే ఎక్కువగా దుర్వినియోగం చేస్తుంది. దాని నిజ రూపాన్ని మిగిలిన అన్ని వర్గాల కంటే కార్మిక వర్గమే అధికంగా ప్రతిఘటించి బహిర్గతం చేస్తుంది. అందుకు ఏకైక కారణం వాటి వినియోగంలో అధిక శ్రమదోపిడీని భరించేది శ్రామిక వర్గమే అయినందున! దాన్ని ప్రతిఘటించకుండా మనుగడ సాగించలేని పరిస్థితి కార్మిక వర్గానికి ఉండడం వల్లా! అందుకే మిగిలిన ప్రజలలో తన మీడియా అండతో వర్గ దోపిడీ వ్యవస్థ కలిగించిన 'సమ్మతి'ని మొట్టమొదట కార్మిక వర్గమే విచ్ఛిన్నం చేస్తుంది. అందుకు కొత్తూరు జూట్ మిల్లు కార్మికులు సాగించే తరహా పోరాటాలు ఆదర్శప్రాయంగా నిలుస్తాయి.

*(రచయిత ఐఎఫ్‌టియు జాతీయ కార్యదర్శి)* వీ

# కంప్యూటర్లు వ్యవసాయం చేస్తాయా?

***సమాజంలో శారీరక, మానసిక శ్రమల మధ్య నైపుణ్యంలో ఉండే వ్యత్యాసాలు ఆదాయాల్లో వ్యత్యాసాలుగా మారాయి కాబట్టి ప్రతి మనిషి శారీరక, మానసిక శ్రమలో నైపుణ్యం సాధిస్తే ప్రగతి సాధిస్తామని అంటున్నారు వి. వెంకట్రావు***

'కంప్యూటర్లు వ్యవసాయం చేస్తాయా?' అనే ప్రశ్నకు 'చెయ్యవు' అని జవాబు చెప్పడానికి పెద్దగా తడుముకోనక్కరలేదు. కానీ, దాదాపు ఇలాంటి ప్రశ్నే మరో రూపంలో అప్పుడప్పుడు ఎదురవుతుంటుంది. 'ఎంతసేపూ లాప్ టాప్‌లూ, డెస్క్ టాప్‌లూ, ప్రోగ్రామింగులూ, ప్రాజక్టులూ ఇవేనా? ఇవే తిండి పెట్టేస్తాయా? దేశానికి కావలిసింది కంప్యూటర్లా? వ్యవసాయమా?' ఇలాంటి ప్రశ్నలు వినపడుతుంటాయి. ఇందులో కొంత నిజమూ, కొంత అబద్ధమూ ఉంది. ఇలాంటి వాదనను సమర్థించే కథ ఒకటి ఇటీవల చదివాను. అందులో కొడుకు ఒక కొత్త రకం యాప్ తయారుచేస్తాడు. దానికి సిఎం నుండి బహుమతి లబించబోతోంది. ఆ విషయమై తండ్రి కొడుకుల మధ్య కొంత చర్చ జరుగుతుంది. చివరకు 'ఎంత కంప్యూటర్ అయినా గిద్దెడు గింజల్ని రాల్చమను అప్పుడు ఒప్పుకుంటాను నీ కంప్యూటర్ గొప్పదనం' అంటూ తండ్రి వాదనను సమర్థిస్తూ ముగిస్తాడు. అలాంటిదే మరో అపప్రద సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో పనిచేసే వాళ్లకు అనవసరంగా మితిమీరిన జీతాలిస్తున్నారని, ఈ మధ్య కాలంలో ఒకతను, ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని ఉద్దేశిస్తూ 'మీకు తేరగా జీతాలొస్తున్నాయి' అన్నాడు. అతను అన్నాడనికాదు, అలాంటి మాటలు కొంతమంది నోటి వెంట వింటూ ఉంటాం. ఇవి చర్చించాల్సిన విషయాలు. మొదట రెండో విషయం.

### సాఫ్ట్‌వేర్ ఉద్యోగస్తులకు తేరగా (ఊరకనే) జీతలొస్తున్నాయా?

ఒక సాధారణ ఉద్యోగస్తుడితో పోలిస్తే...ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగి జీతం కాస్త ఎక్కువ ఉండవచ్చు. అంత జీతం ఎందుకు ఇస్తున్నారు? ఎలా ఇస్తున్నారు? దానికి జవాబు కావాలి. మొదటి విషయం, ఏ సాఫ్ట్‌వేర్ కంపెనీ అయినా ఒక పని స్థలమే. ఒక సబ్బుల కంపెనీ, ఒక బట్టల కంపెనీ, ఒక వ్యవసాయ క్షేత్రం ఎలాంటిదో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీ కూడా అలాంటిదే. కాకపోతే ఇక్కడ ఎసి రూములూ, అద్దాలూ, కాస్త అందంగా నీట్‌గా ఉంటాయి. అంతే తప్ప అంతకన్నా ఏమీ లేదు. అన్ని కంపెనీల్లోలాగే, అక్కడ కూడా ఉత్పత్తులు తయారవ్వాలంటే.. ముడి పదార్థాలూ, శ్రమ పరికరాలూ, కార్మికులూ ఉన్నట్లే అక్కడ కూడా అవన్నీ అవసరమే. అయితే, కంపెనీల్లో పెద్దపెద్ద యంత్రాలు కనిపిస్తాయి. ముడి పదార్థాలు కనిపిస్తాయి. ఒక బట్టల కంపెనీని చూస్తే, అక్కడ పెద్ద పెద్ద యంత్రాలూ, బట్టల తయారీకి అవసరమైన పత్తి బేళ్లు భారీ ఎత్తున కనిపిస్తాయి. ఇక్కడ అవేమీ కనిపించవు. ముడి పదార్థాలు ఆ సాఫ్ట్‌వేర్ తనలో నిక్షిప్తం చేసుకోగలిగే చిన్న చిప్‌లూ, భారీ యంత్రాల స్థానంలో ఉన్నవి కంప్యూటర్లు. ఈ కంప్యూటర్లే శ్రమ పరికరాలు. ఒక రైతు చేతిలో నాగలి ఎలాంటిదో, ఒక కార్పెంటర్ చేతిలో రంపం ఎలాంటిదో, ఒక సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ చేతిలో కంప్యూటర్ అలాంటిది. నాగలి సహాయంతో రైతు పొలం దున్నినట్లు, కంప్యూటర్ సహాయంతో సాఫ్ట్‌వేర్ తయారు చేస్తాడన్నమాట. కాకపోతే అది శారీరక శ్రమ, ఇది మేధో శ్రమ. శ్రమల్లో ఈ రకమైన తేడాల వల్లనే జీతాల్లో తేడాలుంటాయి. వాళ్ల శ్రమని బట్టి, ఉత్పత్తి అయ్యే వస్తువు విలువల్లో తేడాలుంటాయి కాబట్టి జీతాల్లో కూడా తేడాలుంటాయి.

ఏ సాఫ్ట్‌వేర్ కంపెనీ పెట్టుబడిదారుడైనా ఎందుకు కంపెనీ పెడతాడు? దేశంలో నిరుద్యోగం పెరిగిపోయింది కాబట్టి, అందరికీ పని కల్పించడానికా? కాదు. టెక్నాలజీలో దేశం వెనకబడి పోయిందని, సాంకేతిక విలువలు పెంచడానికి కంపెనీ పెడతాడా? ఎంత మాత్రం కాదు. ఈ ప్రశ్నకి అసలు సమాధానం, నిజమైన సమాధానం చాలా మందికి తెలిసిన సమాధానం ఒకటే... 'లాభాల' కోసం. మరి లాభాలు ఎక్కడ నుండి వస్తాయి. అన్ని సరుకుల లాగే, సరుకులు అమ్మగా వచ్చిన డబ్బులో ముడి పదార్థాలూ, శ్రమ పరికరాల భాగం, ఖర్చులూ, తీసివెయ్యగా మిగిలిన భాగం అంతా కార్మికుల శ్రమే. అందులోనుండే కొంత భాగాన్ని జీతాల రూపంలో ఇస్తారు. ఇంకా మిగిలిన కార్మికుల శ్రమ భాగమే 'అదనపు విలువ', తమ జీతాల భాగం కాకుండా అదనంగా చేసిన విలువ కాబట్టి, అది అదనపు విలువ, దానికే మరొకపేరు 'లాభం'. అదే శ్రమ దోపిడీ. పెద్ద, పెద్ద పారిశ్రామికవేత్తల ఆస్తుల రహస్యం ఇదే. ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగి జీతం లక్ష రూపాయలు అనుకుందాం. అతను చేసేపని అంతకు నాలుగైదు రెట్లు ఎక్కువగా ఉంటుంది. అలా ఉంటేనే అంత జీతం ఇస్తారు. అలా కాకుండా అతను చేసే శ్రమ లక్ష రూపాయలకు ఒక్క రూపాయి తక్కువ ఉండే పరిస్థితులు ఎదురైతే...కంపెనీ ఎత్తేస్తారుగానీ ఒక్క రూపాయి కలిపి జీతం ఇవ్వరు. ఒకసారి ఒక సాఫ్ట్‌వేర్ ఉద్యోగస్తుడిని అడిగితే... కంపెనీకి వచ్చే రాబడి అతని జీతం కన్నా ఎన్నో రెట్లు ఉంటుందని చెప్పాడు.

ఆ విషయం అలా ఉంచి...ఇక్కడ మరో విషయం ఆలోచించాలి. ఒక రైతుకి, ఒక సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌కి పని గంటలు ఒక్కలాగే ఉంటే... జీతాల్లో ఎందుకు అంత తేడాలుంటాయి. అదే శారీరక శ్రమకీ, మేధో శ్రమకీ తేడా. ఆ తేడాలు ఎందుకు ఉంటాయి? అదేమిటో చూద్దాం.

ఏ శ్రమకైనా విలువలు ఆయా శ్రమలు నేర్చుకునే కాలాన్ని బట్టి ఆధారపడి ఉంటాయి. శారీరక శ్రమల్లో కూడా నైపుణ్యం గల శ్రమలూ, నైపుణ్యం లేని శ్రమలూ ఉంటాయి. ఒక ఇల్లు కట్టే శ్రామికుల్నే చూద్దాం. అందులో కూడా కూలీలు ఉంటారు. తాపీ పట్టుకుని పని చేసే మేస్త్రీలు ఉంటారు. కూలీల కన్నా, మేస్త్రీలకు ఎక్కువ జీతం ఉంటుంది. ఎందుకు? ఇద్దరు చేసేది ఒకేపని స్థలంలో, ఒకే పని గంటలు కదా! మరి ఎందుకు

జీతాల్లో తేడాలు. ఎందుకంటే....రాళ్లూ, ఇటికలూ, ఇసుకా మోసుకు వెళ్లడానికి ప్రత్యేకించి నేర్చుకునేదేమీ ఉండదు. శారీరక బలం ఉంటే చాలు. అదే మేస్త్రీ అయితే కొన్నాళ్లపాటు కూలీగా పనిచేస్తూనే పనిలో నేర్చుకోవలసినది ఉంటుంది. అలా నేర్చుకోలేని వాళ్లు ఎన్నాళ్లయినా కూలీలుగానే ఉండిపోతారు. కూలికన్నా మేస్త్రీ చేసే శ్రమ కాస్త ఎక్కువ నైపుణ్యం గల శ్రమ. అందుకే కూలిలో కూడా కొంచం తేడా ఉంటుంది. అన్నిరకాల చేతి వృత్తులలోనూ ఈ రకమైన తేడాలు ఉంటాయి.

అలాగే ఒక కంప్యూటర్ ఇంజనీర్ కావడానికి సంవత్సరాలు పడుతుంది. పైగా కూలిపని చేసేవాళ్లకు మొదటినుండి ఎంతో కొంత రాబడి ఉంటుంది. అదే ఇంజనీర్ అయితే ఉద్యోగం వచ్చేవరకూ రాబడి రాదు కదా! పైగా చదువుకు చాలా ఖర్చుపెట్టాలి. ఇలాంటివన్నీ పరిగణనలోకి తీసుకోవాలి. ఇక్కడ మరో ప్రశ్న. సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు చేసే వాళ్లు ఎక్కువ కాలం పని చెయ్యలేరు. నైట్‌షిఫ్టులు ఎక్కువగా ఉండడం వలన వేళకు భోజనం, నిద్రలు ఉండవు. అలాంటి కారణాల చేత... యువకుల్లోనే నడుం నొప్పులు, మెడ నొప్పులు వస్తుంటాయని డాక్టర్లు చెబుతున్నారు. మరో విషయం సాఫ్ట్‌వేర్‌లో పనిచేసే అందరి జీతాలు ఒక్కలాగా ఉండవు. కాస్త పై స్థాయిల్లో ఉన్నవాళ్లకు 'లీడ్‌లు, ఎనలిస్ట్‌లు, కన్సల్టెంట్'లు లాంటి వాళ్లకు మాత్రమే ఎక్కువ జీతాలు ఉంటాయి. ఇక్కడ మనం మాట్లాడుతున్నది సాఫ్ట్‌వేర్‌లో ఉత్పాదక కార్మికుల గురించి మాత్రమే. వాళ్లనే పరిగణనలోనికి తీసుకున్నాం. అవే కంపెనీల్లో మేనేజ్‌మెంట్ స్థాయిలో ఉన్నవాళ్లు, ఎచ్‌ఆర్ కూడా ఉంటారు. వాళ్లను దృష్టిలో పెట్టుకుని మాట్లాడడం లేదు. వాళ్లు చేసేది శ్రమే అయినా...వాళ్ల శ్రమ వస్తువు విలువలో భాగం కాదు. వాళ్లంతా అనుత్పాదక కార్మికులు. పెట్టుబడిదారీ ప్రపంచానికి వాళ్లు అవసరమే గానీ మనకి అనవసరం.

ఈ సాఫ్ట్‌వేర్ మత్తు ఎలా ఉందంటే....ఆ కంపెనీల అందచందాలు చూసి, అందులో పనిచేసే ఉద్యోగస్తులను అసలు వాళ్లు కార్మికులే కాదు అనేటంత. అలాంటి భ్రమ బయటవాళ్లకే కాదు, అందులో పనిచేసే ఉద్యోగస్తులకు కూడా. అందుకే వాటిని 'వైట్ కాలర్ జాబ్స్' అంటారు. అదంతా వట్టి భ్రమే. పనిచేసే ప్రతివాడూ కార్మికుడే. ఎక్కడ పనిచేసినా సరే. కంప్యూటర్ అనేది ఒక పరికరం మాత్రమే. అదేమీ మహిమాన్విత మైనదికాదు. టైలర్ సూది పట్టుకొని పని చెయ్యడం ఎలాంటిదో. సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ కంప్యూటర్ మీద పని చెయ్యడం కూడా అలాంటిదే. అది ఒక టెక్నాలజీ అంతే. వ్యవసాయం మాత్రం.., మనిషి మాత్రమే చేస్తున్నాడా? ట్రాక్టర్లూ, వరి కోత యంత్రాలూ ఉంటున్నాయి కదా! అదంతా ఏమిటి? టెక్నాలజీ కాదా?

అంతెందుకు నాగలి మాత్రం టెక్నాలజీ కాదా? మామూలుగా ఉన్న భూమిని, నాగలి సహాయంతో చీల్చడం, భూమిలోని మట్టి అంతా పెళ్లలుగా బయటకు రావడం, ఆ ఇసక సందుల్లో నుండి నీరు ఇంకి, మొక్కలకు నీరు అందడం. ఇదంతా నాగలి సహాయంతో రైతు చెయ్యడం లేదూ? అలాగే ఒక ఇంజనీర్.... కంప్యూటర్ అనే ఒక శ్రమ పరికరంతో పని చేస్తున్నాడు. ఈనాడు అన్ని రంగాల్లో కంప్యూటర్ విస్తరించింది. టెలిఫోన్ బిల్లులూ, కరెంటు బిల్లులూ, రైల్వే రిజర్వేషన్లూ, అన్ని చోట్లా వాడుకలో ఉంది. సెల్‌ఫోన్ ఎలా అయితే నిత్య జీవితావసరం అయిపోయిందో, దాదాపు కంప్యూటర్ కూడా అలాగే అయిపోయింది. గంటల తరబడి క్యూలో నిలబడే శ్రమలేకుండా ఇంట్లో కూర్చొని బిల్లులు కట్ట గలుగుతున్నామంటే అదంతా ఏమిటి. ఎవరో ఒక ఇంజినీర్ ముందే వాటిని ఆలోచించి అందులో నిక్షిప్తం చెయ్యడం వలననే కదా! ఒక కాలిక్యులేటర్ ఉంది. మనం పెన్నూ, కాగితం పట్టుకొని చెయ్య వలసిన లెక్కని, ఎంత పెద్దలెక్క అయినా సెకెండ్లలో చెప్పేస్తుంది అంటే, అంతకన్నా ముందుదాన్ని డిజైన్ చేసిన వ్యక్తి మన బదులు అతనే ఆలోచించి ఉంచబట్టే కదా! మానవ శ్రమని తగ్గించేదే టెక్నాలజీ. కంప్యూటర్ అయినా, సూపర్ కంప్యూటర్ అయినా దాన్ని మనమే తయారు చేసుకొన్నాం.

చేతిలో ఉన్న సూది అయినా, కాలిక్యులేటర్ అయినా, మనం ఏదైనా కంపెనీకి చూద్దానికి వెళ్తే... అక్కడ ఉన్న వందల మంది కార్మికులు పనిచేస్తున్న భారీ యంత్రమైనా, మనం ఒకే దృష్టితో చూడాలి. అన్నీ శ్రమ పరికరాలు మాత్రమే. కాకపోతే కంప్యూటర్లు మనవ మేధస్సుకు కాస్త అభివృద్ధి చెందిన రూపం. మేధో శ్రమకూ, శారీరక శ్రమకూ మరో తేడా ఉంది. శారీరక శ్రమలో వస్తుఉత్పత్తి కళ్లకు కనిపిస్తుంది. ఒక బట్టల తయారుచేసే కంపెనీలో బట్ట తయారవడమూ, తయారైన బట్ట లారీలతో, రైల్వే వేగన్ల ద్వారా బయట ఊర్లకు వెళ్లడం కార్మికుల కళ్లముందు కనిపిస్తుంది. శ్రమ దోపిడీ గురించి తెలియకపోయినా ఇది కార్మికుల శ్రమే అని తెలుస్తుంది. మేధో శ్రమ కంటికి కనిపించదు. సాఫ్ట్‌వేర్ ఎగుమతులు చిన్నచిన్న చిప్స్ ద్వారా, మెమరీ కార్డ్‌ల ద్వారా వెళుతుంటాయి. 'అసలు అలాంటి పెద్ద కంపెనీలోకి వెళ్లి, వీళ్లు ఏం చేస్తుంటారు? ఎందుకు అంతంత జీతాలు?' అనుకుంటారు. అదంతా నిజం కాదు. మామూలు కార్మికులు ఎలా శ్రమ దోపిడీకి గురవుతున్నారో, సాఫ్ట్‌వేర్ ఉద్యోగస్తులు కూడా శ్రమ దోపిడీకి గురవుతుంటారు. ఇక్కడకు ఈ విషయాన్ని ఆపి, మొదటి ప్రశ్న దగ్గరకు వద్దాం.

'దేశంలో తిండి గింజలు లేకపోతే...ఎన్ని కంప్యూటర్లయినా వృధా' అని. అది నిజమే. మనిషి బతకడానికి ముందు కావలిసింది తిండే. దాని తర్వాతే ఏదైనా. అయితే....ఒక్క తిండి మాత్రమే ఉంటే సరిపోతుందా? బట్టలూ, చెప్పులూ, ఇళ్లూ, వాహనాలూ, విద్యుత్తూ ఇవేమీ అక్కరలేదా? ఇవన్నీ చెయ్యాలంటే...మానవ సమూహంలో, అందరూ వేరు వేరు శ్రమలు చేస్తూ, ఈ శ్రమలన్నీ ఒకదానితో ఒకటి మారుతూ, ఒకరి అవసరాలు ఒకరు తీర్చుకుంటూ ఉంటేనే రోజులు ముందుకు నడుస్తాయి. అంతేతప్ప ఒక్క ఉత్పత్తి వలన అంటే, తిండి గింజల వలన మాత్రమే గడిచిపోదు. అలా అని కంప్యూటర్ జ్ఞానం వలనా గడిచిపోదు.

అలా జరగాలంటే, దేశంలో అన్ని రకాల ఉత్పత్తులూ, ఉత్పత్తి కావాలి. అలాంటప్పుడే అవన్నీ ఒకదానితో ఒకటి మారకాలు జరుగుతాయి. ఏదో ఒక దేశం గురించి చూద్దాం. ఉదాహరణకు మన భారతదేశం. ఇక్కడ మన అవసరాలన్నీ తీర్చగలిగే అన్నిరకాల ఉత్పత్తులు తయారవుతున్నాయా? అది సాధ్యం కాదు. ఒకవేళ ఉత్పత్తి అయినా దేశ జనాభాకు సరిపడినన్ని ఉత్పత్తి కాకపోవచ్చు. లేదా ఎక్కువ కూడా ఉండవచ్చు. సరిగ్గా సరిపడినంత బేలెన్స్‌గా ఎక్కడా జరగదు. మనదేశమే కాదు. ప్రపంచంలో ఏ దేశమైనా అంతే. అందుకే ఒక దేశం మరొక దేశంతో ఎగుమతులూ, దిగుమతులూ చేసుకొంటూ ఉంటుంది. ఆ హెచ్చు తగ్గులనేవి అక్కడ లభ్యమయ్యే వనరుల మీద ఆధారపడి ఉంటాయి.

ఉదాహరణకు గల్ఫ్ దేశాలు ఉన్నాయి. అక్కడ చమురు నిక్షేపాలు ఎక్కువగా ఉన్నాయి. అందుకే ఆ దేశంలో పెట్రోల్ ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. ఆ దేశం పెట్రోల్ ఇతర దేశాలకు ఎగుమతి చేసి, తనకు

# మన దేశం ఎటుపోతోంది?

***యుపిఎ, ఎన్‌డిఎ ప్రభుత్వాలు ప్రజల కనీస అవసరాలను తీర్చడంలో విఫలమయ్యాయని, ఈ క్రమంలో దేశ వనరులను కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడంలో మోడీ ప్రజలపై నియంతగా వ్యవహరిస్తున్నాడని అంటున్నారు సి ఎచ్. మధు***

ఇక్కడ ప్రజాస్వామ్యం లేకున్నా, కార్పొరేట్ సామ్రాజ్యం నీడలో పరిపాలన ఉన్నా, కోటీశ్వరుల ప్రభుత్వం ఉన్నా ఇది మనదేశం. మనం పుట్టిన దేశం. మనం బతుకుతున్న దేశం. బతుకాల్సిన దేశం. ఈ మట్టి మనది. ఈ జీవితం మనది. మనం బతుకుతున్న దేశం ఎలా ఉంది? బాగుందా? – భవిష్యత్తు భద్రంగా కనిపిస్తుందా? – భయంగా కనిపిస్తుందా? – అసలు వర్తమానం ఎలా ఉంది? – దుఃఖపూరితంగా ఉంది. భయంగా ఉంది. భయంకరంగా ఉంది. చీకటిగా ఉంది. కన్నీళ్లతో జీవితం కనుమరుగవుతున్న కాలమిది.

ఇందుకు కారణం మనం కాదు. శ్రమ పడుతున్నాం, చెమట కారుస్తున్నాం, జీవితం ఎందుకిలా అయింది? – మనం కారణం కాదు, ఈ దేశం ఇలా పాడయి పోవడానికి పాలకులు కారణం. ప్రజల తప్పు ఒక శాతం కనిపించదు. దశాబ్దాల పాలకులు మనదేశాన్ని ధ్వంసం చేశారు. ప్రజల జీవితాల్ని విధ్వంసం చేశారు. మట్టిని కాజేశారు. వనరులను దోచుకున్నారు. అవినీతిని పెంచారు. ధర్మాన్ని నాశనం చేశారు. రాజ్యాంగాన్ని ఆవల పారేశారు. పౌరహక్కులను, రాజ్యంగ సూత్రాలను గోదారిలో కలిపారు. అస్థిరతను, ఆర్థిక అంతరాలను, అసమానతలను పెంచారు. ఇప్పుడు ఒక నియంత పాలనలో బతుకుతున్నాం. పేరుకు ప్రజాస్వామ్యమే, జనం ఓటు వేసే గెలిపించారు. అంబేద్కర్ రాసిన రాజ్యాంగం ప్రకారమే నడుస్తున్నా మంటారు. చట్టాలు, నియమాలు, అంకెలు, సవరణలు, ఆర్టికల్స్ జిఒలు అన్నీ ప్రజాస్వామ్యమే అంటారు. ప్రజాస్వామ్యమనే పదం ఊత పదంగా మిగిలిపోయింది. ఇది ఎవరి ప్రజాస్వామ్యం? – ఎవరి సంక్షేమ రాజ్యం? – అసలిది ఎవరి రాజ్యం? ఎవరి వెలుగులకీ ప్రయాణం? ఎటు చూసినా జనం కన్నీళ్లు కనిపిస్తున్న దేశంలో ఏమి మిగిలింది? ఈ రాజ్యాంగం ఎవరికోరకు? – ఎవరిది?

ఇప్పటి దాకా కవిత్వం రాసినట్టుగా ఒక భావన. కానీ కవిత్వం కాదు. నా దేశాన్ని చూస్తే కోపం, కసి, దుఃఖం, కన్నీళ్లు పిడికిళ్లు... ఇవి ఎలా రాసినా, ఏ వచనంలో చెప్పినా కవిత్వంగానే కనిపిస్తుంది. కవిత్వ మంటేనే కసి, కోపం, కన్నీళ్లు. కన్నీళ్లే కవిత్వమని సాహిత్యకారులు అన్నారు. నా దేశాన్ని చూస్తే బాధేస్తుంది, కన్నీరొస్తుంది, కన్నీరు కసిగా మారుతుంది. కసి పిడికిలిగా మారుతుంది. పిడికిలి ఆయుధమవుతుంది. ఒకటి నిజం పూర్తిగా ధ్వంసమైన నా దేశాన్ని, కార్పొరేట్ సామ్రాజ్యపు గుప్పిట్లో నలిగిపోతున్న నా దేశాన్ని, కోటీశ్వరుల కబంధ హస్తాలలో నలిగిపోతున్న నా దేశాన్ని రక్షించేది ఆయుధమే. ఆయుధమంటే పిడికిలి, కలం, పాట, కత్తి, కొడవలి, కర్ర, రాయి, గొడ్డలి, ఆకరుకు తుపాకీ కూడా ఒక ఆయుధమే.

---

అవసరమైన సరుకులు దిగుమతి చేసుకుంటుంది. మనది వ్యవసాయ ప్రధానమైన దేశం. ఇక్కడ వ్యవసాయ ఉత్పత్తులు ఎక్కువగా ఉంటాయి. అలాగే జనాభా కూడా ఎక్కువే. అంటే మానవ వనరులు కూడా ఎక్కువే. ప్రకృతిలో లభ్యమయ్యే ప్రతీది వనరే. అలాగే మనుషులు కూడా ప్రకృతిలో భాగం కాబట్టి... మనుషులు కూడా ఒక వనరే. అందుకే మానవ వనరులు (హ్యూమన్ రిసోర్స్)అంటారు. ఏటా వేలాది మంది గ్రాడ్యుయేట్లు కాలేజీల నుండి బయటకు వస్తారు. మరి వాళ్లందరికీ ఉద్యోగాలు ఎక్కడ నుండి వస్తాయి. ఎక్కువ మంది సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు ఉండడానికీ, ఎక్కువ సాఫ్ట్‌వేర్ ఎగుమతులు ఉండడానికి కారణం ఇదే. దేశంలో పెద్ద పట్టణాల్లో ఎక్కువ సంఖ్యలో పని చేస్తున్న వాళ్లను చూసి ఎక్కడ చూసినా కంప్యూటర్లేనా, కంప్యూటర్లే వ్యవసాయం చేసేస్తాయా? అనేటట్లు కనిపిస్తుంది. అది నిజం కాదు.

అలా అని వ్యవసాయ ఉత్పత్తులను నిర్లక్ష్యం చెయ్యకూడదు. ఒక దేశంలో ప్రజల అవసరాలన్నీ తీర్చగలిగేలా అన్ని రకాల ఉత్పత్తులూ, ఉత్పత్తి చేసుకోగలిగితే మంచిదే. కానీ...ఆచరణలో అది సాధ్యం కాదు. ఎందుకంటే.. అన్ని రకాల వనరులు అన్ని దేశాల్లోనూ ఉండవు. అయినా సాధ్యమైనంత వరకూ అలాగే ప్రయత్నించాలి. 'స్వయం పోషకత్వం ఉండాలి'. 'దిగుమతుల మీద ఆధారపడకూడదు'. అనలేంగానీ... వీలయినంత తగ్గించుకోవడం సాధ్యమే. అలా జరగాలంటే...ఉత్పత్తి విధానం అంతా ఒక ప్లానింగ్‌తో జరగాలి. మొత్తం దేశంలో ఎంత జనాభా ఉన్నారు? ఏ ఏ ఉత్పత్తులు, ఎంతెంత ఉత్పత్తి అవుతున్నాయి? ఎన్ని ఎక్కువ ఉన్నాయి? ఎన్ని తక్కువ ఉన్నాయి? ఈ ప్రశ్నలకు జవాబు రాబట్టడం ప్రభుత్వాలకు పెద్ద కష్టం కాదు. ప్రభుత్వాలకు చిత్తశుద్ధి ఉంటే అది అసాధ్యమైన విషయం కాదు. అయితే...ఈ పెట్టుబడిదారీ సమాజాల్లో అది సాధ్యంకాదు. ఇక్కడంతా ఎవడి గోల వాడిదే. ఎవడి మార్కెట్ వెతుకులాట వాడిదే. వాళ్లకు కావలిసింది లాభాల గోల గానీ...ప్లానింగ్ గోల కాదు. పెట్టుబడిదారీ సమాజాల్లో తప్పు ప్రశ్నలు పుట్టుకొస్తూనే ఉంటాయి. సరైన జవాబుల కోసం మనమే ప్రయత్నించాలి. చివరగా మనం అర్థం చేసుకోవాల్సింది ఏంటి అంటే దేని ప్రాముఖ్యత దానిదే. వాటి వాటి శ్రమ విలువలను బట్టి సంపాదన ఉంటుంది. ప్రతి వ్యక్తీ మేధో, శారీరక శ్రమ చెయ్యాలి. అలాచేస్తే అప్పుడు విలువలు సమానం అవుతాయి. శ్రమలో నైపుణ్యం సాదిస్తేనే మనం ప్రగతి సాదించగలం. అది వ్యవసాయంలోనైనా కంప్యూటర్ లోనైనా. వీ

*(రచయిత దర్జీ)*

మళ్ల కవిత్వమొస్తుంది. ఇది వ్యాసం ధ్వంసమైన నా భారతదేశం ఇప్పుడు ఏ స్థితిలో ఉందో, ఎటుపోతున్నామో ఆత్మ పరిశీలన కొరకు వ్యాసం ఒకటి నిజం. దేశంలో ఆర్థిక అంతరాలు విపరీతంగా పెరిగిపోయాయి. కోటీశ్వరులు, భారీ కోటీశ్వరులు లక్షల కోటీశ్వరులయ్యారు. శ్రామికులు పూర్తిగా దిగజారిపోయారు. దేశంలో ఎనుబది శాతం కలిగిన శ్రామికులు అప్పులతో, ఆకలితో – విసిగిపోయి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఘనమైన నరేంద్రమోడీ సర్కారు అంటున్న 'అభివృద్ధి వెలుగులు', 'అగ్ర రాజ్యాల సరసన' అన్నీ ఒట్టివే. అన్నీ దగాకోరు మాటలే. అన్నీ వంచన పలుకులే. అన్నీ మోసం భాషణలే. ఎక్కడున్నాయి వెలుగులు? ఎక్కడ అభివృద్ధి? ఎవరు వెలిగిపోతున్నారు? ఎవరు అభివృద్ధి చెందారు?

ఇప్పుడు భారతదేశం ప్రజాస్వామ్య నియంతృత్వ నీడలో ఉంది. ఒక వ్యక్తి నియంతృత్వం భారతదేశాన్ని ఏలుతూ ఉంది. తానే భారతదేశ ఉద్ధారకుడుగా, దేవుడు పంపిన దూతగా ఆయన ప్రవర్తిస్తున్నారు. కుటిల రాజనీతితో కనీస ప్రజాస్వామ్యాన్ని నియంతృత్వ దేశంగా మార్చారు. ఇప్పుడు ఆయన మాట వేదం. ఆయన పలుకులు శిరోధార్యం. ఇప్పుడు ఆయనకు ఎదురు లేదు. ప్రశ్నించేవారు లేరు. నిలదీసేవారు లేరు. ఆత్మవిమర్శకు లోనుచేసి ప్రజాస్వామ్య బాటపై నడిపించేవారు లేరు. ఇప్పుడు భారతదేశాన్ని తన అధీనంలో ఉంచుకున్న మోడీ తన అధికారాలను క్రమక్రమేన విస్తృత పరుస్తూ – అన్ని రంగాలను, అన్ని వ్యవస్థలను తన గుప్పిట్లోకి తెచ్చుకొని ప్రజాస్వామ్యం పేరుతో నియంతృత్వం చెలాయిస్తున్నారు. ఆయనది నియంత దృక్పథం ప్రజాస్వామ్య భాష. ఆయన పలుకులు, పనులు కార్పొరేట్ సామ్రాజ్యానివి. మాటల మాంత్రికుడు. భాష ప్రజలది, వేషం దొరలది. నరేంద్రమోడీ దోపిడీ రాజకీయ మాంత్రికుడు. దేశాన్ని ఏమి చేస్తాడో, ఎటు తీసుకెళ్తాడో, ఏ బురదలో ముంచుతాడో, ఏ కార్పొరేట్ దోపిడీకి అప్పగిస్తాడో అర్థం కాని పరిస్థితి. దేశం ఎటు పోతుందో, ఎటు తీసుకెళ్తున్నాడో ఎవరికీ అర్థం కాదు. ఒకటి నిజం. ప్రజాస్వామ్య వ్యవస్థగా కొందరు ఆకాశమెత్తు కీర్తిస్తున్నారు కనుక – ప్రజల పేరుతో కోటీశ్వరులకు ఊడిగం చేస్తున్న మాట నిజం.

భారతదేశంలో ఇంతకాలం ప్రజాస్వామ్యం ఉందని ఎవరైనా భావిస్తే నేను అంగీకరించను. వ్యక్తి స్వేచ్ఛలేని వ్యవస్థ ఏదీ ప్రజాస్వామ్యం కాదు. రాజ్యాంగ మౌలిక విలువలను ఎప్పుడో ధ్వంసం చేశారు. భావ ప్రకటనా స్వేచ్ఛ మీద ఎప్పుడో నిషేధం విధించారు. ప్రజల ప్రాథమిక హక్కులను కొత్త చట్టాలు సవరణల పేరుతో బూడిద చేశారు. అన్నీ హక్కులను పాతరేసి, కొందరు సంపాదించే హక్కు మాత్రం చట్టబద్ధం చేశారు. నల్ల చట్టాలెన్నో తెచ్చారు. వీటన్నింటికి నరేంద్రమోడీ తప్పుకాదు. బాధ్యుడు కాదు. వాస్తవంగా కాంగ్రెస్ పార్టీ బాధ్యత వహించాలి. ప్రజాస్వామ్య విలువలు లేని వ్యవస్థలో మనం బతకడానికి కాంగ్రెస్ పార్టీతో పాటు అన్నీ రాజకీయ పార్టీలు కారణమే!

కమ్యూనిస్టులు కూడా ప్రజాస్వామ్య ధ్వంస రచనలో పాత్రదారులే. కాంగ్రెస్ పార్టీ, ఆ పార్టీ నాయకత్వంలోని సంకీర్ణ పార్టీలు ఈ విషయంలో కడిగిన ముత్యాలు కావు. దేశం పూర్తిగా దిగజారిన తర్వాత ఇక ఈ దేశాన్ని ఎవరూ బాగుచేయలేరని భావిస్తున్న తరుణంలో నరేంద్రమోడీ ప్రధాని అయ్యారు. కేవలం 33 శాతం ఓట్లు లభించాయి. 33 శాతం ఓట్లతో అధికారంలోకి వచ్చారు. మన ప్రజాస్వామ్య వ్యవస్థలోని ఎన్నికల వ్యవస్థ అలా ఉంది. అంతకు ముందు మోడీ గుజరాత్ ముఖ్యమంత్రి మాత్రమే. గుజరాత్ అభివృద్ధి చెందిందని, దేశంలో ఫస్ట్ అని మీడియాతో చెప్పించగలిగిన నేర్పు ఆయనకుంది. చెప్పించగలిగారు. ఒక నియంతృత్వ భావజాలం గల ప్రధాని అయితేనే ఈ దేశం బాగుపడుతుందనే భావనను మీడియా ద్వారా ప్రజల మెదళ్లు నింపారు. ప్రజల ఆలోచనలు ఆ రూట్‌లో పయనించడానికి కాంగ్రెస్ దశబ్దాల పాలనే కారణం.

కాంగ్రెస్ తన కాలంలో అవినీతిని పెంచి పోషించింది. పౌరహక్కులను ధ్వంసం చేసింది. వేలకోట్ల నల్లధనాన్ని బయటకు పంపింది. కాంగ్రెస్ తప్పులను సవరిస్తానని, దేశాన్ని సరిచేస్తానని మోడీ ప్రధాని అయ్యారు. ఇప్పుడు నియంతగా అవతారమెత్తారు. ఆయన అన్నీ తానే అయి, తన మాట వేదంగా నియంత భావజాలంతో, ప్రజాస్వామ్య ఫోజులతో దేశాన్ని పరిపాలించే అవకాశం ఆయనకు రావడానికి కాంగ్రెస్ పార్టీ కారణం.

దేశాన్ని బాగుచేస్తానని, సరిచేస్తానని, అభివృద్ధి పథంలో నడిపిస్తానని వచ్చిన నరేంద్రమోడీ కార్పొరేట్ అనుకూల విధానాలను అమలు చేస్తున్నారు. దోపిడీ శక్తులకు వత్తాసుగా మిగిలారు. ప్రశాంతంగా ఉన్న నదిలోకి రాయి విసిరినట్లు – దళితులపై, మైనార్టీలపై దాడులు జరిగాయి. దాడులకు పరోక్ష కారణం మోడీ ప్రభుత్వం, ఆర్ఎస్ఎస్ వర్గం. సంపన్నులు మరీ సంపన్నులయ్యారు. శ్రామిక జనం పట్ల చిన్న చూపు పెరిగింది. వ్యవసాయ రంగాన్ని నిర్లక్ష్యంలోకి నెట్టారు. రైతాంగం బతుకులను చీకటిపాలు చేశారు. ఆఖరుకు భూసేకరణ చట్టాన్ని తెచ్చారు. కార్మికుల, ఉద్యోగుల హక్కులను, స్వేచ్ఛను ధ్వంసం చేసి కార్మిక చట్ట సవరణ తేబోతున్నారు. రాష్ట్రాల స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక స్వేచ్ఛను అరికట్టడానికి వస్తు సేవల బిల్లు తెచ్చారు. ఈ వ్యవస్థలోని ఇతర స్వతంత్ర వ్యవస్థల అధికారాలపై కత్తెర వేశారు. ఆఖరుకు న్యాయ వ్యవస్థ కూడా తమ చెప్పు చేతలలో ఉండాలని పావులు కదుపుతున్నారు.

ఇప్పటి కశ్మీర్ చిచ్చుకు ఎన్‌డిఎ ప్రభుత్వమే కారణం. అక్కడి ప్రజలలో భారత్ వ్యతిరేకత పెరగడానికి బిజెపి ప్రభుత్వ విధానాలే కారణం.

దేశంలోని అక్రమంగా సంపాధించిన ధనం, స్విస్ బ్యాంకుల్లో దాచుకున్న ధనం అన్నీ వట్టి మాటలయ్యాయి. ఐదు, ఆరు లక్షల కోట్ల మొండి బకాయిలు బయట పడ్డాయి. మొండి బకాయిలన్నీ పరిశ్రమాధిపతుల కోటీశ్వరులవే! వీటిని ప్రజలు గుర్తించకుండా మాఫీ చేయాలనే కుట్ర పన్నుతున్నారు.

నరేంద్రమోడీ పరిపాలన పూర్తిగా విఫలమయింది. పైగా మోడీ నియంతగా వ్యవహరిస్తున్నారు. మంత్రివర్గ నిర్ణయాలకు విలువలేదు. పార్లమెంట్ పట్ల భక్తిలేదు. పార్టీ పట్ల గౌరవం లేదు. మోడీలో విదేశీ పర్యటనల మోజు పెరిగిందే తప్ప తగ్గడం లేదు.

ఇది చీకటి వెలుగుల ప్రజాస్వామ్యం కాదు, పూర్తిగా అమవాస్య చీకటి ప్రజాస్వామ్యమే. రాజకీయాలలో నైతిక విలువలు ధ్వంస మయ్యాయి. ఫిరాయింపులను అరికట్టే వారు లేరు. అవినీతి విరోధులపై రాజకీయ అస్త్రం అధికారికంగా విసురుతున్నారు.

నరేంద్రమోడీ ప్రజాస్వామ్య నియంత దేశంలో నియంతృత్వ పాలనకు ఆయన తెర తీశారు. ఇది క్షంతవ్యం కాని నేరం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# మహారాష్ట్ర మరాఠాల మోర్చాలు

***ఏ ఆర్థిక, సామాజిక అసమానతల మూలంగా రిజర్వేషన్ సౌకర్యం వచ్చిందో దానికి భిన్నంగా నేడు మహారాష్ట్రలోని మరాఠాలు ఆర్థిక కోణంలో రిజర్వేషన్‌లు కల్పించాలని ఉద్యమిస్తున్న తీరును వివరిస్తున్నారు*** **మచ్చ ప్రభాకర్**

నిన్నటి వరకు హరియానా జాట్‌లు, రాజస్థాన్‌లో గుజ్జర్‌లు, ఎపిలో కాపులు, గుజరాత్‌లో పాటీదార్ (పటేల్)లు, నేడు మహారాష్ట్ర రాష్ట్ర వ్యాప్తంగా మరాఠాలకు రిజర్వేషన్ కోసం తామే మరాఠాలమని చెప్పుకునే 96 కులాల సమూహం లక్షలాది మంది ప్రజలను సంఘటితపరిచి ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఏ బలహీనవర్గాలు రిజర్వేషన్ సౌకర్యం మూలంగా ఎంతో కొంతైనా సామాజిక న్యాయం పొంది ఆధిపత్య కులాల సరసన చేరడానికి వీలు కలుగుతుందన్న ఆశతో తొలిసారి దేశంలోనే రిజర్వేషన్ అమలు జనకుడుగా ప్రసిద్ధి చెందిన చత్రపతి సాహూ మహారాజ్ పుట్టిందో అదే నేలపైనే దానికి భిన్నంగా ఆర్థిక కోణంలో చూడాలన్న లక్ష్యంతో మరాఠాలు ఆందోళనలు నిర్వహిస్తున్నారు. అలాగే పైన పేర్కొన్న ఆధిపత్య కులాల ఆందోళనకు పూర్తి భిన్నంగా మరాఠా క్రాంతి మోర్చా పేర ప్రతి జిల్లాలో లక్షలాది మంది యువకులు, మహిళలు, విద్యార్థులు, వకీల్లు, ఉద్యోగ వర్గాలు, రైతాంగ సమూహాలతో మేన ఊరేగింపులు కేవలం ప్లేకార్డుల ప్రదర్శనతో మహిళల నేతృత్వంలో ఏ రాజకీయ పార్టీ నేతకు ప్రాధాన్యత ఇవ్వకుండా (పరోక్షంగా ఉన్నప్పటికీ) గిన్నీస్ బుక్‌లోకి ఎక్కే విధంగా జరిపిన తీరు గమనిస్తే తారతమ్యమెంతో తెలుస్తుంది. మండల్ – కమండల్ వివాద నేపథ్యంలో రిజర్వేషన్ అమలుకు వ్యతిరేకంగా (ఒబిసిలకు) బాహాటంగా తాము వెనుకబడిన వర్గాల వారిమి కామని, సమర్థించని మరాఠాలు మారిన గ్లోబల్ పరిస్థితితో దేశ సామాజిక, రాజకీయ, ఆర్థిక మార్పు పరిణామక్రమంలో ఈ మధ్య కాలం నుంచే తమకూ రిజర్వేషన్ కల్పించాలన్న డిమాండ్ ఊపందుకుంది. సరిగ్గా ఇదే సమయంలో అహమ్మద్‌నగర్ జిల్లా కోపర్డీలో 2016 జూలై 31న సవర్ణ మహిళపై అత్యాచారం, హత్య ఘటన వెలుగులోకి రావడంతో ఒక్కమారుగా పూర్తి మరాఠా సమాజం ఉవ్వెత్తున లేచి నిరసన తెలిపే దశకు ఇక్కడి మరాఠాల అగ్రశ్రేణి శక్తులు అందులో శరథ్ పవార్ లాంటి అపర చాణక్యుల ప్రేరణతో ముందుకు వచ్చిన విషయం గమనించాలి. ఇక వారి డిమాండ్లేమిటో తెలుసుకుందాం.

కోపర్డీలో మరాఠీ మహిళపై అత్యాచారం చేసిన వారికి ఉరిశిక్ష విధించాలి. మరాఠాలకు రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలి. అట్రాసిటీ చట్టాన్ని సవరించాలి. ప్రధాన డిమాండ్లు ఇవే అయినప్పటికీ ఆ తర్వాత జోడించిన బాబా పురందరే మహారాష్ట్ర భూషన్ పురస్కారాన్ని వెనుకకు తీసుకోవాలన్న డిమాండ్ ఉంది. బ్రాహ్మణీయ దృష్టి కోణంతో చరిత్రకారుడు కానప్పటికి తప్పుడు శివాజీ చరిత్ర రాసిన పురందర్‌కు బిజెపి – శివసేన కూటమి అత్యున్నత పురస్కారం ఇవ్వడం అన్యాయమని దాదాపు దళిత పురోగామి శక్తులన్నీ పోరాడి నిలదీసినవే. రాష్ట్రం ఏర్పడ్డ కాలం నుంచి (1960 మే) ఇప్పటి వరకు ఏ ముగ్గురో, నలుగురో మరాఠేతర ముఖ్యమంత్రులు తప్ప సుదీర్ఘకాలం విద్యా, రాజకీయ కో ఆపరేటివ్, చక్కెర సహకార సంస్థలు, డైరీ సంస్థలు లాంటి అతి ప్రాధాన్యత కలిగిన అన్ని రంగాలపై 350 ఘరాణా మరాఠా కుటుంబాల ఆధిపత్యం కొనసాగింది. ఈ మధ్య కాంగ్రెస్ హయాంలోనే మరాఠాల రిజర్వేషన్ సమస్యకు ప్రాధాన్యత చేకూరడంతో నారాయణ రాణే సమితిని ఏర్పరిచారు. దాని ప్రకారం 34 శాతం మరాఠా జనాభాలో 16 శాతం రిజర్వేషన్ 5 శాతం ముస్లిం జనాభాకు సహితం వర్తించే విధంగా రూపొందించి, అసెంబ్లీలో బిల్లు రూపంలో ప్రవేశపెట్టి అన్ని రాజకీయ పక్షాల ఆమోదం కూడగట్టుకోగలిగారు. కాని ముంబై హైకోర్టు ఎస్‌సి, ఎస్‌టి కమీషన్ ఇచ్చిన సందర్భ సూచికను ఆధారం చేసుకుని దానికి స్టే ఇవ్వడం జరిగింది.

ఆ తర్వాత అధికారంలోకి వచ్చిన బిజెపి – శివసేన కూటమి 2014 నవంబర్ 15న మరాఠాల రిజర్వేషన్ సమస్యపై తిరిగి ప్రత్యేకంగా అనుమతి కోరుతూ పిటిషన్ దాఖలు చేశారు. కాని 2016 సెప్టెంబర్ 19న ఉన్నత న్యాయాలయం ఇదే సమస్యపై సుప్రీం కోర్టుకు వెళ్లాల్సిందిగా సూచించడమైనది. ఇంతలో 2016 జూలై 13న జరిగిన కోపర్డీ అత్యాచార ఘటనతో రాష్ట్రవ్యాప్తంగా అత్యధిక యువ మహిళా సమూహాలతో లక్షలాది మంది జన సమూహాలను సమీకరించి మేన మోర్చాల స్థాయికి ఎదిగింది. ఈ మధ్యకాలంలోనే అదే మహమ్మద్‌నగర్ జిల్లాలో సుమారు నాలుగు చోట్ల దళితులపై భయంకరమైన దాడి చేశారు. అమరావతి, నాందేడ్, యవత్‌మాల్, లాతూర్, బండారా జిల్లా ఖైర్లాంజీ ఘటనల పరంపర ఎవరు చేశారో, ఎంత క్రూరంగా జరిగిందో రాష్ట్ర వ్యాప్తంగా తెలుసు. దేశ వ్యాప్తంగా కారంచేడు, చుండూరు, లక్ష్మింపేట, బేల్చీ, తమిళనాడు, ఒక రాష్ట్రమేమిటి ప్రతిరోజూ ఏదో ఒక చోట దళిత, ఆదివాసి మహిళలపై లైంగిక అత్యాచారాలు, హత్యల ఘటనలు నిత్యం కొనసాగుతున్న విషయం ప్రతి వ్యక్తికి తెలిసిందే. కాని నిర్భయ ఘటనలా కోపర్డీకి మీడియా ఇచ్చిన ప్రాధాన్యత వారికివ్వలేదన్న బాధ ఆ వర్గాల ప్రజల్లో ఎంతో ఉంది. మహిళలపై అత్యాచారం ఏ వర్గం జరిపినా దోషులను శిక్షించాల్సిందే. అందులో ఏ మాత్రం సందేహం లేదు. కాని, ఏదో ఒక్క ఘటనతో సవర్ణులు ప్రత్యేకించి మరాఠా సమూహం మొత్తం అట్రాసిటీ చట్టం సవరణకే పట్టుబట్టడం వలన ఇప్పటికే దళిత, ఆదివాసి మహిళలకు అంతంత మాత్రం లభించే న్యాయం సహితం లభించదన్న భీతి కలగడం సహజసిద్ధం.

2011 జనాభా లెక్కల ప్రకారం మహారాష్ట్ర జనాభా 11 కోట్లు. అందులో ఎస్‌సి, ఎస్‌టి జనాభా 11.81 శాతం అనగా 32 లక్షల 75

వేలకు పైననే. ఎస్‌సి, ఎస్‌టిల ఆర్థిక స్థితిగతులపై కేంద్ర ప్రభుత్వం ఒక రిపోర్టు తయారు చేసింది. దాని ప్రకారమే మహారాష్ట్రలోని ఎస్‌సి/ఎస్‌టి వర్గాలలో కేవలం 19 శాతం జనాభా వద్దే సొంత ఇల్లు ఉన్నట్లు, అందులోనూ 6 శాతం పక్కా ఇల్లు కానట్లు నివేదిక తెలిపింది. అలాగే వెనుకబడిన వర్గాల కోసం అధికార వర్గాలు ఉచిత గృహ పథకం అమలు చేస్తామని చెప్పడమే తప్ప అమలుకు నోచుకున్నది లేదు. గ్రామీణ క్షేత్రాల్లో 44.7 శాతం, నగరాల్లో 11.44 శాతం ప్రజలకు విద్యుత్ సౌకర్యం లేదు. అలాగే గ్రామాల్లో 17 శాతం, పట్టణాల్లో 44 శాతం ప్రజలకు మరుగుదొడ్ల సౌకర్యం లేదు. అలాగే తాగునీరు సౌకర్యం 30 శాతం పైగా ప్రజలకు అందుబాటులో లేదు. 83 శాతం మంది ప్రజలకు ద్విచక్ర వాహనాలు, 97 శాతం ప్రజలకు నాలుగు చక్రాల వాహనం లేదు. డా. సుఖదేవ్ థోరట్ నివేదిక ప్రకారం మహారాష్ట్రలో కేవలం 11 శాతం వెనుకబడిన వర్గాల వద్ద భూమి ఉందని, అలాగే 70 శాతం రైతు కూలీలని తేల్చి చెప్పాడు.

ఇప్పటి వరకు ఎస్‌సి, ఎస్‌టి, ఒబిసి వర్గాల వారికి లభించిన రిజర్వేషన్ ఫలితాలు ఏమిటంటే, ఎస్‌సికి 13 శాతం, ఎస్‌టికి 7 శాతం, ఒబిసిలకు 19 శాతం, ఎస్‌బిసిలకు 2 శాతం, ఎన్‌టి (1)వ వర్గానికి 11 శాతం, ఎన్‌టి (2)కు 2.5 శాతం, మూడుకు 3.5 శాతం, నాలుగుకు 2 శాతం మొత్తం కలిపితే 52 శాతం ఇచ్చినప్పటికీ కేవలం 4 శాతం వారికే పై వర్గాలలోని వారు లబ్ది పొందినట్లు. మిగిలిన 96 శాతం రిజర్వేషన్‌లకు వంచితులుగా ఉన్నట్లు విశ్లేషకులు పేర్కొన్నారు. 52 శాతం ఒబిసిలకు కేంద్రంలో 27 శాతం రిజర్వేషన్ సౌకర్యం ఉన్నప్పటికీ మహారాష్ట్రలో 19 శాతం రిజర్వేషన్ విద్యా, ఉద్యోగ రంగాల్లో అమలవుతున్నట్లు అందులో క్రీమీలేయర్ అడ్డు వలన ప్రమోషన్లలో అవకాశం లేదన్న విషయం తెలిసిందే. తమిళనాడులోని 69 శాతం రిజర్వేషన్లలో మరాఠాలకు 16 శాతం రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలని నారాయణ రాణే సమితి డిమాండ్ చేసింది. దానితో బ్రాహ్మణ వర్గాలు తమిళనాడులోనూ వారి సభలు జరిపి తమకూ 35 శాతం రిజర్వేషన్ ఇవ్వాలని కోరుతున్నారు. 1993 మండల్ నివేదిక పిదప రిజర్వేషన్ సమస్య ఉన్నత న్యాయ స్థానానికి చేరగా, అప్పుడు న్యాయాధిపతుల తీర్పు 50 శాతం కన్నా మిన్నగ ఇచ్చే వీలు లేదని జవాబిచ్చింది. కాని పరిస్థితుల ప్రభావాల కనుగుణంగా రిజర్వేషన్ కోటా పెంపు విషయంలో రాష్ట్రాలకు అధికారం ఉండడం గమనించదగ్గ అంశం. మరాఠాలకు రిజర్వేషన్ సౌకర్యం కలిగించాలంటే సమాజంలోని కింది వర్గాలకన్న మరాఠా సమాజం ఆర్థికంగా దుర్లభంగా ఉన్నట్లు నిరూపించుకోవాలి. వాస్తవానికి 1992 పిదప పి.వి. నర్సింహారావు ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానాల గేట్లతో బాటు అటు బ్రాహ్మణీయ హైందవ భావజాలంతో కూడిన అయోధ్య తాళాలు ఒకేమారు తెరుచుకున్నాయి. దీంతో మండల్ కమిషన్ అమలు సమస్య జటిలంగా మారి రాను రాను ఎస్‌సి, ఎస్‌టి, ఒబిసి, మైనార్టీ వర్గాల మధ్యనే అనైక్యత పెంపొందేందుకు దారితీసింది. రాజ్యాంగం ప్రసాదించిన కనీస మానవ హక్కులను సహితం హరించేలా అగ్ర కుల ఆధిపత్య శక్తులు ఎంతో దూర దృష్టితో కుట్రలకు పూనుకుని విభజించి, పాలించే ఎత్తుగడలతో తమ కుటిల రాజకీయ నైపుణ్యత ప్రదర్శించి, విదేశీ కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలకు అనుకూలంగా వ్యవహరిస్తున్నట్లు స్పష్టమవుతున్నది. దీనికి ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియా కార్పొరేట్ శక్తులతో పాటు ఆధిపత్య కుల, వర్గాల తిరోగమన, అభివృద్ధి నిరోధకుల ప్రజాస్వామ్య వ్యతిరేక రాజకీయ శక్తుల ప్రత్యక్ష, పరోక్ష సహాయ సహకారాలు పూర్తిగా ఉండడం గమనించాల్సిన అంశం.

150 ఏళ్ల క్రితమే జ్యోతిరావు పూలే తన చివరి సాహిత్య గ్రంథం సార్వజనిక సత్య ధర్మంలో 96 కులాల సమూహంలో మరాఠాలెవ్వరని ప్రశ్నలు, సమాధానాల రూపంలో తమ ఆలోచనను వ్యక్తపరుస్తూ కుల భూషణుడైన శివాజీ కున్బీ (రైతు వర్గం) కులానికి చెందినవాడని సర్వ కులమత సమతా భావంతో హైందవ రక్షణ (గో ప్రతిపాలక) చక్రవర్తి కాదని ప్రజల సంక్షేమం కోసం, ప్రజా స్వరాజ్యం కోసం ఒక కొత్త కోణంలో ఆలోచించి పోరాడిన యోధుడని వర్ణిస్తాడు. ఆయన సమాధిని తొలిసారి వెతికి వెలుగులోకి తెచ్చిన ఘనత పూలేకే దక్కింది. అలాగే ఆయనపై తొలి పొవాడా (ఒగ్గు కథ) రాసిన గొప్ప సాహిత్య కారుడూ పూలేనే. మరాఠాలకు ఆత్మాభిమానం, పౌరుషం ఎక్కువని ఆ గుణాలు వీర శివాజీతో తమకు సంక్రమించాయని ఘణంగా చాటే మరాఠా సమాజం (ఒకప్పటి శూద్రులు) లో ఏ కొందరో అభివృద్ధి చెంది అత్యధిక శాతం కష్టజీవులు, రైతులు, మధ్యతరగతి వర్గం తీవ్రమైన నిరుద్యోగం, అప్పుల బాధతో, ఆత్మహత్యలతో సంక్షోభంలో ఉన్న వాస్తవాన్ని గుర్తించితే, ప్రస్తుత మరాఠా ప్రజల్లో ఉన్న అసంతృప్తికి ఏ ఆర్థిక, రాజకీయ, సామాజిక కారణాలో స్పష్టంగా బోధపడగలదు. శివాజీ, పూలే, ఛత్రపతి సాహూ మహరాజ్ ఆలోచనలతో మరాఠా సేవా సంఘ్, సంబాజీ బ్రిగేడ్, జిజాబాయ్ బ్రిగేడ్ లాంటి పురోగామి సంస్థలు స్థాపించి, నేడు మరాఠా క్రాంతి మోర్చా పేర లక్షలాది మంది ప్రజలతో మేన ప్రదర్శనలతో పాటు, రాబోయే నెలలో (34 జిల్లాల పిదప) ముంబైలో ఒక కోటి మరాఠా ప్రజలతో తమ డిమాండ్ల సాధన కోసం భారీ మేన ప్రదర్శన నిర్వహించబోతున్నట్లు నిర్వాహకులు తెలిపారు.

వారి డిమాండ్లలో సామాజిక న్యాయ కోణం ఎంతవరకు ఉందో అన్న సంగతెలా ఉన్నా అవి నెరవేర్చగలిగే డిమాండ్లైనా రాష్ట్ర పరిధిలో సాధ్యపడేవేనా అన్న అంశంపై రాజకీయ విశ్లేషకులు పలురకాల ఊహాగానాలు చేస్తున్నారు. 2016 సెప్టెంబర్ 28న శరద్ పవార్ మరాఠా డిమాండ్లపై త్వరగా నిర్ణయం తీసుకొమ్మని సూచించాడు. అలాగే ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్ మరాఠీ క్రాంతి మోర్చా సంస్థ నిర్వాహకులకు శాంతియుతంగా తమ ప్రదర్శనలు కొనసాగిస్తున్నందుకు ధన్యవాదాలు తెలుపుతూ, వారి డిమాండ్లపై తాము సానుకూల నిర్ణయం తీసుకోబోతున్నట్లు ప్రకటిస్తున్నాడు. శివసేన దిన పత్రిక సామ్నాలో సెప్టెంబర్ 27న ఒక వ్యంగ్య చిత్రం మరాఠా మహిళలను అవమానిస్తూ ప్రచురించింది. దానితో ముంబై మేయర్ నీలంఘోరే లాంటి వ్యక్తులు ఇంతటి కల్లోల వాతావరణంలో అలాంటి వ్యంగ్య చిత్రం ప్రచురించడం సరియైనది కాదని వాపోయారు. ఇక భవిష్యత్‌లో మహారాష్ట్ర రాజకీయాల్లో లక్షలాది మంది మరాఠాల అసాధారణ మేన మోర్చాల ఆందోళన బిజెపి – శివసేన కూటమికి ఒక సవాలుగా మారగలదన్నది చెప్పకనే చెపుతుంది. ఒబిసి కోటాలో తాము భాగస్వామ్యం కోరడం లేదని, అలాగే ఇతర బలహీనవర్గాల ప్రయోజనాలు దెబ్బతీసేలా తాము వ్యవహరించడం లేదని ఎన్ని ప్రకటనలు చేసినా, ప్రతిపక్షాలుగా ఉన్న ఎన్‌సిపి – కాంగ్రెస్ కూటాలు బలపడగలవా? లేదా బిజెపి – శివసేన – ఆర్‌పిఐ – ఒబిసి అనుకూల రాజకీయ కూటాల శక్తి ప్రాభల్యం తగ్గగలదా అన్న అంశాలకు జవాబులు రాబోయే పరిణామాల కాలక్రమమే జవాబివ్వగలదు.

*(రచయిత ముంబై సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

# అది 'చర్చా', ప్రతీకార చర్యా?

జె.యు.బి.వి. ప్రసాద్

అక్టోబర్ 'వీక్షణం'లో 'చర్చ' శీర్షిక కింద 'రంగనాయకమ్మ 'తత్వశాస్త్రం' గురించి' అనే పేరుతో వచ్చిన వ్యాసం చదివితే, వ్యాసకర్త 'తత్వశాస్త్రం' పుస్తకాన్ని సరిగా అర్థం చేసుకోలేదనిపించింది. వ్యాసకర్త, వీక్షణంలో, గతంలో తాను రాసిన ఒక వ్యాసం గురించి కూడా ప్రస్తావించారు. ఆ గత వ్యాసాన్నీ, అంతకు ముందు ఆయన రాసిన 'మేం మళ్లీ వస్తాం!' పుస్తకాన్నీ, ఆ పుస్తకంపైన రంగనాయకమ్మ రాసిన విమర్శనీ, చదివిన పాఠకుడిగా, ప్రస్తుత వ్యాసాన్ని చర్చించదలిచాను.

వ్యాసకర్త, రంగనాయకమ్మ మీద మొదటి పేరా నుంచి చివరి పేరా వరకూ చేసిన వ్యాఖ్యలూ, పదాలూ (గీరడు, గీరమ్మ, బ్రహ్మానందం, వీధి మొగ కమ్యూనిస్టు వగైరా) చూస్తే, అది సద్విమర్శగా కాక, ప్రతీకార విమర్శగా అన్పించింది. తన పుస్తకం మీద, ఇదే వీక్షణంలో ఆమె చేసిన విమర్శని భరించలేక కక్ష తీర్చుకున్నట్టు ధ్వనించింది.

అయితే, మొదటి పేరాలో తెగడ్త లాంటి వ్యాఖ్యానం చేయబోయి తెలియకుండానే పొగిడేశారు ఇలా: 'దేవతలు కూడా అడుగు పెట్టడానికి సాహసించని ప్రదేశాల్లోకి రంగనాయకమ్మ రెండో ఆలోచన లేకుండానే దూకుతారు' అన్నారు. గతి తార్కిక భౌతిక వాదం గురించి మాట్లాడిన వ్యాసకర్త 'దేవతలు' అనే పోలికను వాడవచ్చునా అనే ప్రశ్నని పక్కన పెడితే, రంగనాయకమ్మ సాహసాన్ని కీర్తించే పని మాత్రం తనకు తెలియకుండానే చేశారు – అదేదో తెగడ్త అనుకుంటూ!

రంగనాయకమ్మ సాహసానికి తొలి రుజువుగా 'కాపిటల్' పరిచయాన్ని వ్యాసకర్త చూపారు. అవును మరి, 1920 లలో దేశంలో ప్రారంభమైన కమ్యూనిస్టు పార్టీ 50 ఏళ్లయినా, కాపిటల్ అనువాదం కాకపోయినా, పరిచయమైనా చేయడానికి దూకనప్పుడు, ఆ పనిని 1978లో రంగనాయకమ్మ చేయడం సాహసకృత్యమే! దాని ఫలితంగా, అప్పట్నించీ ఆ కాపిటల్ పరిచయాన్ని పాఠకులు ఇష్టంగా చదువుతున్నారనడానికి, ఒక నిదర్శనం, ఆ పుస్తకం పొందుతున్న పునర్ముద్రణలే!

అలాగే, కాపిటల్ పరిచయం ఇంగ్లిష్ అనువాదం 3 భాగాలూ వెలువడి, 'రీడర్ – ఫ్రెండ్లీ' (పాఠకులకు తేలికగా అర్థమయ్యే) రచనగా ప్రశంసలు పొందింది (ఉదా॥ 'సైన్స్ అండ్ సొసైటీ' అనే మార్క్సిస్టు ఆర్థిక శాస్త్ర పత్రిక సంపాదకుడు డేవిడ్ లైబ్‌మన్ సమీక్ష). మార్క్స్ 'కేపిటల్' ఆధారంగా రాసిన 'పిల్లల కోసం ఆర్థిక శాస్త్రం' 2010 లో వెలువడి, ఇప్పటికి 5 ముద్రణలు పడి, ఇంగ్లిష్‌లోకీ, హిందీలోకీ అనువాదమై ఇతర ప్రాంతాల పాఠకుల ఆదరణ కూడా పొందుతోంది.

అదే విధంగా, 2014 ఏప్రిల్‌లో వెలువడిన 'తత్వ శాస్త్రం' పరిచయం కూడా యాడాది తిరక్కుండా పునర్ముద్రణ జరిగి, ఇప్పుడు 3 వ ముద్రణ బైటికొచ్చింది.

ఇంక ఇప్పుడు వ్యాసకర్త 'తత్వ శాస్త్రం గురించి' చేసిన వ్యాఖ్యానాలు క్లుప్తంగా చర్చిస్తాను.

1) 'తత్వ శాస్త్రం అంటే రంగనాయకమ్మకి చులకన భావం ఉంది' – వ్యాసకర్త.

చులకన భావమే ఉంటే, దాని పరిచయం ఎందుకు చేస్తుంది ఆమె? రంగనాయకమ్మకి ఉన్నది చులకన భావం కాదు. తత్వ శాస్త్రం మీద రాసిన పుస్తకాలు సరిగా అర్థం అయ్యేట్టు ఉండవనీ, అందువల్ల తత్వ శాస్త్రం విసుగెత్తించే శాస్త్రం అనీ ఆమె భావనగా, మొదటి రెండు చాప్టర్లను బట్టి అర్థం అవుతుంది.

2) 'హెగెల్ (రాసిన) 'లాజిక్' సంగతి దేవుడెరుగు, కేపిటల్ పరిచయం చేసే నాటికి మార్క్సిస్టు తత్వ శాస్త్రంలో ఓనమాలు కూడా తెలియని రంగనాయకమ్మకి కేపిటల్ పూర్తిగా అర్థమైందా?' – వ్యాసకర్త వ్యాఖ్యానం.

మరి మార్క్స్, హెగెల్ 'లాజిక్' గురించి రాయకుండా, ముందు కేపిటల్ ఎందుకు రాసినట్టు? ఎవరికి అర్థం అవుతుందనుకున్నాడు?

హెగెల్ 'లాజిక్' గురించి తనకి 'ఎప్పుడైనా టైము ఉంటే సాధారణ మేధస్సుకి అందుబాటులోకి తేవాలని ఎంతో కోరిక' ఉన్నట్టు ఎంగెల్స్‌కి రాసిన ఉత్తరంలో (14-1-1858) అన్నాడే గానీ, ఎన్నడూ అది రాయనే లేదు – అలా అనుకున్నాక దాదాపు పాతిక సంవత్సరాలు జీవించి ఉన్నప్పటికీ! హెగెల్ లాజిక్కే అంత ముఖ్యమైతే, అది అర్థం కాకపోతే కాపిటల్ అర్థం కాదనుకుంటే, అదే ముందు రాసేవాడుగా? ఈ ప్రశ్నలు రాని వ్యాసకర్తకి, హెగెల్ 'లాజిక్' కాదు గదా, 'వీధి మొగ కమ్యూనిస్టు'కి (ఈ మాట ఆయనదే) ఉండే కామన్‌సెన్స్ కూడా లేదనుకోవాలా?

3) 'మార్క్సిజం అంటే కేవలం అదనపు విలువా, శ్రమ దోపిడీ అనుకుని 30 ఏళ్లుగా రంగనాయకమ్మ అదనపు విలువా, శ్రమ దోపిడీ, కౌళ్లూ, వడ్డీలూ అంటూ పాట పాడుతున్నారు' – వ్యాసకర్త.

ఈ పాట రంగనాయకమ్మ కొత్తగా రాసి పాడిన పాట కాదు. మార్క్సే పాడాడు, తన సిద్ధాంతపు మౌలిక గ్రంథమైన కాపిటల్‌లో:

'పెట్టుబడికి – లాభమూ

భూమికి – కౌలూ

శ్రమకు – వేతనాలూ

ఈ సూత్ర త్రయం (ట్రినిటీ ఫార్ములా) సామాజిక ఉత్పత్తి క్రమానికి సంబంధించిన సమస్త రహస్యాల్నీ కలిగి ఉంది' (కాపిటల్-3, పేజీ-814)

4) 'శ్రమశక్తి గురించి మార్క్స్' అనే రంగనాయకమ్మ వ్యాసాన్ని దృష్టిలో పెట్టుకుని, 'రంగనాయకమ్మకి ఇటీవల హఠాత్తుగా ఒక సందేహం వచ్చింది!' – అని వ్యాసకర్త వ్యాఖ్య!

కేపిటల్ పరిచయం మొహం తెలీని వ్యాసకర్త వంటి వాళ్లకి, అదొక సందేహంగా కనిపిస్తుంది.

కేపిటల్ పరిచయంలో 'శ్రమశక్తి విలువ' అనే చాప్టరులో 'పెట్టుబడిదారుడికీ, కార్మికులకూ మధ్య అసలు 'మారకమే' లేదు! – అని చాలా స్పష్టంగా ఒక సబ్-చాప్టర్‌కే ఆనాడే హెడ్డింగు పెట్టిన రంగనాయకమ్మకి సందేహమా? ప్రెజుడిస్‌తో కళ్లు మూసుకు పోయినవాళ్లకి తప్ప, మిగతా వాళ్లందరికీ, ఆ హెడ్డింగు కనిపిస్తుంది!

5) ఏ శాస్త్రం పరిచయం చెయ్యాలన్నా దాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలనీ, దాన్ని జీర్ణించుకోవాలనీ, ఆ సమర్థత ఉంటేనే పరిచయం చెయ్యాలనీ, అది లేకనే రంగనాయకమ్మకి మార్క్సిస్టు తత్వ శాస్త్రం అర్థం కాలేదని వ్యాసకర్త వ్యాఖ్య!

అవును, ఈ వ్యాసకర్త క్షుణ్ణంగా చదివి, జీర్ణించుకుని, నెగేషన్ ఆఫ్ నెగేషన్ గురించి, తన పుస్తకంలో (మళ్లీ వస్తాం!) ఎంత హాస్యాస్పదంగా చెప్పారో, ఆ పుస్తకం మీద రంగనాయకమ్మ సమీక్ష చదివితే బాగా తెలుస్తుంది!

6) గతి తర్కం గురించి మార్క్సిస్టు తత్వవేత్తలు చాలా సరళంగా, సూటిగా చెప్పారని వ్యాసకర్త ప్రకటన.

గతి తర్కం గురించి మార్క్స్ ఏమీ రాయలేదే? పైగా ఎవరో సరళంగా చెప్పారట!

సాధారణ పాఠకులకు అర్థం కాని 'దృగ్విషయాలు', 'అభావం అభావం

చెందుట' అనే రకం మాటలు ఈ వ్యాసకర్త వాడితే, ఇంకో ఆయన, 'అనుమిద జ్ఞానం', 'నిగమానోపపత్తి' రకపు పాషాణ పాక భాష వాడతాడు. ఇదేనా సరళత్వం, సూటిదనం?

7) 'మార్క్సిస్టు పదజాలాన్ని తన ఇష్టం వచ్చినట్లు మార్చెయ్యడం రంగనాయకమ్మకి ఒక అలవాటుగా మారింది..... అలా మారుస్తుంటే, ఆ శాస్త్రం, భాష అర్థం కాకుండా పోతాయి' అని వ్యాసకర్త విమర్శ.

'ఉత్పత్తి' సంబంధాలను 'శ్రమ' సంబంధాలంటే ఇంకా తేలిగ్గా అర్థమవుతుందే గానీ, కష్టం ఉండదు. 'ఉత్పత్తి' జరగడం అంటే, 'శ్రమ' జరగడమే. 'ఉత్పత్తి' జరిగేటప్పుడు, అంటే శ్రమ జరిగేటప్పుడు, 'శ్రమ చేసే వాళ్లు', 'శ్రమ చెయ్యని వాళ్లు'-అనే రకంగా మనుషులు విడిపోయి ఉంటారు. అవే వారి మధ్య ఉండే సంబంధాలు. వాటిని 'ఉత్పత్తి సంబంధా'లన్నా, 'శ్రమ సంబంధా'లన్నా అర్థం ఏమీ మారదు. అలాగే ఉత్పత్తి సాధనాలన్నా, శ్రమ సాధనాలన్నా ఒకటే. 'ఉత్పత్తి' జరగాలంటే (ఆ ఉత్పత్తి, సబ్బు వంటి వస్తువు రూపంలో ఉన్నా; 'బండి తోలడం' వంటి వస్తువు కాని శ్రమ రూపంలో ఉన్నా) కావల్సింది శ్రమ చేసే మనుషులూ, వాళ్లు శ్రమ చేయడానికి కావాల్సిన సాధనాలూనూ. అలాంటప్పుడు 'ఉత్పత్తి సాధనాలను', 'శ్రమ సాధనాలు' అనడం వల్ల విషయం తేలిగ్గా అర్థం అవుతుంది.

అలాగే, 'గతి తర్కాన్ని', 'సరైన తర్కం' అంటే, అర్థం చెడదు.

మార్క్స్ మాటలు చూడండి: 'నా గతి తర్క పద్ధతి, హెగెలియన్ పద్ధతి నించీ భిన్నమైనదే కాదు; దానికి పూర్తిగా వ్యతిరేకం' (కాపిటల్-1 ముందు మాటలో). '...... నేను, భౌతిక వాదినీ; హెగెల్, భావ వాదీ' (కుగెల్‌మన్‌కి రాసిన ఉత్తరంలో). మార్క్స్ చెప్పినదాని ప్రకారం, మార్క్స్ గతి తర్కాన్ని 'భౌతిక వాద గతి తర్కం' అనాలి. కేవలం, 'గతి తర్కం' అని మాత్రమే అంటే, హెగెల్ మాటనే మార్క్స్ గుడ్డిగా అనుసరించాడనే అర్థం వస్తుంది. 'సరైన తర్కం' అంటే, మార్క్సు చెప్పే 'భౌతిక వాద తర్కమే'.

8) రంగనాయకమ్మకు తెలిసింది 'అరకొర మార్క్సిజం' అనీ, అందుకే ఆమె 'కమ్యూనిజం తర్వాత మరో దశ ఉండదు' అని వాదిస్తుందనీ వ్యాసకర్త వ్యాఖ్య.

మార్క్సిజం గురించి 'అరకొర' గాక 'పూరా' అవగాహన ఉన్న వ్యాసకర్త, కమ్యూనిజం తర్వాత వచ్చే మరో దశ ఏమిటో చెబితే పాఠకులు తెలుసుకుంటారు. ప్రకృతికి అన్వయించే ఒక సూత్రాన్ని (నెగేషన్ ఆఫ్ నెగేషన్‌ని), మానవ సమాజ పరిణామ క్రమానికి పరమ యాంత్రికంగా, తన పుస్తకంలో అన్వయించిన వ్యాసకర్త చెప్పే మార్క్సిజం ఎలాంటిదో ఇదే 'వీక్షణం'లో గతంలో వచ్చిన రంగనాయకమ్మ వ్యాసంలో చూడొచ్చు (2013 సెప్టెంబర్ - డిసెంబర్). ముఖ్యంగా 'నెగేషన్ సూత్రం కమ్యూనిజం మీద కూడా పని చేస్తుందా?' అనే హెడ్డింగు కింద ఆమె రాసినది చూడాలి. అప్పుడు తెలుస్తుంది, 'అరకొర మార్క్సిజం' ఎవరిదో! అయినా, మార్క్సిజంతో పూర్తి ఏకీభావం లేని వ్యాసకర్తకు, ఇతరుల 'అరకొర మార్క్సిజం' గురించి బెంగ ఎందుకు? ఈ వ్యాసకర్త తన పుస్తకంలో ఏం చెప్పారు? 'మార్క్సిజం అనేది, పరిపూర్ణ సిద్ధాంతం కాదు. మార్క్సిజం మతం లాగ, అంతిమ సత్యాన్ని ఆవిష్కరించదు' - అని! (పే. 286)

మార్క్సిజం పరిపూర్ణం కాని సిద్ధాంతం - అంటే అది 'అరకొర' సిద్ధాంతం అనే కదా?

9) కమ్యూనిజం గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు ఏమన్నదీ ప్రస్తావిస్తూ, ఈ వ్యాసకర్త చేసిన వ్యాఖ్యానాలు అన్నీ సందర్భాన్ని అర్థం చేసుకోకుండా ఇచ్చినవే!

'మార్క్స్, ఎంగెల్స్‌లు, కమ్యూనిజాన్ని మానవ సమాజం నిర్మించవలసిన ఒక ఉన్నతమైన ఆదర్శ వ్యవస్థగా చూడలేదు' అన్నారు, వ్యాసకర్త.

ఆయన ప్రస్తావించిన 'జర్మన్ ఐడియాలజీ' లోనే 'కమ్యూనిస్టు విప్లవం అవసరం' గురించి రాస్తూ మార్క్స్ ఎంగెల్స్‌లు ఏమన్నారో చూడండి:

'ఈ కమ్యూనిస్టు చైతన్యాన్ని విస్తృత స్థాయిలో పొందడానికీ, 'అసలు ఆశయం'లో విజయం సాధించడానికీ, మనుషులు విస్తృత స్థాయిలో మారడం అవసరం. ఆ మార్పు, ఆచరణాత్మకమైన ఉద్యమం ద్వారానే, విప్లవం ద్వారానే, జరుగుతుంది. కాబట్టి, 'విప్లవం' అనేది ఎందుకు అవసరమంటే, పాలక వర్గాన్ని ఇంకో మార్గాన కూలదొయ్యలేము గనకనూ; కూలదోసే వర్గమేమో విప్లవ పోరాటంలో మాత్రమే తన యుగ యుగాల మకిలినంతటినీ ('మక్ ఆఫ్ ఆల్ ఏజెస్') వదుల్చుకుని, సమాజాన్ని నూతనంగా నిర్మించడానికి అర్హురాలవుతుంది కనకనూ.' - మార్క్స్ ఎంగెల్స్‌లు (జర్మన్ ఐడియాలజీ, పే.60. వక్కాణింపు నాది).

10) ఒక జర్మన్ మిత్రునికి ఎంగెల్స్ (1890 లో) రాసిన ఒక ఉత్తరంలో, 'సోషలిస్టు సమాజం' గురించి అన్న, కొన్ని మాటల్ని వ్యాసకర్త సందర్భం అర్థం చేసుకోకుండా వ్యాఖ్యానించారు. '...ఇతర సామాజిక వ్యవస్థల లాగానే ఈ వ్యవస్థని కూడా (సోషలిస్టు వ్యవస్థని కూడా) నిరంతర అస్థిరతలోనూ, (కాన్‌స్టెంట్ ఫ్లక్స్), మార్పులోనూ ఉండే వ్యవస్థగా భావించాలి' - అని ఎంగెల్స్ అన్న మాటల్ని, 'కమ్యూనిజం తర్వాత ఇంకో దశ ఉండదు' అనే రంగనాయకమ్మ వాదన తప్పని నిరూపించడానికి ప్రస్తావించారు. అక్కడ అసలు సందర్భం, ఆ జర్మన్ సోషలిస్టు మిత్రుడు ఎంగెల్స్‌ని ఒక ప్రశ్న అడిగాడు. జర్మనీ సమాజంలో వివిధ వర్గాలలో విద్యాపరంగా, చైతన్యస్థాయి పరంగా తేడాలున్నప్పుడు సోషలిస్టు పరివర్తన సాధ్యమేనా - అని. దానికి ఎంగెల్స్, 'జనాలలో మనకు తగినంత సంఖ్యలో అనుచరులు ఉన్నప్పుడు, రాజకీయ అధికారం మన చేతిలో ఉన్నట్టయితే, పెద్ద పరిశ్రమల్నీ, భారీస్థాయి వ్యవసాయాన్నీ త్వరగా సోషలైజ్ చెయ్యవచ్చును' అని చెప్పిన సందర్భం. పైగా, సమాజాన్ని పునర్వ్యవస్థీకరించడం - కాకపోతే క్రమంగా (గ్రాడ్యువల్లీ) సాధ్యమే - అని ఎంగెల్స్ చెప్పిన సందర్భం. అంటే, ఇది, కమ్యూనిజం కూడా అన్ని వ్యవస్థల లాగానే మారిపోతుంది - అని చెప్పడం కాదు. పైగా సోషలిజానికి సంబంధించిన ప్రారంభం గురించే ఎంగెల్స్ మాట్లాడాడు గానీ, ఉన్నత కమ్యూనిస్టు దశ గురించి కాదు. ఈ విధంగా, వ్యాసకర్త సందర్భశుద్ధి లేకుండా ఉటంకింపులూ, వ్యాఖ్యానాలూ చేశారు.

11) రంగనాయకమ్మ చాలా స్పష్టంగా వివరించి చెప్పిన దానిని కూడా, అర్థం చేసుకోవడానికి నిరాకరించి, 'స్పష్టత లేదు' అని వ్యాసకర్త ఒక చోట అన్నారు. ఆయన మాటలూ, వ్యాఖ్యానాలూ చూడండి: 'కమ్యూనిజం కూడా 'మారిపోతూ ఉండాలంటే, వర్గాలు లేని దశలో శతృత్వాలు ఉన్నాయని అర్థం వస్తుంది' (త.ప. పే.214) అంటారు రంగనాయకమ్మ. వర్గాలు లేని దశలో కూడా 'శతృత్వాలు' అంటే ఏమిటి? ఆవిడ చెప్పే 'శతృ వైరుధ్యాలు' అనా? లేక వైరుధ్యం అనా? స్పష్టత లేదు' - ఇదీ వ్యాసకర్త వ్యాఖ్యానం. అసలు అక్కడ రంగనాయకమ్మ అన్నదేమిటో చూస్తే, ఎంత స్పష్టంగా వివరంగా ఉందో 'వీధి మొగ కమ్యూనిస్టు'కైనా అర్థం అవుతుంది. ఆమె అక్కడ అన్న మాటలు:

'మార్క్స్ విడిగా రాసిన రచనల్లో గానీ, మార్క్స్ ఎంగెల్స్‌లు కలిసి చేసిన రచనల్లో గానీ, శతృ వర్గాలూ, శతృ వైరుధ్యాలూ, పోవడాన్నే, అంటే వర్గాల రాహిత్యాన్నే, సమాజానికి చివరి స్థిర రూపంగా చెపుతారు. అది కూడా మారిపోతూ ఉంటుంది - అని చెప్పరు. అది కూడా మారిపోతూ ఉండాలంటే, వర్గాలు లేని దశలో కూడా శతృత్వాలు ఉన్నాయని అర్థం వస్తుంది. ఆదిమ సమాజంలో అయితే, వర్గాలు ఏర్పడక ముందే, తెగల పోరాటాల ద్వారా శతృత్వాలు ఉండేవి. కానీ, వర్గాలు క్షుణ్ణంగా పోయినా శతృత్వాలు ఉంటాయి - అనే దానికి అర్థం ఉండదు. అలా ఉంటే, వర్గాలు ఇంకా ఉన్నాయనేదే అర్థం.' (తత్వ శాస్త్రం, పే.214, వక్కాణింపు నాది). ఈ మాటల్లో 'శతృ వర్గాలు', 'శతృ వైరుధ్యాలు', 'శతృత్వాలు' అనే మాటలు పదే పదే వాడినా 'స్పష్టత లేదు' అనడం అంటే ఇతరేతర కారణాలతో చేసే అర్థరహిత చర్చ అవుతుంది.

'వినదలచుకోని వాళ్లకున్నంత చెవుడు ఎవరికీ ఉండదు గదా!' (లెనిన్. ఏరిన రచనలు-2, పే.190) వీ

# ఇదేం చర్చ?

యు.ఎచ్. ప్రీతమ్

వీక్షణం అక్టోబర్ సంచికలో విమర్శే ధ్యేయంగా సాగిన తోలేటి జగన్మోహన్ రావు వ్యాసానికి ప్రతిస్పందన ఇది. వ్యాసం నిండా పొంతనలేని పోలికలే. దేవతలు కూడా...... అని ప్రారంభంలో, దేవుడెరుగు అని మరొకచోట. ఒక కమ్యూనిస్టు ఐడియాలజీ ఉన్న వ్యక్తి వాడదగ్గ మాటలేనా? అవి. బాగా ఫ్యూడల్ తత్వశాస్త్రం చదివితే ఇలాంటి పదాలే వాడతారేమో! కాపిటల్‌ని పరిచయం చెయ్యడం మామూలు సాహసం కాదు, ఎంతో సాహసం. అలాంటి సాహసం చేసినందుకు భావసారూప్యత కలిగిన వ్యక్తి అయితే రంగనాయకమ్మను అభినందించాల్సింది పోయి అలాంటి సాహసం చేస్తావా? అన్నట్లుంది– అతని మాట. రావిపూడి వెంకటాద్రి అనే హేతువాది ఈ గతితర్కంలోని 3 నియమాల ఆధారంగా మార్క్సిజాన్ని విమర్శిస్తూ పుస్తకం రాశాడు. అంతబాగా తత్వశాస్త్రం అర్థం అయినట్టయితే జగన్మోహన్ రావు, దానిపై ఒక చిన్న విమర్శ కూడా చెయ్యలేదేం? మార్క్సిజం పై గౌరవం అక్కడ ఏమైంది? అలాంటి వాళ్ల జోలికి వెళ్లలేదు. అంకిత భావంతో నమ్మిన సిద్ధాంతాన్ని ప్రజల్లోకి తీసుకెళ్తున్న రంగనాయకమ్మ పట్ల అగౌరవంతో రాసిన వ్యాసం అది.

'...తత్వశాస్త్రం'లో ఓనమాలు కూడా తెలియని రంగనాయకమ్మకి కాపిటల్ పూర్తిగా అర్థం అయ్యిందా అని ప్రశ్నిస్తున్నారు. నిజానికి మార్క్సిస్టు తత్వశాస్త్రం, మార్క్సిస్టు ఆర్థిక శాస్త్రం పై ఆధారపడి ఉంటుంది. తత్వశాస్త్రంలోని నియమాలు మిగతా శాస్త్రాలను పరిశీలించగా ఏర్పడినవే. తత్వశాస్త్రానికి మిగతా శాస్త్రాల లాగా సొంత ఉనికి లేదు.

తత్వశాస్త్రంతో పనిలేకుండానే అందరూ పాఠశాలల్లో, కాలేజీల్లో, యూనివర్సిటీల్లో ఆయా శాస్త్రాలను నేర్చుకోవడంలేదా! వాళ్లు ఆయా రంగాలలో నిష్ణాతులు కావడంలేదా? పెట్టుబడిదారీ విధానం వల్ల ఆయా శాస్త్రాల ఫలాలు అందరికీ అందడంలేదు గాని, తత్వశాస్త్రం లేకపోవడం వలన ఆయా శాస్త్రాల అభివృద్ధి ఆగిందా? ఒక సత్యాన్ని అర్థం చేసుకోవడానికి తత్వశాస్త్రంతో పనిలేదు.

"అభావం అభావం పొందును" అనేది 3వ నియమం. మార్క్సిస్టు వ్యతిరేకులు ఈ 3వ నియమాన్ని ఉపయోగించుకొని 'కమ్యూనిజం కూడా నిలబడదు కదా!'అంటున్నారు. 'అది కూడా అభావం చెందవలసిందే కదా! అనే అర్థంలో. అందుకే రంగనాయకమ్మ, ఈ నియమాలు కమ్యూనిస్టు సమాజానికి కూడా పనికి వస్తాయా?' అని అడుగుతున్నారు. ప్రశ్నకు సంబంధం లేని సమాధానం చెబుతున్నారు జగన్మోహన్ రావు. అతని సమాధానం శ్రమ సంబంధాలతో సంబంధం లేనిదిగా ఉంది. ప్రతిచోటా ఇంతే. ప్రశ్నకు తగిన సమాధానం రాదు.

ఈ విషయంలో ఎంగెల్స్, లెనిన్, మావోలు స్పష్టంగా చెప్పలేదు. ఈ పాయింట్‌ని ఆ మేధావులు స్పృశించలేదు కాబట్టి రంగనాయకమ్మ స్పృశించాల్సి వచ్చింది. 'వైరుధ్యాలు లేని సమాజానికి ఆ 3వ సూత్రం పని చెయ్యదు' అని చెప్పేసరికి, అది జగన్మోహన్ రావుకి జీర్ణం కావడంలేదు. ఎందుకంటే, ఆ ముక్క ఆ పై మేధావులు ఎవరూ చెప్పలేదు కదా! అందుకని. రంగనాయకమ్మ చెప్పేసరికి పురుషాహంకారం తన్నుకొని బయటకు వచ్చింది.

'పరమాణువు' కథ చాడ్విక్ దగ్గరే ఆగిందా? జె.జె థామ్సన్, రూథర్‌ఫర్డ్ , నీల్స్ బోర్, ఆ తరువాత క్వాంటమ్ సిద్ధాంతం దాన్ని అభివృద్ధి పరచలేదా? మార్క్సిజాన్ని లెనిన్ మావోలు వివరించలేదా, వారి వివరణలో లేని విషయాన్ని ఇతరులు చెప్పకూడదా?

మార్క్స్ మొత్తం మానవజాతి చరిత్రను చూడగలిగాడు. కాబట్టి ఏది– ఎప్పుడు, ఎందుకు, ఎలా ఉనికిలోకి వచ్చిందో, దాని ప్రాథమిక రూపం నుండి దాని అత్యున్నత రూపంలోకి జరిగిన మార్పునూ, చివరికి అది రద్దు(మార్పు) కావడం, వగైరాలన్నిటినీ వివరించడానికి గతి తార్కిక పద్ధతిని ఉపయోగించాడు. గతితార్కిక పద్ధతి ఒక విషయాన్ని వివరించి చెప్పడానికి పనికి వచ్చే ఒక మెథడాలజీ మాత్రమే. కాని ఏం చెప్పాలి అనుకుంటే మాత్రం విషయంలోకే (కాపిటల్‌లోకే) వెళ్లాలి.

"3 దశాబ్దాలకు పైగా అదనపు విలువా, శ్రమదోపిడీ, వడ్డీలు, కౌళ్లూ, శ్రమ సంబంధాలూ,...అంటూ పాటపాడుతున్నారు" అని హేళన చేస్తూ, ఇవి తెలియడానికి కాపిటల్ చదవనక్కరలేదు, అని సలహా పడేస్తూ, ఓనమాలు నేర్వని వీధి కమ్యూనిస్టులకి కూడా పై విషయాలు తెలుసు అని అందరినీ నిర్లక్ష్యం చేస్తున్నారు, ఈ జగన్మోహన్ రావు. పై విషయాలు మాట్లాడే వీధి కమ్యూనిస్టుని ఎవరినైనా పిలిచి నువ్వు ఇదంతా ఎలా మాట్లాడగలుగుతున్నావు? అని ప్రశ్నిస్తే తెలుస్తుంది, అసలు విషయం. అలా అడిగారా ఎవరినైనా? చూపించండి. మార్క్సిజానికి గుండెకాయ అదనపు విలువే. అది కాపిటల్ చదివితేనే అర్థం అవుతుంది. కాపిటల్‌ని పక్కన పెట్టి, పై విషయాలు ఏ గతితార్కిక భౌతికవాద పుస్తకాలలో దొరుకుతాయో చెప్పండి. కాపిటల్‌ని ముట్టకుండా గతితార్కిక పద్ధతిలో కార్మిక వర్గానికి అదనపు విలువ గురించి ఎలా చెబుతారో చెప్పండి. మార్క్సిజం అంటే ప్రధానంగా కాపిటలే. అసలు మార్క్స్ కాపిటల్ ఎందుకు రాశాడు? బోధించే విషయం కాపిటల్ అయితే, బోధనా పద్ధతి గతి తర్కం. కాని విషయాన్ని తోసిరాజని బోధనా పద్ధతే కావాలనడం అంటే – ఆ వ్యక్తికి బొత్తిగా ఏమీ తెలియదని అర్థం. కాపిటల్‌ని చులకనగా చూసే జగన్మోహన్ రావు కింది ప్రశ్నలకు సమాధానంగా తత్వశాస్త్రంలో ఏ పుస్తకం చదవాలో చెప్పాలి.

1) శ్రమదోపిడి జరుగుతోందని ఎలా రుజువు చేస్తారు?

2) శ్రమదోపిడి లేదు అని ఎవరైనా అంటే – ఉందీ అని ఎలా చెప్పగలరు?

3) 'వడ్డీ'కీ 'ఉత్పత్తి'తో సంబంధం లేదు –ఎలా సమర్థిస్తారు?

4) అదనపు విలువ పూర్తిగా కార్మికుడిదే– దీన్ని నిరూపించడం ఎలా?

అరే బాబూ ఈ పదాలే అవసరం లేదురా అంటే వాటి మీద ప్రశ్నలేవిట్రా అంటారేమో ఇంకో 2 ప్రశ్నలు.

5. ఏ ప్రాతిపదికన సమసమాజం ఏర్పడగలదు? ఎలా?

6) పెట్టుబడి ఆర్థిక వ్యవస్థ సరైందేనా? కాదా? ఎందుకు?

ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి, కాపిటల్‌తో సంబంధం లేకుండా ఇత్యాది ప్రశ్నలకు జవాబులు కాపిటల్ చెబుతుందా? తత్వశాస్త్రం చెబుతుందా?

చదివిన వాళ్లకే సందేహాలు ఎక్కువగా ఉంటాయి. ఏమీ తెలియని వాళ్లకు ఏ సందేహమూ ఉండదు. 'శ్రమశక్తి సరుకేనా?' అన్న సందేహం రంగనాయకమ్మ వెలుబుచ్చితే, సందేహం రావడమే తప్పన్నట్లు 'రాముడికి సీత ఏమౌతుంది?' అన్న దానితో పోలిక పెట్టడమా? సరే! ఆ సందేహానికి జగన్మోహన్ రావు సమాధానం ఏమిటో చెప్పాలి. కాని కాపిటల్ తో సంబంధం లేకుండా. శ్రమశక్తి సరుకనీ, కార్మికుడికీ పెట్టుబడిదారుడికీ మధ్యఉన్నది మారక సంబంధమేననీ జగన్మోహన్ రావు నిరూపించాలి. కాని కాపిటల్‌తో సంబంధం లేకుండా!

'పిల్లలు బైట కురిసే వానను చూసి తెల్లబోతోంటే భూమి మీద నీళ్లే ఆవిరై పైకి పోయి మళ్లీ కింద పడతాయి అని చెప్తే అదే జ్ఞానం అన్న రంగనాయకమ్మ మాటలను బ్రహ్మానందం మాటలతో పొంతనలేని పోలికపెట్టి సంతృప్తి పడుతున్నారు జగన్మోహన్ రావు. ఆ రకంగా సంతృప్తి పడండి పడండి అదే మీ జ్ఞానం అనుకుంటాం. నిజంగా పిల్లలకు అలా చెప్తే అదే జ్ఞానం అవదా?

'మార్క్సిస్టు జ్ఞానశాస్త్రం' అన్న పేరు రంగనాయకమ్మకు తత్వశాస్త్రం అర్థం కాక పెట్టినది కాదు. "జ్ఞానం, తత్వశాస్త్రంలో ఒక భాగం, ఒక శాఖ" (పేజి

187) అని చెబుతూనే "అయినప్పటికీ, తత్వంకన్న జ్ఞానం అల్పమైనది కాదు" అన్నారు. పరిశీలనలో భాగంగానే ప్రకృతి శాస్త్రాలు పుట్టి అభివృద్ధి చెందినట్లుగా, పరిశీలనవల్లే అదనపు విలువా, శ్రమదోపిడి వంటి విషయాలు తెలిసి వచ్చి– అది శాస్త్రీయ కమ్యూనిజంగా(మార్క్సిజంగా) ఏర్పడింది. వీటిని పరిశీలిస్తున్న క్రమంలోనే హెగెల్ చెప్పిన 3 భావవాద నియమాలు భౌతికవాదానికి సరిపోతున్నట్లు అనిపించింది, మార్క్సుకి కనుకనే తన కాపిటల్ రచనను గతి తార్కిక పద్ధతిని అనుసరించి రాశాడు. కాని ఆ నియమాలు అప్పటికే తెలిసిన హెగెల్ మాత్రం అదనపు విలువను పట్టుకోలేక పోయాడు. కారణం ఏంటంటే ఆ నియమాలు విషయాన్ని వివరించి చెప్పడానికే తప్ప కొత్త విషయాన్ని కనిపెట్టడానికి పనికిరావు.

ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాలు అనడం కంటే శ్రమ సాధనాలు, శ్రమ సంబంధాలు అనే మాటలు మరింత స్పష్టతనిస్తాయి. విషయాన్ని తేలికగా అర్థం చేసుకోగలం. ఏ శాస్త్రాన్నైనా మానవుల పనులను తేలికచేసే వైపుగా అభివృద్ధి చెందిస్తుంటారు. మార్క్సిజం అనేది – తెలుసుకొని, ఆ విధంగా వ్యవహరించవలసిన విషయం గలది. ఒకశాస్త్రం అర్థం చేసుకునే స్థాయిలోనే కఠినంగా ఉంటే, తేలిక చేయడం కోసం సరళ భాషను ఉపయోగిస్తే తప్పేంటి? పండిత భాషలోనే ఉండాలా అర్థంకాని భాష వల్లే, ఇప్పటికీ మార్క్సిజం చేరాల్సిన వాళ్ల దగ్గరకు చేరలేదు. కార్మిక వర్గం చేతిలో మార్క్సిజం ఉండటమూ, దానిని అవగాహన చేసుకోవడమూ ఎప్పటికీ అతిముఖ్యమైన విషయం. కాబట్టే 'శ్రమ' అనే పదాన్ని ఉపయోగించారు. అలా చేయడం వలన విషయం ఇంకా తేలిక అయ్యిందే గాని, అది సిద్ధాంతానికి ముప్పుగా పరిణమించదు.

'ఒకే నదిలో 2 సార్లు స్నానం చెయ్యలేం' అన్న హెరాక్లిటస్ మాటలను ఎంగెల్స్ సరైనదిగా పేర్కొన్నట్టు జగన్మోహన్ రావు రాశారు. కాని ఎక్కడ చెప్పాడో రాయలేదు. అది ప్రపంచం గురించిన (చలనానికి సంబంధించి) ప్రాథమిక భావనే తప్ప సరైన భావన కాదు. గతి తర్కం ప్రకారమే అది ఎలా తప్పో రంగనాయకమ్మ చెప్పినప్పటికీ, ఈ తార్కికుడికి అర్థం కావట్లేదు.

రంగనాయకమ్మ 'కమ్యూనిస్టు సమాజం కూడా మారుతుందా?' అని అడుగుతున్నారంటే దాని అర్థం – 'అక్కడ సమానత్వం శ్రమ సంబంధాలు కూడా మళ్లీ అసమానత్వ శ్రమ సంబంధాలుగా మారతాయా?' – అని. మారితే అవి మళ్లీ సమానత్వంలోకి రావల్సిందే గదా అంటే మళ్లీ కమ్యూనిజంగా మారవల్సిందే గదా! – అని. కమ్యూనిజం నిలబడదని గతితార్కికంగా తెలిసిన, దాని గురించి పోరాటం ఎందుకు మార్క్సు ఇదే చెప్పాడా? వీ

# మార్క్సిజంతో సంబంధం లేదని చూపుకున్నారు!

**- జి. లింగమూర్తి**

*రంగనాయకమ్మగారికీ మార్క్సిజానికీ ఏమీ సంబంధం లేదని ఆమె రాసిన తత్వశాస్త్రం పుస్తకం ఆధారంగా, ఎన్నో కొటేషన్లతో స్పష్టంగా చూపిన తోలేటి జగన్మోహనరావుగారికి ధన్యవాదాలు. వాస్తవం చెప్పాలంటే రంగనాయకమ్మ గారు రాసిన 'తత్వశాస్త్రం – చిన్న పరిచయం' పుస్తకం ఎంత తప్పులతడకో, అజీర్ణవ్యాధి ఫలితమో, అన్నీ తనకే తెలుసు – ఇంకెవరికీ ఏమీ తెలియదనే అహంకార ప్రదర్శనో ప్రతి పేజీ నుంచీ ఉదాహరణలతో పెద్ద పుస్తకమే రాయవచ్చు – సరిగ్గా అమె ఇతరుల మీద రాసినట్టుగా. కాని ఆమె లాగ వెటకారాలతో కాదు, వాస్తవాలతో.*

*"తత్వశాస్త్రం మీద నాకు ఎప్పుడూ ఆసక్తి రాలేదు.... 'అది దండగ, టైమ్ వేస్ట్' అనే అభిప్రాయంతోనే ఉండేదాన్ని. ఇప్పుడు ఆ అభిప్రాయం పూర్తిగా మారిందని కాదు" అనీ, "తత్వశాస్త్రం అంటే ఏమిటో, దాని చరిత్ర ఏమిటో, బొత్తిగా తెలీకుండా ఉండడం ఎందుకు? ఎంతో కొంత తెలుసుకోవడం మంచిది కదా? దాన్ని చెవిన పడనివ్వకుండా ఇన్నాళ్లూ నేను చేసిన తప్పు కొంచెం దిద్దుకున్నాను. తత్వశాస్త్రంతో కొంచెం పరిచయం తప్పకుండా అవసరం" అనీ ఆమె తత్వశాస్త్రం పుస్తకం ముందుమాటలో రాశారు. తత్వశాస్త్రం మీద ఆసక్తి లేదు. అది దండగ. టైమ్ వేస్ట్. దాన్ని చెవిన పడనివ్వలేదు. ఇవన్నీ ఆమె మాటలే.*

*లెనిన్ రాసిన 'ది త్రీ సోర్సెస్ అండ్ త్రీ కాంపొనెంట్ పార్ట్స్ ఆఫ్ మార్క్సిజం' (మార్క్సిజం మూడు మూలాధారాలూ మూడు అంతర్భాగాలూ) అనే చిన్న వ్యాసం ఆమె దృష్టికి ఎప్పుడైనా వచ్చిందో లేదో తెలియదు. కాని ప్రపంచవ్యాప్తంగా ఎందరో మార్క్సిస్టులూ, ఆలోచనాపరులూ ఆ వ్యాసాన్ని సంక్షిప్తంగా మార్క్సిజాన్ని వివరించిన గొప్ప వివరణగా భావిస్తారు. ఆ వ్యాసంలో లెనిన్ "మార్క్సిస్టు సిద్ధాంతం సత్యమైనది గనుక సర్వశక్తిమంతమైనది. అది సమగ్రమైనది, సంబద్ధమైనది. అది మనుషులకు ఏ రకమైన మూఢనమ్మకంతోనూ, అభివృద్ధి నిరోధకతతోనూ, బూర్జువా పీడనకు సమర్థనతోనూ కలపడానికి వీలులేని సంపూర్ణమైన ప్రాపంచిక దృక్పథాన్ని అందిస్తుంది. పందొమ్మిదో శతాబ్దిలో మానవజాతి సృష్టించిన ఉత్తమమైన అన్నిటికీ, అంటే జర్మన్ తత్వశాస్త్రం, ఇంగ్లిష్ రాజకీయార్థ శాస్త్రం, ఫ్రెంచి సోషలిజంలకు అది సాధికారికమైన వారసురాలిగా నిలుస్తుంది" అన్నాడు. తర్వాత మొదటి భాగంలోనే తత్వశాస్త్రాన్ని వివరించాడు. తత్వశాస్త్రం లేకుండా మార్క్సిజమే లేదు. మార్క్సిస్టు సిద్ధాంత భాండాగారంలో తత్వశాస్త్ర గ్రంథాలూ చర్చలే కనీసం మూడో వంతు ఆక్రమిస్తాయి. కాని తెలుగుసీమలోని ఏకైక మహా మార్క్సిస్టుకు తత్వశాస్త్రం దండగ అనిపించింది!*

*ఇక కాపిటల్ ఆమె అనుకుంటున్నట్టుగా ఉత్తి ఆర్థిక శాస్త్ర పుస్తకం కాదు. అది ఒక తాత్విక ప్రాపంచిక దృక్పథానికి ఆర్థిక సంబంధాల (ఉత్పత్తి సంబంధాల) వ్యక్తీకరణ. కాపిటల్ పరిచయాలు, వివరణలు, విశ్లేషణలు చేసిన వందలాది మంది రచయితలు కాపిటల్ లో పూసల్లో దారంలా ఉన్న తాత్విక దృక్పథం గురించి రాశారు. కాని కాపిటల్ ను మరెవరికన్న భిన్నంగా, అందరికన్న మిన్నగా పరిచయం చేశాననుకుంటున్న వ్యక్తి తత్వశాస్త్రమే అవసరం లేదని అనుకున్నారంటే, తత్వశాస్త్రాన్ని చెవిన పడనివ్వలేదంటే అసలు కాపిటల్ అర్థమైనట్టేనా?*

*రంగనాయకమ్మ గారికీ మార్క్సిజానికీ సంబంధం లేదనడానికి ఎన్నో నిదర్శనాలున్నాయి. కాపిటల్ అంతస్సారమే ఆమెకు అర్థం కాలేదని, అర్థం కావడానికి అవసరమైన తత్వశాస్త్రం అనే పరికరం ఆమెకు తెలియదని ఇప్పుడు ఆమె రాసిన పుస్తకమే రుజువు చేస్తున్నది.*

*ఇతర తెలుగు మార్క్సిస్టులు, కమ్యూనిస్టు పార్టీలు ఎవరూ చేయని పని, కాపిటల్ అనువాదమో పరిచయమో అనే మహత్తరమైన పని ఆమె చేసిందని, కనుక ఆమెను మించిన మార్క్సిస్టు లేరని ఆమె శిష్యులు బాజాలు వాయిస్తుంటారు. కాని మార్క్సు రచనలు అనువాదం చేస్తేనో, మార్క్సు మీద, మార్క్సిజం మీద పుస్తకాలు రాస్తేనో ఎవరూ మార్క్సిస్టులు కారు. పెట్టుబడిదారీ రచయితలెందరో కూడా మార్క్సిజం మీద పుస్తకాలు రాశారు. అసలు కాపిటల్ నాలుగో భాగంగా చెప్పుకునే థియరీస్ ఆఫ్ సర్ ప్లస్ వాల్యూ సమీకరించి సంపాదకుడిగా ప్రచురించిన కార్ల్ కాట్స్కీ మార్క్సిస్టు వ్యతిరేకిగా తేలాడు. రష్యాకు మార్క్సిజాన్ని పరిచయం చేసిన ప్లెఖనోవ్ మార్క్సిస్టు వ్యతిరేకిగా మారాడు. భారతదేశంలో అటువంటి వాళ్లు ఎందరో. కనుక పుస్తకాలు రాయడమే గొప్ప కాదు. ఆ పుస్తకంలో ఏముంది అనేది ముఖ్యం. పుస్తకం అనువాదం చేయడమే గొప్ప కాదు, మూల రచయిత సారాంశాన్ని అర్థం చేసుకున్నారా అనేది ముఖ్యం.*

*ఈ ముఖ్యమైన కోణం మీద వెలుగు ప్రసరించిన తోలేటి జగన్మోహనరావు గారికి, అసలు ఆ వెలుగు ప్రసరించడానికి కారణమైన తత్వశాస్త్రం పుస్తకం రాసి తనను తాను బైటపెట్టుకున్న రంగనాయకమ్మ గారికి కృతజ్ఞతలు. ఆ పుస్తకం మీద పూర్తి విమర్శ ఎవరైనా రాస్తే బాగుండును.* వీ

# రాయలసీమ ప్రాంత వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం

## అక్టోబర్ 23, 2016, ఆదివారం, ప్రొద్దటూరు

రాష్ట్ర విభజన తరువాత ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రెండు రాష్ట్రాలలోను విడివిడిగా జరుగుతున్న వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం ఈ సంవత్సరం రాయలసీమలోని ప్రొద్దటూరులో అక్టోబర్ 23న జరిగింది. ఇరవైకి పైగా రచయితలు, మిత్రులు హాజరైన ఈ సమావేశం వీక్షణంలోని రచనల గురించి, వీక్షణంలో రాయలసీమ ప్రజా సమస్యలకు పెరగవలసిన ప్రాధాన్యత గురించి వివరంగా చర్చించింది.

ఈ సమావేశానికి కవి, రచయిత మహమూద్ అధ్యక్షత వహించారు. సమావేశాన్ని పరిచయం చేస్తూ సంపాదకుడు నోట్ చదివి వినిపించారు. ఆ తరువాత జరిగిన చర్చలో అరుణ్, సోమశేఖర శర్మ, ఎం. భాస్కర్, వి. ఓబులేశు, ఎ. రామ్‌గోపాల్, వి. ఫనిరాజు, చాపాటి రామసుధాకర్ రెడ్డి, లెనిన్ ప్రసాద్, ఎం.ఎస్.ఎం. రెడ్డి, వై. డేవిడ్, ఎన్.ఎస్. ఖలందర్, వనమ శర్మ, సర్తాజ్, కె. నాగేశ్వరాచారి, ఎ. అబ్దుల్ బషీర్, డి. మహబూబ్ బాషా, ఎస్. దర్బాన్ బాషా, డా. వి. కృష్ణమూర్తి, ఎం. రామాంజనేయులు, ఎం. కొండ్రాయుడు, ఎం. సురేష్ బాబు, ఎస్. రామయ్య, పల్లవోలు రమణ, సోమ రవికుమార్, పద్మ, పి. వరలక్ష్మి, ఎ.ఎ. హమీద్ పాల్గొన్నారు.

**సభికుల అభిప్రాయాలలో కొన్ని:**

అరుణ్: ఇపిడబ్ల్యు వంటి పత్రిక ఉంటే బాగుండునని ఉండేది. ఆ లోటును వీక్షణం తీరుస్తుంది. ఉత్తరాంధ్ర, రాయలసీమ, దక్షిణ తెలంగాణ రాజకీయార్థిక చరిత్రపై ప్రత్యేక సంచికలు ప్రచురించాలి. ఈ ప్రాంతాల వైతాళికులు మరుగున పడ్డారు. రాయలసీమలో ఇప్పుడిప్పుడే పెరుగుతున్న చైతన్యానికి వీక్షణం వేదిక కావాలి. రాయలసీమ సాహిత్య స్వరభేరి, రాయలసీమ జీవితాన్ని చిత్రించే వ్యాసాలు రావాలి. రాయలసీమ నుంచి రచనలు రాకపోవడానికి పెన్నేరు పత్రిక ఉండడం ఒక కారణంగా కనిపిస్తుంది. వీక్షణం–పెన్నేరుల మధ్య పరస్పర సంబంధం ఏర్పడాలి. స్టీల్ ప్లాంట్, కడపజిల్లా సమస్యలపై వీక్షణంకు రాస్తాను. ప్రత్యామ్నాయ పత్రికల నెట్‌వర్క్ పెంచాలి.

డేవిడ్: సందర్భానికి తగిన వ్యాసాలు వస్తున్నాయి. చరిత్రాత్మక సిద్దేశ్వరం అలుగు పై వ్యాసం చాలా బాగా వచ్చింది. రాయలసీమ కోసం ముందుకు వస్తున్నందుకు కృతజ్ఞతలు.

ప్రసాద్: ప్రధాన స్రవంతి పత్రికలన్నీ సొంత ఎజెండాలూ, వ్యాపారీకరణ చెందాయి. ప్రజలను చైతన్యం చేయడానికి వీక్షణం కృషి చేస్తోంది. లైబ్రరీలలో ఎక్కువమంది వీక్షణం పత్రికను చదువుతున్నారు. రాయలసీమకు అవకాశం ఇవ్వడం చాలా ఆనందంగా ఉంది.

రామసుధాకర్ రెడ్డి: వీక్షణం వంటి క్రెడిబిలిటీ ఉన్న పత్రికలు రాయలసీమ గురించి రాస్తే అది ఉపయోగపడుతుంది.

రషీద్: వీక్షణం ఇంకా ఎక్కువ మంది చదవడానికి వీలు కలుగాలి.

సూర్యనారాయణ: మూఢనమ్మకాలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఒకప్పుడు వేరుశనగ, మిల్లులు, కార్మికులు ఉండేవారు. ఇప్పుడు అవేవీ లేవు. ముగ్గురాయి, నాపరాయి, సిమెంట్, ఎర్రచందనం కనిపిస్తున్నాయి.

నాగేశ్వరాచారి: బైటికి ఎట్లా తీసుకుపోవాలనేది ప్రధాన సమస్య. పత్రిక ప్రజా ఉద్యమం ద్వారానే బైటికి వెళుతుంది. కొత్త పుస్తకాల్లో పుస్తక పరిచయం ఉండాలి. ఉద్యమం నిర్మాణం అయితే పత్రిక దానంతటదే పెరుగుతుంది.

రామాణంజనేయులు: పత్రిక కోసం కార్యకర్తగా పనిచేస్తాను. చందాలు కట్టిస్తాను.

సురేష్‌బాబు: ప్రజల్లోకి పత్రికను ఎలా తీసుకువెళ్లాలి అనేదే ప్రధానం. ప్రతి కాలేజీ లైబ్రరీకి, హాస్టల్‌కు పత్రిక వెళ్లాలి. విద్యార్థులు ప్రధానం కాబట్టి వారిని చేర్చాలి.

డా. కృష్ణమూర్తి: రాయలసీమ ఉద్యమాన్ని సమర్థించే డెయిలీ కావాలి. రాయలసీమలో సమస్యలు తీవ్రంగా ఉన్నాయి. ఈ సమస్యలను బైటికి ప్రచారం చేయాలి. తెలంగాణ బేస్ట్ పత్రిక: రాయలసీమకు సహకరించడం బాగుంది.

ఓబులేశు: దళితులపై అత్యాచారాలు, కుల నిర్మూలన వంటి అంశాలు వీక్షణంతోనే తెలుసుకున్నాను.

బాషా: జాతీయ, అంతర్జాతీయ విషయాల పట్ల అవగాహన పెరగాడనికి వీక్షణం కారణం. వీక్షణంను కాపాడుకోవాలి. డెయిలీగా తీసుకొస్తే బాగుంటుంది.

భాస్కర్: వీక్షణం ఫాలో అయితే రాష్ట్ర, దేశ, అంతర్జాతీయ అంశాల మీద స్పష్టత వస్తుంది. పత్రికను సెలెక్టెడ్‌గా చదువుతారు. ఓవరాల్‌గా ఎందుకు అవసరం? ఇంగ్లిష్ పత్రికల స్థాయిలో వస్తున్నది. సూక్ష్మ స్థాయిలో పరిశీలన జరపాలి, రాయాలి. గ్రామ పరిశీలనలు చేయాలి. పోతిరెడ్డిపాడు: రిజర్వాయర్‌లు లేవు. రాయలసీమ డిమాండ్ తేవాలి. రాయలసీమను ఎట్లా అధ్యయనం చేయాలి? గ్రూప్స్, సివిల్స్, జనరల్ నాలెడ్జ్‌కు ఉపయోగకరంగా ఉండాలి.

నాగేశ్వరాచారి: కండక్టర్: ఆర్‌టిసి మీద వ్యాసాలు రాయాలి.

రవి: వీక్షణం ఆలస్యంగా రాయలసీమకు వచ్చింది. ఆలస్యానికి కారణమేమిటి? వేదిక కల్పిస్తున్నందుకు స్వాగతం. సమాన్యుడి గొంతుగా ఉంది.

సర్తాజ్: క్లారిటీ అందించే పత్రిక. స్త్రీల సమస్యలపై వ్యాసాలు రావాలి.

మగిరాజు: దిశ: దశ చూపే పత్రిక. ఇన్‌స్టిట్యూట్స్‌కు, ఆఫీసులకు పంపండి. సర్క్యులేషన్ పెంచడానికి, వ్యాపారానికి కాదు.

వరలక్ష్మి: కామన్ ప్లాట్‌ఫాం, ప్రజాస్వామిక వేదిక. పాలకవర్గాల అబద్ధాలను వివరించడానికి ఉపయోగపడతాయి. కృష్ణా జలాల వివాదం వంటివి వెలికితీయాలి. రాయలసీమ నుంచి రాజకీయార్థిక విశ్లేషణలు చాలా తక్కువ. సెక్షనల్ పోరాటాలు: పోటీవాదాలు: ఉమ్మడి చర్చా వేదికలు ఉండాలి.

# సంపాదకుడి నోట్

రాయలసీమలో మొదటిసారి జరుగుతున్న వీక్షణం రచయితల, మిత్రుల సమావేశానికి హాజరయిన అందరికీ వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక తరఫున స్వాగతం. మీ విలువైన సమయంలో కొంత భాగాన్ని వీక్షణం గురించి ఆలోచించడానికి, చర్చించడానికి, సలహాలూ సూచనలూ ఇవ్వడానికి వెచ్చిస్తున్నందుకు ధన్యవాదాలు.

**వీక్షణం పరిచయం**

ఈ సమావేశానికి హాజరవుతున్న మిత్రులందరికీ వీక్షణం పరిచయమే అయినప్పటికీ, మరొకసారి వీక్షణం పత్రిక నేపథ్యం గురించీ, లక్ష్యాల గురించీ కొన్ని విషయాలు పంచుకోవాలనుకుంటున్నాను. తెలుగు సమాజంలో, పత్రికా రచనలో ఒక ప్రత్యేకమైన అవసరం తీర్చడానికి, ఒక ప్రత్యేక సందర్భంలో వీక్షణం ప్రారంభమయి, గత పద్నాలుగు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్నది.

తెలుగులో సాహిత్య, సాంస్కృతిక అంశాలకు చోటు ఇచ్చే పత్రికలు ఉన్నంత విరివిగా సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాలకు చోటు ఇచ్చే పత్రికలు లేవు. సామాజిక రాజకీయార్థిక అంశాల మీద విశ్లేషణలు కేవలం దినపత్రికల సంపాదకీయం పేజీలకు పరిమితమై పోతున్నాయి. సహజంగానే దినపత్రికలలో వెలువడే విశ్లేషణలకు రెండు ప్రధానమైన పరిమితులు ఉంటాయి. మొదటి పరిమితి, ఒక సంపాదకీయ పేజీలో సంపాదకీయంతో పాటు కనీసం మూడు వ్యాసాలు పొందుపరచవలసి ఉంటుంది గనుక ఆ వ్యాసాల నిడివి మీద ఆంక్షలుంటాయి. ఎంత పెద్ద, జటిలమైన విషయం మీదనైనా కొన్ని వందల పదాల్లో వ్యాసం రాయవలసి ఉంటుంది. అందువల్ల ఆ వ్యాసాల్లో ఏ విషయాన్నీ అన్నివైపుల నుంచీ సమగ్రంగా, లోతుగా విశ్లేషించడానికి అవకాశం ఉండదు. రెండో పరిమితి, ఎవరైనా ఒక వ్యాసరచయిత, ఏదైనా ఒక వ్యాసంలో అటువంటి సమగ్రమైన, లోతైన విశ్లేషణ చేయడానికి ప్రయత్నించినా, దినపత్రిక జీవితమే ఒకరోజో, కొన్ని గంటలో మాత్రమే గనుక ఆ వ్యాసాలకు, వ్యాసాల్లోని వాదనలకు, విశ్లేషణలకు దీర్ఘకాలిక ప్రభావం పెద్దగా ఉండదు. ఈ కారణాల వల్లనే ప్రపంచ వ్యాప్తంగానూ, దేశంలోనూ ప్రత్యేకంగా రాజకీయార్థిక, సామాజిక అంశాలను చర్చించే, విశ్లేషించే వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు పుట్టుకొచ్చాయి. నిడివి పెరుగుతుందనే భయం లేకుండా వీలయినంత వివరంగా అన్ని కోణాలను చర్చించే, భిన్నాభిప్రాయాల మధ్య చర్చకు, వాదవివాదాలకు అవకాశం కల్పించే లక్ష్యంతో ఈ పత్రికలు పుట్టుకొచ్చాయి. అలా దేశవ్యాప్త చర్చకు అవకాశం ఇచ్చే పత్రికలు ఇంగ్లిష్‌లో ఎన్నో ఉన్నాయి. 1949లో ఎకనమిక్ వీక్లీ గా ప్రారంభమై, 1966లో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ గా మారిన ప్రతిష్ఠాత్మకమైన, ప్రామాణికమైన వారపత్రిక నిరంతరాయంగా వెలువడుతూ ప్రపంచవ్యాప్త ప్రాధాన్యతను సంతరించుకున్నది. తెలుగు పత్రికా రంగంలో అటువంటి ప్రత్యేకమైన పత్రికలు రూపొందించడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి గాని దాదాపుగా అన్ని ప్రయత్నాలు కూడ కొన్ని నెలల్లో, కొన్ని సంవత్సరాల్లో విఫలమైపోయాయి. తెలుగు సమాజంలోని వివిధ రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు తమ శ్రేణుల కోసం, తమ అవగాహనలు, విశ్లేషణలు ప్రకటించడం కోసం నడుపుతున్న రాజకీయార్థిక, సామాజిక పత్రికలు మినహా, స్థిరంగా నడుస్తున్న ఒక స్వతంత్రమైన రాజకీయార్థిక, సామాజిక పత్రిక లేకుండా పోయింది. ఈ నేపథ్యంలో, దేశంలోనూ, రాష్ట్రంలోనూ ప్రపంచీకరణ విధానాల అమలు ముమ్మరంగా మొదలైన 1990లలో, ప్రత్యేకంగా చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ లో ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు పాలన నడుస్తున్నప్పుడు, ఆ రాజకీయార్థిక విషయాలను వివరించే, చర్చించే, విశ్లేషించే ఒక ప్రత్యేక పత్రిక అవసరాన్ని ఎందరో ఆలోచనాపరులు గుర్తించారు.

ప్రత్యేక పత్రికలు లేని స్థితి, కొత్త పరిణామాలు జరుగుతూ వాటిని ప్రజలకు వివరించవలసిన స్థితి కలిసి ఇటువంటి పత్రికకు ఒక చారిత్రక సందర్భాన్ని సృష్టించాయి. ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీతో పోల్చదగిన పత్రికను తెలుగులో ప్రారంభించాలని సీనియర్ పాత్రికేయులు, 1940ల చివరినుంచి ఇవాళ్టిదాకా నిరంతరాయంగా ఆర్థిక విషయాలను విశ్లేషిస్తున్న వి హనుమంతరావు గారు, అప్పటికి ది న్యూ ఇండియన్ ఎక్స్ ప్రెస్ లో పనిచేస్తుండిన నేను ఆలోచించి, మా ఆలోచనలను అప్పటికే రాజకీయార్థిక విశ్లేషణలో పేరుపొందిన మరొక సీనియర్ పాత్రికేయులు ఎ బి కె ప్రసాద్ గారితో చర్చించాం. అలా ఎ బి కె ప్రసాద్ గౌరవ సంపాదకులుగా, వి హనుమంతరావు సంపాదకులుగా, ఆరుగురు సలహా మండలి సభ్యులతో వీక్షణం పక్షపత్రికగా 2003 జనవరి 1 సంచికతో ప్రారంభమయింది. రిజిస్ట్రేషన్ సమస్యల వల్ల తొలి సంచిక నుంచి సెప్టెంబర్ దాకా ఈ పత్రిక 'ప్రజాపక్ష సమీక్ష' అనే పేరుతో వచ్చింది. 2003 సెప్టెంబర్ నుంచి 2005 జనవరి దాకా వీక్షణం పేరుతో, 'ఆర్థిక సామాజిక పత్రిక' అనే ఉపశీర్షికతో పక్షపత్రికగా సాగింది. అప్పటివరకూ ప్రధానస్రవంతి వార్తాపత్రికల్లో ఉద్యోగం చేస్తూ, వీక్షణం పని కూడ చేస్తుండిన నేను 2005 జనవరిలో పూర్తికాలం వర్కింగ్ ఎడిటర్ గా మారాను. వీక్షణం మాసపత్రికగా మారింది. 2006లో ఉపశీర్షిక 'రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక' అని మారింది. వయోభారం వల్ల, ఆరోగ్య కారణాల వల్ల తాను సంపాదక బాధ్యతలు నిర్వహించలేకపోతున్నానని వి హనుమంతరావు గారు 2008లో పత్రికను నాకు బదిలీ చేశారు.

అలా 2003 జనవరి నుంచీ, ప్రత్యేకంగా 2005 జనవరి నుంచీ ఇప్పటివరకూ ఒక్క సంచిక కూడ తప్పకుండా నిరంతరాయంగా వెలువడుతూ వీక్షణం గత పద్నాలుగు సంవత్సరాలలో 183 సంచికలు వెలువడింది. ప్రతి సంచికలోనూ సగటున పద్దెనిమిది వ్యాసాలతో 3,500 వ్యాసాలు ప్రచురించింది. స్థానిక, ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ, సైద్ధాంతిక అంశాలెన్నిటి మీదనో వివరణలు, విశ్లేషణలు వీక్షణంలో అచ్చయ్యాయి. ఈ వ్యాసాలు రాసిన దాదాపు ఏడు వందల మంది రచయితలలో కనీసం నాలుగు వందల మంది వీక్షణం ద్వారానే రచనలోకి వచ్చారని గుర్తించడం నిర్వాహకులుగా మాకు గర్వకారణం.

వీక్షణం ఈ పన్నాలుగు సంవత్సరాల జీవితంలో వ్యాసరచన అధ్యయన తరగతులు నిర్వహించి ఎందరో వ్యాసరచయితలను తయారు చేసింది. ఎన్నో అంశాల మీద ఇతర పత్రికలేవీ అందించని సమాచారాన్ని, విశ్లేషణలు అందించింది. అసహజ మరణాలు సామాజిక అనారోగ్యానికి సూచికలు అనే అవగాహనతో తెలుగుసీమలో జరుగుతున్న అసహజ మరణాల సంఖ్యను ఎప్పటికప్పుడు ప్రతినెలా నమోదుచేసే బాధ్యతను స్వీకరించింది. ఒక దళారీ పశ్చాత్తాపంతో సహా ఎన్నో ప్రామాణికమైన పుస్తకాలు ప్రచురించింది. ఈ నిర్విరామమైన కృషి వల్ల వీక్షణం తెలుగు సమాజంలోని వేలాది మంది ప్రగతిశీల విద్యావంతుల, ఆలోచనాపరుల, ప్రజా ఉద్యమ కార్యకర్తల, ప్రజల అభిమానాన్ని చూరగొన్నది. కొన్ని వందల కాపీలతో ప్రారంభించిన పత్రిక ఎన్నెన్నో ఆర్థిక సమస్యలను, పత్రికల పంపిణీ రంగంలోని అస్తవ్యస్త స్థితిని అధిగమిస్తూ ప్రస్తుతం కనీసం ఇరవై ఐదు వేలమంది పాఠకులను చేరుతున్నది. ఇంతకాలంగా నిరాటంకంగా వెలువడడం, ఒక్క సంచిక కూడ క్రమం తప్పకుండా మొదటి తేదీకల్లా బైటికి రావడం, సమకాలీన అంశాల మీద లోతైన విశ్లేషణలను అందించే ఏకైక పత్రికగా ఉండడం వంటి విజయాలన్నీ కూడ కేవలం మీవంటి పాఠకుల, రచయితల, మిత్రుల, శ్రేయోభిలాషుల ఆదరణ వల్ల మాత్రమే సాధించగలిగామని సవినయంగా గుర్తిస్తున్నాం.

**వీక్షణంలో ఏం ఉంటుంది?**

వీక్షణంలో రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద వ్యాసాలు ఉంటాయని మీ అందరికీ తెలుసు. స్థానిక, ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ ప్రజా జీవితంపై, ప్రజా సమస్యలపై, ఆ సమస్యల పరిష్కారానికి జరుగుతున్న ప్రయత్నాలపై వ్యాసాలుంటాయి. ప్రధానస్రవంతి పత్రికలలో రాని, తొక్కిపెట్టబడే సమాచారం, ప్రధానస్రవంతిలో వచ్చిన సమాచారానికైనా ఉండే అవతలి కోణాలు ఇవ్వడం మా ప్రధాన ఉద్దేశం. అది ప్రజల సమాచారహక్కులో భాగమని, ప్రజాస్వామ్య స్ఫూర్తి వెల్లివిరియడానికి అత్యవసరమని మా అభిప్రాయం. మా శక్తి సామర్థ్యాలు పరిమితమైనవే అయినా, వీక్షణంలో ప్రతి నెలా మూడు రకాల రచనల కూర్పు ఉంచడానికి మేం ప్రయత్నిస్తుంటాం. ఒకటి, ప్రధాన స్రవంతి వార్తాపత్రికలకు ఎక్కని సమాచారం, వివరాలు, విశ్లేషణలకు వీక్షణంలో చోటు కల్పిస్తాం. అంటే స్థానిక అధికారవర్గాల ఒత్తిడి వల్ల ప్రధానస్రవంతి పత్రికలలో రావడానికి అవకాశం లేని ఘటనల గురించి, పరిణామాల గురించి ఆ ప్రాంతంలోనే ఉన్న, లేదా ఆ వివరాలు తెలుసుకున్న ఎవరైనా రాయడానికి వీలుంది. రెండు, ప్రధానస్రవంతి వార్తాపత్రికలలో వచ్చే సమాచారం సాధారణంగా మసిపూసి మారేడుకాయ చేస్తుంది. జరిగినది ఒకటైతే, వార్తాపత్రికల్లో వచ్చినది మరొకటిగా ఉంటుంది. అటువంటి సందర్భాలలో జరిగిన ఘటన, పరిణామం వెనుక ఉన్న కోణాలు, అర్థం చేసుకోవలసిన అంశాలు, దాచిపెట్టబడుతున్న అంశాలు వీలైనంతగా వెలికి తీసి ప్రకటించాలని, అసలు ఏ సామాజిక పరిణామం మీదనైనా ప్రజానుకూల కోణం నుంచి విశ్లేషణ జరపాలని వీక్షణం భావిస్తుంది. మూడు, సమకాలీన అంశాలనూ, చరిత్రనూ, ప్రకృతినీ, సమాజాన్నీ, మనిషినీ అర్థం చేసుకోవడానికి పునాది కల్పించే మౌలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక శాస్త్రీయ పరికరాల, సిద్ధాంతాల పరిచయం. ప్రతి నెలా 64 పేజీలతో వెలువడే పత్రికలో సంపాదకీయాలు, ప్రధాన వార్తల సంక్షిప్త సమాచారం, అసహజ మరణాల సూచి వంటి పేజీలు మినహాయిస్తే, దాదాపు పద్దెనిమిది వ్యాసాలకు అవకాశం ఉంటుంది.

**రచయితల సమావేశాలు**

తెలుగు సమాజంలో ఒక నిరంతర చర్చా, సంభాషణా వేదికగా తనను తాను తీర్చిదిద్దుకోదలచిన వీక్షణం తెలుగు పత్రికారంగంలో అంతవరకూ లేని ఒక కొత్త సంప్రదాయాన్ని, వార్షిక రచయితల సమావేశం అనే పద్ధతిని పది సంవత్సరాల కింద ప్రారంభించింది. ఏడాదికి ఒకసారి వీక్షణం రచయితలు, మిత్రులు, శ్రేయోభిలాషులు కలిసి కూచుని వీక్షణం కృషిని సమీక్షించడం, లోటుపాట్ల గురించి చర్చించడం, సలహాలు, సూచనలు స్వీకరించడం, భవిష్యత్తుకు ప్రణాళికలు రూపొందించడం ఈ రచయితల సమావేశాల మౌలిక లక్ష్యాలు. కనీసంగా ముప్పై మంది, గరిష్టంగా ఎనభై మంది హాజరైన ఈ సమావేశాలు ఎప్పటికప్పుడు వీక్షణం కృషిని మెరుగుపరచుకోవడానికి, జరిగిన లోపాలను గుర్తించి సవరించుకోవడానికి, సమాజం, పాఠకులు వీక్షణం నుంచి ఏం కోరుకుంటున్నారో తెలుసుకోవడానికి ఎంతగానో ఉపయోగపడ్డాయి. వీక్షణం కార్యాలయం హైదరాబాద్ లో ఉండడం వల్ల 2014 వరకూ దాదాపు ఎనిమిది వార్షిక సమావేశాలు హైదరాబాదులోనే జరిగాయి. రాష్ట్రం నలుమూలల నుంచీ రచయితలు, మిత్రులు హాజరయ్యారు. రాష్ట్ర విభజన తర్వాత రెండు తెలుగు రాష్ట్రాలలోను విడివిడిగా ఇటువంటి సమావేశాలు జరపాలనే ఉద్దేశంతో ఆంధ్రప్రదేశ్ సమావేశం 2015లో గుంటూరులో జరిపాం. ఆ సమావేశానికి ఆంధ్రప్రదేశ్ లోని పదమూడు జిల్లాల్లో ఏడు జిల్లాల నుంచి మిత్రులు హాజరయ్యారు. మిగిలిన జిల్లాల నుంచి వస్తామని వాగ్దానం చేసిన మిత్రులు దూరాభారాల వల్ల, ఇతర వ్యాపకాల వల్ల రాలేకపోయారు. అందువల్ల ఇకనుంచి ఆంధ్రప్రదేశ్ సమావేశాన్ని కోస్తాంధ్రలోనూ, రాయలసీమలోనూ విడివిడిగా జరిపితే సమావేశానికి హాజరు కాదలచుకున్న వారికి సౌకర్యంగా ఉంటుందని భావించాం. ఆ క్రమంలోనే ఇవాళ రాయలసీమ ప్రాంత వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం జరుపుతున్నాం.

**రాయలసీమలో ఏర్పాటు చేస్తున్న ఉద్దేశం**

ఈ సమావేశం రాయలసీమలో ఏర్పాటు చేయడానికి ముందే చెప్పుకున్నట్టు ఆంధ్రప్రదేశ్ లోని రెండు ప్రాంతాలలో సమావేశాలు ఏర్పాటు చేయాలనే కారణం ఒకటి కాగా, అంతకు మించిన బలమైన కారణం మరొకటుంది. రాష్ట్ర విభజన సమయంలోనూ, ఆ తర్వాతా రాయలసీమ ప్రాంతం ఎక్కువ అన్యాయానికి, వివక్షకు గురవుతున్నది. అందువల్ల రాయలసీమ ప్రజాజీవితంలో సాగుతున్న సంచలనాలు, నానాటికీ పెరిగిపోతున్న ప్రజాసమస్యలు, పరిష్కారం కోసం ప్రజల ఆందోళనలు ఒకవైపు ఉండగా అవన్నీ లోతుగా అర్థం చేసుకోవడానికి ప్రధానస్రవంతి పత్రికలలో స్థానం దొరకడం లేదు. అందువల్ల రాయలసీమ ప్రజలకూ వీక్షణం పత్రికకూ ఒక అనివార్యమైన సంబంధం ఏర్పడవలసిన అవసరం ఉందని మేం భావిస్తున్నాం. రాయలసీమలోని

నాలుగు జిల్లాల ప్రజలూ అనేక సమస్యలతో సతమతమవుతున్నారు. దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలు ఎదుర్కొంటున్న ఆర్థిక, సాంఘిక అసమానతలు, దోపిడీ, పీడన, కులవివక్ష, నిరుద్యోగం వంటి సమస్యలు రాయలసీమలో కూడ ఉన్నాయి. వాటితో పాటు, రాయలసీమకే ప్రత్యేకమైన చరిత్రకూ, ఆర్థిక వ్యవస్థకూ, సామాజిక సంస్కృతికీ, పాలనకూ సంబంధించిన అదనపు సమస్యలు కూడ రాయలసీమ ప్రజలను పీడిస్తున్నాయి. వ్యవసాయాభివృద్ధికి అవసరమైన జల వనరులు లేకపోవడం, పారిశ్రామికీకరణ జరగకపోవడం, నిరుద్యోగ సమస్య, పాలనలో వివక్ష, ప్రజాసమస్యల పరిష్కారానికి జరగవలసిన ఆందోళనలకు తగిన నాయకత్వం లేమి వంటి ఎన్నో సమస్యలు రాయలసీమ ప్రజల ముందున్నాయి. ప్రజలు ఈ సమస్యలను గుర్తించి పాలకులను నిలదీయడానికి, సంఘటితం కావడానికి, పోరాడడానికి ప్రయత్నిస్తున్న ఉదాహరణలు కూడ కనబడుతున్నాయి గాని, అవి ఇంకా సమగ్ర, విస్తృత పోరాటాలుగా ఎదగడం లేదు.

ఈ స్థితిలో తప్పనిసరిగా రాయలసీమ ప్రజల కష్టాలనూ కడగండ్లనూ గళాన్నీ ఆందోళనలనూ వినిపించే పత్రికలు, ప్రచారసాధనాలు ఇబ్బడి ముబ్బడిగా రావలసి ఉంది. అవి ఒకవైపు రాయలసీమ ప్రజాసమస్యలను ఎత్తిచూపాలి, మరొకవైపు ఆ సమస్యల పరిష్కార ప్రయత్నాలకు వేదిక కల్పించాలి. గత పద్నాలుగు సంవత్సరాలుగా వీక్షణం నిర్వహిస్తున్నటువంటి బాధ్యతను ఇవాళ రాయలసీమకోసం ప్రత్యేకంగా నిర్వహించవలసి ఉంది. రాయలసీమకు వీక్షణం వంటి పత్రిక అవసరం ఇవాళ చాల ఎక్కువగా ఉంది. వీక్షణం ఆ బాధ్యతను నిర్వర్తించడానికి సిద్ధంగా ఉందని హామీ ఇస్తున్నాం. అయితే, వీక్షణం ఆ బాధ్యతను నిర్వర్తించాలంటే రాయలసీమలోని వీక్షణం మిత్రులు, రచయితలు సహకరించవలసి ఉంటుంది. మీరు మీమీ ప్రాంతాలలో వనరుల స్థితి, వనరుల మీద ప్రజలకు అధికారం లేని స్థితి, పాలనావైఫల్యాలు, తత్ఫలితంగా ఏర్పడుతున్న ప్రజా సమస్యలు, ఆ సమస్యల పరిష్కారానికి జరుగుతున్న ప్రయత్నాలు వంటి ఏ అంశం మీదనైనా ఎప్పటికప్పుడు వీక్షణంకు వ్యాసాలు రాయవచ్చు. పద్దెనిమిది వ్యాసాల సంచికలో దేశీయ, అంతర్జాతీయ, సైద్ధాంతిక అంశాల మీద వ్యాసాలు మూడో వంతు ఆక్రమించినా, పది పన్నెండు వ్యాసాలకు చోటు ఉంటుంది. అందులో రాయలసీమ ప్రజా సమస్యలకు న్యాయబద్ధమైన వాటాగా కనీసం నాలుగు వ్యాసాలకు అవకాశం ఉంటుంది. ప్రస్తుతం రాయలసీమ గురించి ఒక్క వ్యాసం కూడ లేకుండానే ఎన్నో సంచికలు వచ్చాయని చెప్పడానికి విచారిస్తున్నాను. అంటే రాయలసీమ ప్రాంత ఆలోచనాపరులు ఆ బాధ్యత తీసుకుని రాయడం లేదు. మావైపు నుంచి అడిగినప్పుడు రాసేవాళ్లు ముగ్గురు నలుగురు ఉన్నారు, తమంతట తామే రాసేవారు ఒకరిద్దరు ఉన్నారు. కాని కనీసం ఇరవై ముప్పై మంది ప్రజానుకూల రచయితలు, వ్యాఖ్యాతలు తయారైతే తప్ప రాయలసీమ గురించి బైటి ప్రపంచానికి, మొత్తం తెలుగు సమాజానికి తెలియజెప్పే అవకాశం, తద్వారా రాయలసీమ ప్రజల గురించి మొత్తం తెలుగు సమాజమంతా ఆలోచించేలా చేసే అవకాశం రాదు. అంటే జిల్లాకు కనీసం ఏడెనిమిది మంది రచయితలు తయారు కావలసి ఉంది. మా అనుభవంలో అది అసాధ్యమైన విషయమేమీ కాదు. అలా వీక్షణంకు రాయలసీమ నుంచి విరివిగా రచయితలు తయారయ్యేలా ప్రేరేపించడం, ఇప్పటివరకూ రాయనివారిని కూడ ఇకముందు వీక్షణంకు రాసేలా ప్రోత్సహించడం ఇవాళ్టి సమావేశపు ఉద్దేశాలు.

**రాయలసీమ మిత్రుల నుంచి వీక్షణం ఏం ఆశిస్తున్నది?**

గత ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణ, ఉత్తరాంధ్ర, పల్నాడు ప్రాంతాల సమస్యలతోపాటు రాయలసీమ సమస్యలు కూడ హైదరాబాద్ లోని పౌరసమాజంలో చర్చకు వచ్చేవి. అప్పుడు ప్రచారసాధనాలన్నీ హైదరాబాద్ లోనే కేంద్రీకరించి ఉండేవి గనుక రాయలసీమ ప్రజా సమస్యలు, ప్రజాందోళనలు కూడ ఎంతో కొంత ఆ ప్రచారసాధనాలకు ఎక్కేవి. రాయలసీమలో చెప్పుకోదగిన నగరాలు, వార్తాపత్రికల ప్రచురణ కేంద్రాలు ఉన్నప్పటికీ రాయలసీమ సమస్యల మీద హైదరాబాద్ స్థాయిలో ప్రచారం జరిగితే తప్ప కదలిక ఉండేది కాదు. రాష్ట్ర విభజన తర్వాత పరిస్థితి మారింది. రాయలసీమ సమస్యలు మరింత పెరిగాయి. ప్రజల ఆందోళనలు కూడ విస్తృతమయ్యాయి. కాని ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాజధాని ఇంకా ప్రచారసాధనాల కేంద్రంగా ఎదగలేదు. ప్రధానస్రవంతి ప్రచారసాధనాలలో అటు విజయవాడ కేంద్రంగా ఉన్నవాటికిగాని, ఇటు రాయలసీమలోనే ఉన్నవాటికి గాని రాయలసీమ సమస్యలను పట్టించుకునే ఆసక్తి లేదు. కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రజాసమస్యల మీద స్పందించే పౌరసమాజం కూడ అవసరమైనంతగా బలపడలేదు. రాయలసీమలో పౌరసమాజం ఇప్పుడిప్పుడే తన బాధ్యతలను గుర్తించి ముందుకొస్తున్నది గాని ప్రచారసాధనాలలో దానికి తగినంత ప్రాధాన్యత ఇంకా రాలేదు. ఈ స్థితిలో వీక్షణం వంటి ప్రత్యామ్నాయ, ప్రజానుకూల ప్రచార సాధనాల ద్వారానే ప్రజల సమస్యలను, ఆందోళనలను బహిర్గతం చేయడం తప్ప మరొక దారి లేదు. విద్యావంతులలో, ఆలోచనాపరులలో ప్రతి ఒక్కరూ పది మంది పెట్టుగా పనిచేసి తాము పుట్టిన ప్రాంతపు ప్రయోజనాల కోసం తమ మేధోశక్తిని వెచ్చించవలసిన అవసరం ఉంది. మీ ఆలోచనలకు, మేధోకృషికి వేదిక కల్పించడానికి వీక్షణం సిద్ధంగా ఉంది. ఈ నాలుగు జిల్లాల ప్రజాజీవితం గురించి, వనరుల స్థితి గురించి, ఆ వనరులను వాడుకొని ప్రజాజీవితాన్ని మెరుగుపరచగలిగిన అవకాశాల గురించి, సామాజిక అసమానతల గురించి, పాలనా వైఫల్యాల గురించి మీకు తెలిసిన, మీ దృష్టికి వచ్చిన సమాచారమేదైనా వీక్షణంకు రాయండి. అ సమాచారాన్ని విశ్లేషించడం. ప్రజల స్థితిగతులు, ఆవేదనలతో పాటు, ప్రజల్లో పెరుగుతున్న అసంతృప్తులు, ఆ అసంతృప్తులు సంఘటితమవుతూ, ఆందోళనా పథంలో ప్రవేశిస్తున్న తీరు కూడ వీక్షణంకు రాయండి.

వీక్షణం లో రాయలసీమ గురించి ఎక్కువగా రావడం, రాయలసీమలో వీక్షణం ఒక ప్రభావశీల పత్రికగా మారడం ఒకే నాణానికి రెండు ముఖాలు. ప్రస్తుతమైతే వీక్షణం ఎదుర్కొంటున్న పంపిణీ సమస్యల వల్ల బైట వార్తాపత్రికలు అమ్మే న్యూస్ స్టాల్స్ లో అమ్మకాలు లేవు. కేవలం చందాదారులకు నేరుగా చేరే వీలు మాత్రమే ఉంది. రాయలసీమ నాలుగు జిల్లాలలో ఏ ఒక్క జిల్లాలోనూ చందాదారుల సంఖ్య వంద దాటలేదు. వీక్షణంలో రాయలసీమ సమస్యలు, ప్రజాజీవితం ఎక్కువగా ప్రతిఫలించడం ఎంత అవసరమో, రాయలసీమ చదువరుల సమూహం లోకి వీక్షణం ప్రవేశించడం కూడ అంతే ముఖ్యం. ఈ రెండు బాధ్యతలూ నిర్వహించడానికి మీరు ముందుకు వస్తారని ఆశిస్తూ, సెలవు. వీ

# నలుగురు వీక్షణం మిత్రులకు వీడ్కోలు

అక్టోబర్ నెల నలుగురు వీక్షణం మిత్రుల విషాద నిష్క్రమణ వార్తలను మోసుకొచ్చింది. వారు వీక్షణం సంపాదకుడికి రెండు మూడు దశాబ్దాలుగా మిత్రులు మాత్రమే కాక, వీక్షణం ప్రారంభమైనప్పటి నుంచీ వీక్షణం పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు. తెలుగు సమాజానికి రచనల ద్వారా, ఉపన్యాసాల ద్వారా, సామాజిక కృషి ద్వారా తమ తమ రంగాలలో విశిష్ట సేవలు అందించినవారు. ఆ నలుగురు మిత్రుల మృతికి వీక్షణం ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నది. వీరిలో **పిజె వర్ధనరావు** అక్టోబర్ 16న తెనాలిలో, **చిలుకూరి దేవపుత్ర** అక్టోబర్ 18న అనంతపురంలో, **ఎ. శంకరయ్య** అక్టోబర్ 20న వికారాబాద్‌లో, **రుద్రజ్వాల** అక్టోబర్ 24న చీరాలలో తుదిశ్వాస విడిచారు.



**పిజె వర్ధనరావు** (1947-2016)

గుంటూరు జిల్లా తెనాలిలో ఇంగ్లిష్ లెక్చరర్‌గా పనిచేసి రిటైరయ్యారు. దళిత పాంథర్ ఉద్యమంతో ప్రభావితుడై, తెనాలిలో దళిత సంఘాన్ని స్థాపించి సామాజిక కార్యాచరణ ప్రారంభించిన వర్ధనరావు ఎమర్జెన్సీకి కొద్ది ముందు విప్లవ రాజకీయాల్లో ప్రవేశించారు. 1978 జూన్‌లో గుంటూరులో జరిగిన రాడికల్ యువజన సంఘం తొలి మహాసభల్లో అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1979లో ఖమ్మంలో జరిగిన రెండో మహాసభలో కూడ అధ్యక్షుడుగా కొనసాగారు. అప్పటికే ఆయన విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా కవిత్వం, వ్యాసాలు రాస్తున్నారు. రాడికల్ యువజన సంఘం అధ్యక్షుడుగా వక్తగా మారి ఆంధ్రప్రదేశ్‌లోని వందలాది పట్టణాల్లో, గ్రామాల్లో ఉపన్యసించారు. తత్వశాస్త్రం మీద, ప్రత్యేకించి గతితార్కిక భౌతికవాదం, మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానం మీద ఎన్నో అధ్యయన తరగతుల పాఠాలు చెప్పారు. కారంచేడు దురంతం జరగగానే అక్కడికి వెళ్లి బాధితుల పక్షాన నిలబడ్డారు. చుండూరు దురంతం తర్వాత బాధితుల ఉద్యమానికి ఆయన సంపూర్ణమైన సహకారం అందించారు. ఇలా విప్లవోద్యమంలో, దళిత ఉద్యమంలో ఆయన నిర్వహించిన క్రియాశీల పాత్రవల్ల ఎన్నోసార్లు నిర్బంధా లను, కేసులను, హత్య చేస్తామనే బెదిరింపులను, దాడులను ఎదుర్కొన్నారు. చుండూరు బాధితుల ఉద్యమంలో మినహా ఇతర ఉద్యమాల లో 1990ల తర్వాత ఆరోగ్య కారణాల వల్ల క్రియాశీలంగా పాల్గొనలేకపోయినప్పటికీ తన రాజకీయాభిప్రాయాలను, విలువలను చివరిదాకా వదులుకోలేదు. స్థానిక సాహిత్య, రాజకీయ కార్యక్రమాలను నిర్వహిస్తూనే ఉండేవారు. విప్లవ, దళిత ఉద్యమాల సహచరులతో నిత్యం సంభాషిస్తుండేవారు. వీ



**చిలుకూరి దేవపుత్ర** (1952-2016)

అనంతపురం జిల్లాలో రెవెన్యూ శాఖలో క్లర్క్ గా చేరి డిప్యూటీ తహసీల్దార్ గా రిటైరయ్యారు. రెవెన్యూ శాఖలో పనిచేస్తూ కూడ అత్యంత నిజాయితీగా ముప్పై సంవత్సరాలుగా పైగా ప్రజలకు సేవలందించారు. నిరుపేద దళిత కుటుంబంలో పుట్టి, పదో తరగతి వరకు మాత్రమే చదువుకోగలిగినా, అపారమైన జీవితానుభవాన్ని సంపాదించారు. యవ్వనంలోనే వామపక్ష భావజాలంతో ప్రభావితుడైన దేవపుత్ర వామపక్ష భావాలనూ, దళిత అనుభవాన్నీ కలగలిపి వందకు పైగా కథలూ, అద్దంలో చందమామ, పంచమం, కక్షశిల, చీకటిపూలు వంటి నవలలూ రాశారు. మృదుస్వభావీ, స్నేహశీలీ అయిన దేవపుత్ర రచనల ద్వారా మాత్రమే కాక, వ్యక్తిత్వంతోనూ, స్నేహ స్వభావంతోనూ తెలుగుసీమలో వేలాది మంది మిత్రులను సంపాదించుకున్నారు. వీ



**ఎ. శంకరయ్య** (1947-2016)

రంగారెడ్డి జిల్లా వికారాబాద్‌లో గణిత శాస్త్ర లెక్చరర్ గా పనిచేసి రిటైరయ్యారు. విప్లవోద్యమ రాజకీయాలతో ప్రభావితులైన శంకరయ్య విద్యార్థి దశలో పిడి ఎస్ యు తో, లెక్చరర్ గా ఉపాధ్యాయ ఉద్యమంలో, పౌరహక్కుల ఉద్యమంలో పనిచేశారు. చివరి రోజుల్లో లోక్ సత్తా, మానవ హక్కుల వేదికల కార్యకర్తగా ఉన్నారు. స్వయంగా సాహిత్యాభిమాని కావడం మాత్రమే కాక, సహచరి తిరునగరి దేవకీ దేవి తెలుగు లెక్చరర్ కావడంతో తన ఇంటిని సాహిత్య కేంద్రంగా మార్చారు. మిత్రులచేత పత్రికలకు చందాలు చేర్పించడం, మంచి పుస్తకాలు పరిచయం చేయడం ద్వారా పత్రికలకు, పుస్తక ప్రచురణకు సహకరించారు. దంపతులిద్దరూ కూడ 1969 తెలంగాణ ఉద్యమం నాటి నుంచీ ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షల సమర్థకులు. మలిదశ తెలంగాణ ఉద్యమంలోనూ క్రియాశీలంగా పనిచేశారు. వీక్షణం అసహజ మరణాల సూచికి రంగారెడ్డి జిల్లా సమాచారం అందించేవారు. వీక్షణం రచయితల సమావేశంలో పాల్గొని విలువైన సూచనలు ఇచ్చేవారు. వీ



**రుద్రజ్వాల** అనే కలం పేరుతో ఎన్నో గొప్ప కవితలు, నాటికలు, నాటకాలు రాసిన **వెలుగు వెంకట సుబ్బారావు** (1940?-2016) ప్రకాశం జిల్లా చీరాలలో తెలుగు అధ్యాపకుడిగా రిటైరయ్యారు. కొద్ది వారాల కింద చెట్టుకొమ్మ విరిగి మీదపడి పక్షవాతం వచ్చేవరకూ అధ్యాపకుడిగా పనిచేస్తూనే ఉన్నారు. ఆయన సహచరి కృష్ణాజిల్లా జొన్నపాడు (కొండపల్లి సీతారామయ్య స్వగ్రామం) కు చెందినవారు కావడంతో ఆయనకు ఆ ఊరితో ఎక్కువ సంబంధాలు ఏర్పడి, అవి విప్లవ రాజకీయాల వైపు దారి తీశాయి. ఆ ప్రభావంలోనే విప్లవ రచయితల సంఘంలో చేరి ఎన్నో కవితలు, నాటికలు రాశారు. ఎమర్జెన్సీ తర్వాత తొలి విరసం మహాసభలు చీరాలలో నిర్వహించారు. వెలుగు కవితా సంపుటం, పంట, పునరంకితం, సమస్య, జనం కదిలింది, నాడి, కడలి వంటి అనేక నాటికలు ప్రచురించారు. 'ఎత్తినాం విరసం జెండా' అనే విరసం పతాక గీత రచయితగా ఆయన రాష్ట్రవ్యాప్తంగా సుప్రసిద్ధులు. సహచరి మరణం తర్వాత ఆయన మళ్లీ వివాహం చేసుకున్న స్త్రీ అనుమానాస్పదంగా మృతి చెందడంతో విరసం నుంచి తొలగించబడినా, ఆయన తన సాహిత్య కృషిని మాత్రం ఆపలేదు. గత పది పదిహేను సంవత్సరాలుగా తెలుగు భాషోద్యమ సమాఖ్యతో కలిసి పనిచేస్తున్నారు. వీ

### విసి అప్పారావు నుండి పిఎచ్‌డి తీసుకోని విద్యార్థి

హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం అక్టోబర్ 1న నిర్వహించిన 18వ స్నాతకోత్సవంలో విసి అప్పారావు చేతుల మీదుగా పిఎచ్‌డి పట్టా తీసుకోనని వేల్పుల సుంకన్న తన నిరసనను వ్యక్తం చేశారు. రోహిత్ వేములతో సస్పెండ్ అయిన ఐదుగురు విద్యార్థులలో సుంకన్న ఒకరు. రోహిత్ వేముల మృతికి కారణమైన విసి అప్పారావు చేతుల మీదుగా పిఎచ్‌డి పట్టా తీసుకోబోనని ప్రకటించగానే విద్యార్థులు పెద్ద సంఖ్యలో హర్షాధ్వానాలు చేశారు. అనుకోకుండా జరిగిన ఈ సంఘటనకు విసి అప్పారావు ఏమీచేయలేక వేదిక మీద ఉన్న ప్రొ. వి. శ్రీవాత్సవను పిలిచి సుంకన్నకు పిఎచ్‌డి అందచేయమన్నారు. శ్రీవాత్సవ చేతుల మీదుగా సుంకన్న పిఎచ్‌డి పట్టాను అందుకున్నారు.

### నిర్వాసితులపై పోలీసుల లాఠీ చార్జీ

గని, శుకాల ప్రాంతంలో సోలార్ పరిశ్రమల కోసం సేకరించిన భూమికి నష్టపరిహారం ఇవ్వకుండా అన్యాయం చేస్తోందని అక్టోబర్ 7న ఓర్వకల్లు నుంచి కర్నూలు కలెక్టరేట్‌కు భూ నిర్వాసితులు పాదయాత్రగా వెళ్లారు. స్థానిక సిపిఐ(ఎం) జిల్లా కార్యదర్శి ప్రభాకర్‌రెడ్డి నాయకత్వంలో కలెక్టరేట్‌ను ముట్టడించారు. కలెక్టర్ బయటికి వచ్చి తమకు న్యాయం చేయాలని నినాదాలు చేస్తూ కలెక్టర్ కార్యాలయం లోపలికి వెళ్లేందుకు ప్రయత్నించిన నిర్వాసితులపై పోలీసులు లాఠీచార్జీ చేశారు. పోలీసులు నిర్వాసితుల మధ్య తోపులాట జరుగుతుండగా కలెక్టర్ డిఆర్‌ఓ ధర్నా శిబిరం వద్దకు వచ్చి చర్చలు జరిపిన అనంతరం కలెక్టర్‌తో ప్రతినిధి బృందం చర్చలు జరిపింది.

### 31 జిల్లాల తెలంగాణ

తెలంగాణలోని 10 జిల్లాలను పునర్వ్యవస్థీకరణలో భాగంగా అదనంగా 21 పెంచి మొత్తం 31 జిల్లాలను ఏర్పాటు చేసింది. ప్రస్తుతం ఉన్న 44 డివిజన్లకు అదనంగా 24 పెంచి మొత్తం 68 రెవెన్యూ డివిజన్లను ప్రకటించింది. అట్లాగే ఇప్పుడున్న 459 మండలాలకు అదనంగా 135 మండలాలను పెంచి మొత్తం 584 మండలాలను ప్రకటిస్తూ తెలంగాణ రాష్ట్ర రెవెన్యూ శాఖ అక్టోబర్ 11న ఉత్తర్వులు జారీ చేసింది.

### చలో పొన్నూరు

డా. రాజారావుపై పెట్టిన అక్రమ కేసులు ఎత్తివేయాలని పౌర, మానవ హక్కుల సంఘాల ఐక్యకార్యచరణ వేదిక అక్టోబర్ 10న గుంటూరు జిల్లాలో పొన్నూరు కేంద్రంలో 'చలో పొన్నూరు'కు పిలుపునిచ్చింది. పోలీసులు పట్టణంలో 144 సెక్షన్ విధించి తీవ్ర నిర్బంధం అమలు చేశారు. ఈ సందర్భంగా ప్రజా వైద్యశాల నుండి తహశీల్దార్ కార్యాలయం వరకు ర్యాలీ నిర్వహించడానికి ప్రయత్నించిన హక్కుల కార్యకర్తలను, పౌరహక్కుల నేత ప్రజావైద్యశాల నిర్వాహకులు డా. రాజారావును పోలీసులు అరెస్ట్ చేశారు. దీంతో డాక్టర్ రాజారావుపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తివేయాలని డిమాండ్ చేస్తూ నిరసన తెలిపారు.

### బొజ్జాతారకం సంస్మరణ సభ

తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలోని గడియార స్తంభం సెంటర్‌లో ఆర్‌పిఐ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి అధ్యక్షతన అక్టోబర్ 15న బొజ్జా తారకం సంస్మరణ సభ జరిగింది. ఈ సభకు వరవరరావు ముఖ్య అతిథిగా హాజరయ్యారు. బొజ్జా తారకం రాజకీయ, సామాజిక ఉద్యమాలను ఐక్యంగా నడిపిన పోరాట యోధుడని, దళిత సమస్యలే కాకుండా దళితేతర సమస్యల పైన, మానవ హక్కుల కోసం పోరాడిన మహోన్నత వ్యక్తి అని వక్తలు అన్నారు. తెలుగు రాష్ట్రాల్లో దళితులకు ఎక్కడ అన్యాయం జరిగినా బాధితులకు అండగా ఉండేవారని, నిస్వార్థ పోరాటాలకు తారకం మారుపేరని అన్నారు.

### గిరిజన చట్టాలను అమలుచేయాలి

పశ్చిమగోదావరి జిల్లా కెఆర్‌పురం ఐటిడిఎ సమావేశ మందిరంలో అక్టోబర్ 15న ఎపి గిరిజన సంఘం ఆధ్వర్యంలో బహిరంగ విచారణ ప్రజా వేదికను నిర్వహించారు. ఈ సమావేశంలో హైకోర్టు రిటైర్డ్ జడ్జి జస్టిస్ చంద్రకుమార్ గిరిజన చట్టాలను జిల్లా కలెక్టరే ఉల్లంఘిస్తున్నారని, నిజాయితీ పరులైన ఆదివాసులకు అన్యాయం చేసే వారిని ఉపేక్షించేది లేదని అన్నారు. ఏజెన్సీలో గిరిజనుల భూములను, హక్కులను కాపాడేందుకు కలెక్టర్ పనిచేయాలని కాని దానికి విరుద్ధంగా కలెక్టర్ పనిచేస్తున్నారని అన్నారు. ఏజెన్సీలో 1917 గిరిజన హక్కుల రక్షణ చట్టం వచ్చి వందేళ్లు గడుస్తున్నా నేటికీ గిరిజనులకూ, వారి భూములకూ రక్షణ లేకుండా పోయిందన్నారు. జస్టిస్ చంద్రకుమార్ నాయకత్వంలోని త్రిసభ్య కమిటీ ఆధ్వర్యంలో నివేదిక తయారుచేసి గవర్నర్‌కు, గిరిజన సంక్షేమ ప్రిన్సిపల్ కార్యదర్శికి, ప్రభుత్వానికి అందజేస్తామన్నారు.

### తెలంగాణ రైతు జెఎసి ధర్నా

'ఏడ్దేడ్చిన ఎవుసం నడవది-రైతేడ్చిన రాజ్యం నిలవది' అంటూ తెలంగాణ రైతు జెఎసి ఆధ్వర్యంలో అక్టోబర్ 23న ఇందిరాపార్క్ వద్ద దీక్ష చేపట్టారు. ఈ దీక్షలను పత్రికా సంపాదకులు రామచంద్రమూర్తి ప్రారంభించారు. ఈ సందర్భంగా వక్తలు విచ్చలవిడి భూసేకరణను ఆపాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. తప్పనిసరి పరిస్థితుల్లో భూమి సేకరిస్తే భూమికి భూమి ఇవ్వాలని అన్నారు. రైతు మార్కెట్‌కు వెళితే అవమానాలకు, దోపిడీకి గురవుతున్నాడని అన్నారు. అన్ని వ్యవస్థలకు వ్యవసాయమే మూలస్తంభమని ఐటి రంగంలో తీసుకొచ్చిన విధానాన్ని ప్రభుత్వం వ్యవసాయ రంగంలో తీసుకురాలేక పోయిందని ప్రశ్నించారు. భూమి, నీరు, విత్తనాలపై రైతుకు హక్కు కల్పించాలన్నారు.

### అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య మహాసభలు

అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య తన 42వ వార్షికోత్సవ మహాసభలు హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం గూడ అంజయ్య నగర్, కాశీపతి ప్రాంగణంలో అక్టోబర్ 23, 24 తేదీల్లో జరిగాయి. మహాసభల ఆహ్వాన సంఘం అధ్యక్షులుగా ప్రొఫెసర్ జయధీర్ తిరుమల్‌రావు ఉన్నారు. రెండు రోజులు ప్రజలకు సంబంధించిన వివిధ కళారూపాలను ప్రదర్శించారు. ఈ సభలకు హాజరైన వక్తలు రాష్ట్రంలో కవులు, రచయితలు పాలకపక్షం వహిస్తున్నారని అన్నారు. ప్రస్తుతమున్న సంక్షోభ సందర్భంలో మార్కెట్ సంస్కృతి నుంచి ప్రజలను బయటకు తీసుకురావాలన్నారు. సామ్రాజ్యవాద సంస్కృతిని నిలువరించి ప్రజా కళలను నిలబెట్టాలన్నారు. అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య రాష్ట్ర అధ్యక్షురాలు విమల గత కార్యక్రమాల నివేదికను వివరించారు. ఆంధ్రా - ఒడిశా సరిహద్దుల్లో పోలీసులు జరిపిన బూటకపు ఎన్‌కౌంటర్‌ను మహాసభ తీవ్రంగా ఖండించింది.

### హోంగార్డుల దీక్ష

హోంగార్డుల్ని పోలీసు కానిస్టేబుళ్లుగా క్రమబద్ధీకరించాలంటూ కొద్దిరోజులుగా ఆందోళన చేస్తున్నారు. ఈ నేపథ్యంలో అక్టోబర్ 24 నుంచి హోంగార్డ్స్ వెల్ఫేర్ అసోసియేషన్ చైర్మన్ సకినాల నారాయణ ఆమరణ దీక్ష చేపట్టారు. అక్టోబర్ 25న పోలీసులు దీక్షను భగ్నం చేశారు. ఈ సందర్భంగా దీక్షా శిబిరం వద్దనున్న హోంగార్డులు నిరసనకు దిగడంతో పోలీసులు 150 మందిని అరెస్టు చేశారు. గాంధీ ఆస్పత్రిలో కూడా హోంగార్డులు ఆందోళన చేశారు. ఆస్పత్రి భవనంపైకి ఎక్కి తమ డిమాండ్లు పరిష్కరించాలంటూ నిరసన తెలిపారు. హోంగార్డుల సమస్యలను పరిష్కరించాలంటూ ప్రతిపక్ష పార్టీలు తమ మద్దతును తెలిపాయి. వీ

### ప్రభుత్వరంగ సంస్థల మూసివేత

నష్టాల బాటలో ఉన్నాయన్న సాకుతో దాదాపు పదిహేను ప్రభుత్వరంగ సంస్థలను మూసివేయాల్సిందిగా కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకుంటోంది. ఇప్పటికే వీటిలో ఐదు కంపెనీల మూసివేతకు సెప్టెంబర్ 27న జరిగిన కేంద్ర క్యాబినేట్ ఆమోదముద్ర వేయగా, మరో మూడు కంపెనీల మూసివేతకు అంతర్గత ఆదేశాలు జారీ అయ్యాయి. ఆర్థిక నష్టాల్లో ఉన్న ప్రభుత్వరంగ సంస్థలను గుర్తించే బాధ్యత కేంద్రం నీతి ఆయోగ్‌కు అప్పగించింది. దేశంలో 74 ప్రభుత్వరంగ సంస్థలు ఆర్థిక నష్టాల్లో ఉన్నాయని నీతి ఆయోగ్ ప్రధానికి సమర్పించిన నివేదికలో పేర్కొంది.

### పాకిస్తాన్ పై సర్జికల్ స్ట్రైక్

పాకిస్తాన్‌పై భారత సైన్యం సర్జికల్ దాడులు చేసింది. పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ భూభాగంలోకి చొచ్చుకుని వెళ్లి దాడులు చేసింది. సెప్టెంబర్ 29న అర్ధరాత్రి జరిపిన ఈ దాడిలో ముప్పై ఎనిమిది మంది తీవ్రవాదులు, ఇద్దరు పాకిస్తాన్ సైనికులు చనిపోయినట్లు భారత సైనిక అధికారులు తెలిపారు.

### నిర్వాసితులపై కాల్పులు

జార్ఖండ్‌లో తమకు న్యాయం చేయాలని కోరుతూ శాంతియుతంగా నిరసన తెలుపుతున్న ప్రజలపై పోలీసులు కాల్పులు జరపడంతో ఆరుగురు మరణించారు. మరో ఇరవై మందికిపైగా గాయపడ్డారు. జార్ఖండ్‌లోని హజారీబాగ్ జిల్లా చిరుడిహ్ గ్రామంలో కోల్ మైనింగ్ ప్రాజెక్టు నిర్మాణం కోసం నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్ (ఎన్‌టిపిసి) 2010లో 8,056 ఎకరాల స్థలాన్ని సేకరించింది. అయితే ఎక్కువ నష్టపరిహారం చెల్లించాలని, కుటుంబంలో ఒకరికి ఉద్యోగం కల్పించాలని నిర్వాసితులు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. నిర్వాసితులు ఎన్‌టిపిసికి వ్యతిరేకంగా ధర్నాలు చేస్తున్నారు. ప్రభుత్వం ఆ ప్రాంతంలో 144 సెక్షన్ విధించింది. ఈ నేపథ్యంలో అక్టోబర్ 1న దీక్ష చేస్తున్న నిర్వాసితులుపై పోలీసులు విరుచుకుపడి లాఠీలతో చితకబాదారు. నిర్వాసితులకు మద్దతుగా వచ్చిన ఎంఎల్ఏ నిర్మలాదేవిని అరెస్టు చేసి తీసుకెళ్తున్న సమయంలో వాహనాన్ని అడ్డుకున్న సందర్భంలో పోలీసులు కాల్పులు జరపడంతో ఆరుగురు మరణించారు.

### స్మృతి, దత్తాత్రేయలకు క్లీన్ చిట్

రోహిత్ వేముల ఆత్మహత్యకు పరోక్ష బాధ్యులైన కేంద్ర మంత్రులు స్మృతి ఇరానీ, బండారు దత్తాత్రేయలకు మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖ ఏర్పాటు చేసిన అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తి ఎ.కె. రూపన్‌వాలా ఏకసభ్య కమిటీ క్లీన్‌చిట్ ఇచ్చింది. రోహిత్ ఆత్మహత్యకు పాల్పడ్డ రోజున తమ బహిష్కరణను సవాలు చేస్తూ విద్యార్థులు హైకోర్టులో వేసిన పిటిషన్‌పై విచారణ జరగాల్సి ఉంది. కాబట్టి ఆ కారణంతో ఆయన ఆత్మహత్యకు పాల్పడి ఉండకపోవచ్చునని రూపన్‌వాలా కమిటీ పేర్కొంది. కేంద్ర మంత్రులు తమ బాధ్యతల్ని నిర్వర్తించారే తప్ప, ఎచ్‌సియు అధికారులపై ఎలాంటి ఒత్తిడి చేయలేదని కమిటీ నిర్ధారించింది. ఈ కమిటీని ఈ ఏడాది జనవరి 28న ఎచ్ఆర్‌డి ఏర్పాటు చేయగా, 41 పేజీలతో నివేదికను ఆగస్టులో సమర్పించింది. కమిటీ నివేదికపై ఎచ్‌సియు జెఎసి తీవ్ర నిరసన తెలిపింది.

### కశ్మీర్‌లో కొనసాగుతున్న ఉద్రిక్తత

కశ్మీర్‌లో గత మూడు నెలలుగా ఉన్న ఉద్రిక్తత వాతావరణం ఇంకా కొనసాగుతూనే ఉంది. శ్రీనగర్‌లో అక్టోబర్ 7న భద్రతా బలగాలు ప్రయోగించిన పెల్లెట్లకు జునైద్ అహ్మద్ అనే పన్నెండేళ్ల బాలుడు మరణించాడు. దీంతో ఇప్పటి వరకు పోలీసుల కాల్పుల్లో మరణించిన వారి సంఖ్య 89కి చేరింది. తన ఇంటి ముందు ఆడుకుంటుండగా పోలీసులు జరిపిన కాల్పుల్లో జునైద్ మరణించాడు. జునైద్ అంత్యక్రియలకు ఊరేగింపుగా బయలుదేరిన నిరసనకారులపై భద్రతా బలగాలు టియర్ గ్యాస్ ప్రయోగించారు. ఈ నేపథ్యంలో శ్రీనగర్‌లో పలుచోట్ల కర్ఫ్యూ విధించారు.

### బ్రిక్స్-2016 సదస్సు

ఐదు దేశాల బ్రిక్స్ ఎనిమిదో శిఖరాగ్ర సమావేశం అక్టోబర్ 15-16 తేదీలలో గోవాలో జరిగింది. ఈ సమావేశానికి రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్, చైనా అధ్యక్షుడు జిన్‌పింగ్, దక్షిణాఫ్రికా అధ్యక్షుడు జాకోబ్ జుమా, బ్రెజిల్ అధ్యక్షుడు మైఖేల్ టెమెర్, భారత ప్రధాని నరేంద్ర మోడీ హాజరయ్యారు. ఉగ్రవాదులు, వారిని ప్రోత్సహించే వారిపై పోరాడడమే ప్రధానాంశంగా బ్రిక్స్ దేశాధినేతలు గోవా డిక్లరేషన్‌కు ఆమోదం తెలిపారు.

### భువనేశ్వర్ ఆస్పత్రిలో అగ్నిప్రమాదం

ఒడిశా రాజధాని భువనేశ్వర్‌లోని సుమ్ అనే ఆస్పత్రిలో అక్టోబర్ 17న అగ్నిప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో ముప్పై మంది మరణించారు. వంద మందికి పైగా తీవ్రగాయాలయ్యాయి. ఆస్పత్రిలోని రెండో అంతస్తులోని డయాలిసిస్ వార్డులో చెలరేగిన మంటలు ఐసియుకు కూడా వ్యాపించడంతో ప్రాణం నష్టం అధికంగా సంభవించింది. ప్రమాద సమయంలో ఆస్పత్రిలో దాదాపు ఐదు వందల మంది దాకా ఇన్ పేషెంట్లు ఉన్నారు.

### ఆర్‌టిఐ కార్యకర్త హత్య

ముంబైలోని శాంతాక్రజ్ శివార్లలో ఉంటున్న ఆర్‌టిఐ కార్యకర్త భూపేంద్ర వీరను ఆయన ఇంట్లోకి చొరబడి కాల్చి చంపారు. స్థానిక కాంగ్రెస్ పార్టీ నాయకుడు మాజీ రజాక్ ఖాన్, అతని కుమారుడు అంజాద్ ఖాన్‌లకు చెందిన అక్రమ నిర్మాణాలకు వ్యతిరేకంగా భూపేంద్ర పోరాటం చేస్తున్నారు. ఈ అక్రమ నిర్మాణాలను వెంటనే కూల్చేయాలంటూ లోకాయుక్త అక్టోబర్ 17న ఆదేశాలు జారీ చేసింది. ఈ తీర్పు జారీచేసిన కొద్ది గంటలలోనే భూపేంద్రను ఆయన ఇంట్లోనే కాల్చి చంపేశారు.

### కశ్మీర్‌లో 12 మంది ప్రభుత్వ అధికారుల తొలగింపు

జమ్మూ కశ్మీర్‌లో ఆందోళనలను ప్రోత్సహించారన్న అభియోగాలతో 12 మంది అధికారులను ఆ రాష్ట్ర ప్రభుత్వం తొలగించింది. మరో 100 మందిని తొలగించే అవకాశం ఉందని ప్రభుత్వ అధికారులు అంటున్నారు. తొలగింపునకు గురైనవారిలో కశ్మీర్ యూనివర్సిటీ అసిస్టెంట్ రిజిస్ట్రార్ సహా విద్య, ఆరోగ్య, రెవెన్యూ, ఇంజినీరింగ్, ఆహారం సరఫరా విభాగాల్లోని అధికారులున్నారు. రాష్ట్ర సిఐడి నివేదిక ఆధారంగానే ఈ నిర్ణయం తీసుకున్నట్లు అక్టోబర్ 19న ప్రభుత్వం ఒక ప్రకటనలో తెలిపింది. జమ్మూ కశ్మీర్‌లో అధికారులను తొలగించడం ఇది రెండోసారి. ప్రభుత్వ చర్యకు నిరసనగా కశ్మీర్‌లోని ఉద్యోగ సంఘాలు మూడునెలల సమ్మెకు పిలుపునిచ్చాయి.

### సర్దార్‌పూర్ హత్యాకాండపై తీర్పు

గుజరాత్‌లోని సర్దార్‌పూర్‌లో 2002లో గోద్రా ఘటన తదనంతరం జరిగిన మారణకాండలో 33 మందిని సజీవంగా దహనం చేసిన కేసులో 17 మందికి శిక్షలు ఖరారు చేస్తూ అక్టోబర్ 20న హైకోర్టు తీర్పు వెల్లడించింది. ఈ ఘటనలో 17 మంది మహిళలు, 11 మంది పిల్లలు సహా మొత్తం 33 మంది మరణించారు. ఈ ఘటనకు బాధ్యులుగా 76 మందిని అరెస్ట్ చేశారు. 2009లో సిట్ 73 మందిపై అభియోగాలు మోపింది. దిగువ కోర్టు వారిలో 42 మందిని వదిలేసి 31 మందికి శిక్ష విధించింది. దీనిపై సిట్ హైకోర్టుకు వెళ్లగా, వారిని నిర్దోషులుగా వదిలేయడం సరైనదేనంటూ మెహసానా జిల్లా కోర్టు తీర్పును సమర్థించింది. ఈ 31 మందిలోనూ 14 మందిని సరైన సాక్ష్యాధారాలు లేని కారణంగా నిర్దోషులుగా విడుదల చేసింది. మిగతా 17 మందికి యావజ్జీవ శిక్ష విధించింది.

### ఎఒబిలో ఎన్‌కౌంటర్

ఆంధ్రా-ఒడిశా సరిహద్దు (ఎఒబి) బెజింగిలో అక్టోబర్ 24 తెల్లవారు జామున భారీ ఎన్‌కౌంటర్ జరిగింది. ఆంధ్రా, ఒడిశాకు చెందిన గ్రేహౌండ్స్ స్పెషల్ పార్టీ పోలీసులు సంయుక్తంగా నిర్వహించిన ఈ దాడిలో 28 మంది మావోయిస్టులు చనిపోయారు. 18 మంది పురుషులు కాగా, పది మంది మహిళా మావోయిస్టులు ఉన్నారు. ఈ ఎన్‌కౌంటర్ సందర్భంగా ఒక గ్రేహౌండ్స్ కమాండో ప్రమాదవశాత్తు రిజర్వాయర్‌లో పడి మరణించగా, మరో కమాండో గాయపడ్డాడని పోలీసు అధికారులు తెలిపారు. వీ

### కొలంబియాలో శాంతి ఒప్పందం

కొలంబియాలో ప్రభుత్వానికి, అక్కడి వామపక్ష దళాల తిరుగుబాటు దారులకు (ఫార్క్) మధ్య యాభై రెండు సంవత్సరాలుగా కొనసాగుతున్న అంతర్యుద్ధం ముగిసింది. సెప్టెంబర్ 27న ఇరువర్గాల మధ్య శాంతి ఒప్పందం జరిగింది. కార్టజైనా నగరంలో జరిగిన సమావేశంలో కొలంబియా దేశాధ్యక్షుడు సాంటోస్, ఫార్క్ విప్లవ నేత టిమోలియన్ ఆ ఒప్పదంపై సంతకాలు చేశారు. 1964లో ప్రారంభమైన ఈ అంతర్యుద్ధం వల్ల దాదాపు రెండున్నర లక్షల మంది చనిపోయారు. అరవై లక్షల మంది నిరాశ్రయులయ్యారు.

### రిజర్వ్ కరెన్సీలో యువాన్

అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) రిజర్వ్ కరెన్సీ జాబితాలో చైనా యువాన్ చేరింది. ఐఎంఎఫ్ కరెన్సీ జాబితాలో ప్రస్తుతం అమెరికా 'డాలర్', యూరో, జపాన్ 'యెన్', బ్రిటిష్ 'పౌండ్' ఉన్నాయి. అక్టోబర్ 1 నుంచి ఐదవ కరెన్సీగా యువాన్ చలామణిలోకి వచ్చింది. ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంక్ నేతృత్వంలో జరిగే లావాదేవీలకు ఇక యువాన్ కూడా చెల్లుబాటు అవుతుంది. ఐఎంఎఫ్‌లో 188 సభ్య దేశాల ప్రతినిధులు రిజర్వ్ కరెన్సీలోకి యువాన్‌ను చేర్చడంపై అంగీకారం తెలిపారు.

### గ్రీన్‌హౌస్ వాయువుల నియంత్రణ

భూతాపానికి కారణమవుతున్న వాయువులను నియంత్రించేందుకు ప్రతి ఒక్క దేశం కృషి చేయాల్సిన అవసరం ఉందంటూ దాదాపు 150 దేశాల అత్యున్నత స్థాయి ప్రతినిధుల సమావేశంలో తీర్మానం జరిగింది. అక్టోబర్ 15న రువాండాలో జరిగిన ఈ సమావేశంలో పర్యావరణాన్ని విధ్వంసం చేసే గ్రీన్‌హౌస్ వాయువులను తగ్గించాల్సిందిగా అన్ని దేశాలు పిలుపు నిచ్చాయి. పర్యావరణానికి తీవ్ర విఘాతం కలిగించే హైడ్రోఫ్లోరో కార్బన్ల (ఎచ్‌ఎఫ్‌సి) వినియోగం తగ్గించుకోవడానికి కృషి చేయాలన్నారు. భారత, చైనాల్లో ఎచ్‌ఎఫ్‌సి వినియోగం ఎక్కువగా ఉంటుందని, ఆ దేశాలు తక్షణమే గ్రీన్‌హౌస్ ఉద్గారాన్ని తగ్గించుకోవాల్సిన అవసరం ఉందని గ్రీన్‌హౌస్ పీస్ ఇంటర్నేషన్ సంస్థ తెలిపింది.

### అసాంజేపై ఆంక్షలు

అమెరికా అధ్యక్ష ఎన్నికలకు ఎలాంటి ఆటంకాలు తలెత్తకుండా ఉండాలనే ఉద్దేశ్యంతో వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియస్ అసాంజే ఇంటర్నెట్ వినియోగించకుండా ఆంక్షలు విధించామని ఈక్వెడార్ తెలిపింది. ఇటీవల అసాంజే విడుదల చేసిన పలు పత్రాలు అమెరికా ఎన్నికలపై ప్రభావం చూపవచ్చని అభిప్రాయపడింది. హిల్లరీకి సంబంధించిన పత్రాలు విడుదల చేసినందుకే అసాంజేను అడ్డుకోవాలని ఈక్వెడార్‌ను కోరినట్లు వచ్చిన ఆరోపణలను అమెరికా ఖండించింది. అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో తాము జోక్యం చేసుకోదల్చుకోలేదని ఈక్వెడార్ విదేశాంగ మంత్రి తెలిపారు. అందుకే అసాంజేకు కమ్యూనికేషన్ సౌకర్యాలను నిలిపివేశామన్నారు. పత్రాల విడుదల అనేది వికీలీక్స్‌కు సంబంధించిన విషయమని అన్నారు.

### అమెరికాతో రష్యా అణుపదార్థాల ఒప్పందం రద్దు

అమెరికాతో ప్లూటోనియం నిల్వల నియంత్రణపై జరిగిన ఒప్పందాన్ని రద్దు చేసుకుంటున్నట్లు రష్యా ప్రకటించింది. 2000లో ఇరు దేశాలు అణ్వస్త్ర నిల్వలను తగ్గించుకోవడం, దాని కోసం అణ్వాయుధాలలోని ప్లూటోనియంను వేరు చేయడమనే ప్రక్రియ కోసం ఒక రెగ్యులేటరీ అథారిటీని ఏర్పాటు చేసుకొన్నాయి. అయితే రష్యాకు వ్యతిరేకంగా అమెరికా కార్యక్రమాలను రూపొందించడం, ఆంక్షల్ని విధించడంతో ఈ ఒప్పందాన్ని రద్దు చేసుకుంటున్నట్లు రష్యా అధ్యక్షుడు పుతిన్ ప్రకటించారు.

### ఇరాక్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్‌లో తీవ్రవాదుల దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. అక్టోబర్ 15న రాజధాని బాగ్దాద్ ఉత్తరాన ఒక ప్రాంతంలో అంత్యక్రియలు జరుగుతున్న సమయంలో ఒక ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో సుమారు యాభై మందికి పైగా మరణించారు. మరో యాభై మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులే ఈ దాడికి పాల్పడ్డారని అధికారులు అనుమానం వ్యక్తం చేశారు.

### మయన్మార్‌లో పడవ ప్రమాదం

మయన్మార్‌లో జరిగిన పడవ ప్రమాదంలో వంద మందికి పైగా విద్యార్థులు, స్కాలర్లు మరణించారు. అక్టోబర్ 16న మధ్య మయన్మార్‌లోని చిండ్విన్ నదిలో ఈ ప్రమాదం జరిగింది. పడవ సామర్థ్యం కంటే ఎక్కువ మందిని ఎక్కించడంతో ఈ ప్రమాదం జరిగింది.

### నోబెల్ పురస్కారాలు - 2016

2016 సంవత్సర నోబెల్ పురస్కారాలను ప్రకటించారు. వైద్యరంగంలో జపాన్‌కు చెందిన యోషినోరి ఒషుమికి నోబెల్ దక్కింది. కణాల వినాశనానికి సంబంధించి (ఆటోఫాగి) చేసిన ఆవిష్కరణలకు ఈ అవార్డు లభించింది. కణాల స్వయం భక్షణకు భంగం కలిగితే పార్కిన్సన్స్, డయాబెటిస్ లాంటి ప్రాణాంతక వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంది. ఈ స్వయం భక్షణకు గల కారణాలను ఆవిష్కరించి, విశదీకరించారు. భౌతిక శాస్త్రంలో ముగ్గురు ప్రొఫెసర్లు – యూనివర్సిటీ ఆఫ్ వాషింగ్టన్ ప్రొఫెసర్ డేవిడ్ జె. థౌలెస్, న్యూజెర్సీలోని ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ ఫిజిక్స్ ప్రొఫెసర్ డంకన్ ఎం. హాల్డనె, ఐలాండ్ బ్రౌన్ యూనివర్సిటీ ఫిజిక్స్ ప్రొఫెసర్ మైకెల్ కోస్టర్ లిట్జ్‌రోడ్‌లకు – నోబెల్ అవార్డు ప్రకటించారు. వీరు అత్యాధునిక గణితశాస్త్ర పద్ధతులు ఉపయోగించి పదార్థానికి చెందిన సూపర్ కండక్టర్స్, సూపర్ ఫ్లూయిడ్స్ లాంటి అసాధారణ దశలపై అధ్యయనం చేసి ఎన్నో కొత్త విషయాలను కనిపెట్టారు. ఇక రసాయన శాస్త్రంలోనూ ముగ్గురు శాస్త్రవేత్తలు – యూనివర్సిటీ ఆఫ్ స్ట్రాట్స్‌బర్గ్ ప్రొఫెసర్ జీన్‌పెర్రీ సావేజ్, నార్త్‌వెస్టర్న్ యూనివర్సిటీ ప్రొఫెసర్ సర్ జె ఫ్రేజర్ స్టొడార్ట్, యూనివర్సిటీ ఆఫ్ గ్రోనింజన్ రసాయన శాస్త్ర ప్రొఫెసర్ బెర్నార్డ్ ఫెరింగాలు – నోబెల్‌కు ఎంపికయ్యారు. మానవ శరీరంలోని పరమాణువు యంత్రాలను డిజైన్ చేయడం, ఆ పరమాణువు చేసే సంశ్లేషణ అంశాన్ని వీళ్లు విశదీకరించారు. కొలంబియా అధ్యక్షుడు జువాన్ మాన్యుల్ శాంటోస్‌కు శాంతి నోబెల్ ప్రకటించారు. కొలంబియాలో ప్రభుత్వానికి, వామపక్ష తిరుగాబాటు దారులకు మధ్య అంతర్యుద్ధం నివారణకు నాలుగేండ్ల పాటు కృషి చేశారు. ఆర్థిక శాస్త్రంలో ఇద్దరికి నోబెల్ దక్కింది. కేంబ్రిడ్జ్‌లోని హార్వర్డ్ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ ఒలివర్ హార్ట్, కేంబ్రిడ్జ్‌లోని మసాచుసెట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో అర్థశాస్త్ర ప్రొఫెసర్ బెంట్ హోమ్‌స్ట్రామ్‌లు తాము రూపొందించిన సూత్రాలతో కాంట్రాక్టులు, వ్యవస్థలను అర్థం చేసుకోవడం సులభతరం చేశారు. ఇక నోబెల్ సాహిత్య బహుమతి అమెరికా ప్రఖ్యాత గేయ రచయిత బాబ్ డైలాన్‌కు దక్కింది. అమెరికా గేయ సంప్రదాయంలో కొత్త కవితా భావజాలాన్ని రూపొందించినందుకు గాను బాబ్‌కు సాహిత్య నోబెల్ ప్రకటించారు. ఆయన అసలు పేరు రాబర్ట్ ఎలెన్ జిమ్మర్‌మ్యాన్. బాబ్ రచించిన 'బ్లోయింగ్ ఇన్ ది విండ్', 'ది టైమ్స్ దే ఆర్ ఎ చేంజింగ్' గేయాలు అమెరికా పౌరహక్కులు, యుద్ధ వ్యతిరేక ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చే గీతాలుగా మారాయి.

### పాకిస్తాన్‌లో ఆత్మాహుతి దాడి

పాకిస్తాన్‌లోని క్వెట్టా నగరంలోని పోలీస్ ట్రైనింగ్ అకాడమీపై అక్టోబర్ 25న జరిగిన దాడిలో అరవై మంది పోలీసులు మరణించారు. వంద మందికి పైగా గాయపడ్డారు. బెలూచిస్తాన్ ప్రావిన్స్ రాజధాని శివార్లలోని పోలీసు శిక్షణా కేంద్రంపై ఈ దాడి జరిగింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(సెప్టెంబర్ 1 నుండి సెప్టెంబర్ 30, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1147), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (890) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2037)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 3 | - | 18 | 20 | 5 | - | 5 | 2 | 3 | 1 | 2 | - | 3 | 20 | 26 | - | - | - | 4 | 1 |
| హైదరాబాద్ | - | - | - | 6 | 11 | 3 | 7 | 8 | - | 5 | 9 | 4 | 2 | 2 | 14 | 16 | - | - | - | - | - |
| కరీంనగర్ | - | 3 | 1 | 10 | 12 | 1 | 4 | 1 | - | 1 | 3 | 2 | - | 6 | 18 | 12 | - | - | - | - | 3 |
| ఖమ్మం | - | - | - | 6 | 10 | 11 | 7 | 3 | - | - | 1 | 1 | - | 9 | 18 | 20 | - | - | - | - | 1 |
| మహబూబ్‌నగర్ | - | 6 | - | 12 | 11 | 7 | 9 | 7 | - | 8 | 5 | 10 | 19 | 14 | 39 | 10 | - | - | - | - | - |
| మెదక్ | - | 19 | 2 | 4 | 2 | 3 | - | 1 | 2 | - | 14 | 19 | 16 | 39 | 116 | 49 | - | - | - | 6 | 1 |
| నల్గొండ | - | 6 | 1 | 7 | 10 | 1 | 4 | 4 | 2 | 3 | 1 | 1 | 3 | 7 | 33 | 14 | - | - | - | - | - |
| నిజామాబాద్ | - | 1 | - | 8 | 6 | - | 3 | - | 1 | 3 | 1 | 1 | - | 9 | 12 | 15 | - | - | - | - | - |
| వరంగల్ | - | 6 | - | 12 | 8 | 7 | 9 | 2 | - | - | - | 6 | 1 | 12 | 19 | 22 | - | - | - | - | 1 |
| రంగారెడ్డి | - | 2 | - | 2 | 7 | 3 | 2 | 1 | - | - | 3 | 7 | - | 6 | 22 | 16 | - | - | - | - | - |
| **తెలంగాణ** | **-** | **46** | **4** | **85** | **97** | **41** | **45** | **32** | **7** | **23** | **38** | **53** | **41** | **107** | **311** | **200** | **-** | **-** | **-** | **10** | **7** |
| అనంతపురం | - | 9 | - | 9 | 26 | 2 | 4 | 7 | 4 | 6 | 2 | 7 | 5 | 12 | 52 | - | - | - | - | - | - |
| చిత్తూరు | - | 1 | - | 5 | 9 | 5 | 9 | - | 2 | 2 | 7 | 9 | 7 | 5 | 55 | 4 | - | - | - | - | - |
| కడప | - | 1 | - | 4 | 15 | - | - | - | 3 | 1 | 2 | 4 | - | 3 | 29 | 9 | - | - | - | - | - |
| గుంటూరు | - | 3 | - | 2 | 5 | 3 | 1 | - | - | 1 | 2 | 1 | 1 | 8 | 18 | 16 | - | - | - | - | - |
| కృష్ణా | - | - | - | 3 | 5 | 4 | - | - | 1 | 1 | 3 | 2 | 1 | 2 | 14 | 18 | - | - | - | - | - |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | - | - | - | 2 | 4 | 4 | 8 | 1 | 3 | 3 | 3 | 1 | 1 | 2 | 23 | 18 | - | - | - | - | - |
| ప్రకాశం | - | - | - | 7 | 9 | - | 3 | 2 | - | 2 | 1 | 1 | 1 | 3 | 26 | 23 | - | - | - | - | - |
| శ్రీకాకుళం | - | - | - | 2 | 4 | 1 | 5 | 1 | - | 3 | 1 | - | 2 | 7 | 17 | 8 | - | - | - | - | 1 |
| పశ్చిమ గోదావరి | - | - | - | 5 | 2 | 6 | 4 | 2 | 1 | 2 | 2 | 3 | - | 1 | 19 | 12 | - | - | - | - | - |
| నెల్లూరు | - | - | - | 1 | 5 | - | 3 | - | - | 5 | - | 1 | 1 | 3 | 27 | 14 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 4 | 5 | 1 | 3 | 2 | 1 | 3 | 1 | - | 1 | 5 | 12 | 8 | - | - | - | - | 1 |
| విశాఖపట్నం | - | - | - | 4 | 6 | - | 1 | - | - | 9 | - | 1 | 2 | 3 | 18 | 15 | - | - | - | 10 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **14** | **-** | **48** | **95** | **26** | **41** | **15** | **15** | **38** | **24** | **30** | **22** | **54** | **310** | **145** | **-** | **-** | **-** | **10** | **3** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం–ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |
| తెలంగాణ విద్యుత్ రంగంలో ఏం జరుగుతున్నది? | కె. రఘు | 60 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం–1 | విరసం ప్రచురణ | 270 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | విరసం | 125 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయనానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | రు. 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 60 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| వామపక్ష కమ్యూనిజం – ఒక బాలారిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్వేస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| దళితులు – రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 – 2012) | 200 |
| సృజన (1966–1992) | 240 |
| అరుణతార (1970–2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 184 - November 2016 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/10/2016 • Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

# ఆర్ఎస్ రావు స్మారక సదస్సు 2016

## నవంబర్ 12, 2016 శనివారం - హైదరాబాద్

గత ఐదు సంవత్సరాలుగా నిరంతరాయంగా జరుగుతున్న ఆర్ఎస్ రావు స్మారక సదస్సు ఈ సంవత్సరానికి నవంబర్ 12, శనివారం, ఉదయం 10 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు, షోయెబ్ హాల్ (సుందరయ్య విజ్ఞాన కేంద్రం), బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్‌లో జరుగుతుంది.

ఎప్పట్లాగనే ఈ సారి సదస్సు కూడ అమరులు ఆర్ఎస్ రావు గారు తీవ్రంగా కృషి చేసిన, సమాజం అత్యవసరంగా ఆలోచించవలసిన రాజకీయార్థిక విషయాల మీద పత్రాలు, ఉపన్యాసాలు, చర్చలు ఉంటాయి.

**భారతీయాంగ్ల నవలల్లో సమాజ చిత్రణ: ఉత్పత్తి సంబంధాల చర్చ కొనసాగింపు** – ప్రొ. జి ఎన్ సాయిబాబా; **తెలంగాణలో మారుతున్న భూసంబంధాలు** – నలమాస కృష్ణ; **భూసంబంధాలలో మార్పు – ఒక గ్రామ అధ్యయనం** – వై. భాస్కర్ పత్రాలతో సహా మరికొన్ని పత్రాలు, ఉపన్యాసాలు ఉంటాయి. అందరూ ఆహ్వానితులే.



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao